Nammandi ! Nammakapondi !!

# Ivee vastavaalu

Essays on

"Exposing Pseudo Science with Scientific Explanations"

*Author :* B. Sambasiva Rao



Editorial Board Director
Isanaka Muralidhar

Publication No.4
First Published: November, 2019
Copies: 1700

*Published by*
Swechhalochana Publications
S.Venugopal, Manager,
H.No. 1-6-133/6/C/2, Behind Sessions Court,
Subhash nagar, Mahaboobnagar-509001
Cell: 99088 25459. E-mail: varma.nirala@gmail.com

*Price:* Rs. 130/-

*Sole Distributors*
Navodaya Book House,
#3-3-865, Street opp. to Arya Samaj Mandir,
Kachiguda, Hyderabad-500027
Email : navodayabookhouse@gmail.com
Phone : 040- 24652387 / 92474 71361

*Printed at*
Rowshni Graphics,
Uppal, Hyderabad-39. Cell: 9246172133

# మా మాట

**ఆదిమ** మానవుని అజ్ఞానమే వివిధ ప్రాంతాల్లో వివిధ మతాలకు మూలమైంది. మతాన్ని అనుసరించేవారు ఎలా జీవించాలో ప్రతిమతమూ నిర్దేశించింది. కొన్ని పవిత్ర గ్రంథాలను, ఆచారాలను, నమ్మకాలను, ఏర్పరచి అమలు చేయించింది. అవన్నీ దైవ ప్రోక్తాలని, పరమ సత్యాలనిప్రచారం చేసింది. వాటిని అంగీకరించని వారిని అనేక విధాలుగా శిక్షించింది. కొన్ని వేల ఏళ్ల క్రితం ఏర్పడినా, వాటిని కనుగొన్న వారు మహా మేధావులు, మహర్షులు గనుక, అవి నేటికీ శాస్త్రీయ సత్యాలని మతవేషధారులు పలువురు ప్రవచిస్తూ ఉండటం మనం చూస్తున్నాం.

నేడు మనం సైన్సు యుగంలో బతుకుతున్నాం. ఏది మంచి, ఏది చెడు, ఏదసత్యం, ఏది సత్యం, దేన్ని అనుసరించాలి, దేన్ని విడనాడాలి అని తెల్సుకోవటానికి మనకు ఒక ప్రమాణం వుంది. అదే శాస్త్రీయపద్ధతి. నవనవోన్మేషణంగా, అభివృద్ధి చెందుతున్న సైన్సు, గతంలో ఉన్న మంచిని గుర్తిస్తూనే, ఈనాటికి పనికిరాని విశ్వాసాలను, ఆచారాలను, మత గ్రంథాల్లోని పవిత్రతను నిగ్గదీసి ప్రశ్నిస్తున్నది. మత ఛాందసులకు, సాంప్రదాయ ప్రీతి గల వారికి ఇది సహజంగానే మింగుడు పడదు. నిరూపణకు నిలుస్తున్న సైన్సు ను కాదనలేక, మతాభినివేశాన్ని విడువ లేక, ఆ రెండింటినీ కలిపి, తమ మత ఔన్నత్యాన్ని చాటింప బూనుతారు. అంటే మతవిశ్వాసాలను, ఆచారాలను, పురాణ కల్పనా కథలను, సైన్సుతో సమన్వియించాలని చూస్తారు. అలా జనంలోకి వచ్చేదే "సూడో సైన్సు" (కుహనా విజ్ఞానం).

నిన్నమొన్నటి వరకు సూడో సైన్సు ప్రచారం జనాంతికంగా సాగుతుండేది. దృశ్య శ్రవణ మాధ్యమాల బాధ్యతా రాహిత్యం, వ్యాపారాపేక్షల వల్ల ఇపుడు విస్తృతంగా వ్యాపిస్తోంది. ప్రజల బాగోగులను పట్టించుకోవాల్సిన ఎం.ఎల్.ఏలు, ఎం.పి.లు, మంత్రులు, ముఖ్యమంత్రులు, ప్రధానమంత్రులు, ప్రభుత్వ యంత్రాంగంలోని అధికార గణం, న్యాయవ్యవస్థలోని ప్రముఖులు సైతం ఏ మాత్రం విచక్షణ లేకుండా సూడో సైన్సు ప్రచారంలో పోటీ పడుతున్నారు. ప్రతిష్ఠాత్మకమైన "భారతీయ సైన్సు మహా సభల" వేదిక పై కూడా నిరభ్యంతరంగా సాగుతున్న సూడో సైన్సు ప్రచారాన్ని చూసి, జుగుప్సతో, నోబెల్ శాస్త్రవేత్తలు కూడా ఆ సభలను బహిష్కరిస్తున్నారు. ప్రజలకు ఏది సైన్సో, ఏది కాదో తెలియని గందరగోళం ఇపుడు విద్యావంతుల్లో కూడా ఎక్కువగానే వుంది. భారతీయ లౌకికతను నాశనంచేసి మత రాజ్యాన్ని నెలకొల్పటానికే ఈ గందరగోళం తోడ్పడుతుందని కొందరు మేధావులు ఊహిస్తున్నారు.

ఇలాంటి పరిస్థితుల్లో, వ్యాప్తిలో వున్న కొన్ని నమ్మకాలు, ఆచారాలు, ప్రచారాలలో వెల్లడవుతున్న సూడో సైన్సును గుర్తించి, వాటి వెనుక దాగిన శాస్త్రీయ వాస్తవాలను తెలుగు పాఠకుల ముందుంచాలని "స్వేచ్ఛాలోచన ప్రచురణలు" భావించింది. ఈ ప్రయత్నం ప్రజల్లో వివేచనను పెంచటానికే తప్ప, ఎవర్నీ/దేనినీ కించపరచాలని కాదు.

ఈ సంకలనంలో తన కార్టూన్‌లను వాడుకోవటానికి అనుమతించిన ప్రఖ్యాత కార్టూనిస్ట్ వర్చస్వి గారికి, హనుమంతరావు గారికి, అందంగా అచ్చు పని గావించిన రౌష్ని గ్రాఫిక్స్, హైదరాబాద్ వారికి ధన్యవాదాలు తెలుపుతున్నాం.

**– ప్రచురణకర్తలు**

# ఈ పుస్తకంలో...

# ఇదీ 'అమర' రహస్యం!



2004సం॥లో 'శివ్ శంకర్' అని తెలుగులో ఒక సినిమా వచ్చింది. అందులో హీరో మోహన్ బాబు బౌద్ధానుయాయి. స్నానం చేసాక, తడిగా వున్న ఎర్రటి ఉత్తరీయాన్ని బ్రహ్మానందం చేతికిచ్చి, ముళ్ళ కంచెలో చిక్కుకుని బాధపడుతున్న ఒక మేకపిల్లను రక్షించడానికి వెళతాడు. బ్రహ్మానందం ఆ ఎర్రటి ఉత్తరీయాన్ని ఒక మైలు రాయి చుట్టూ ముసుగులా వేసి దానిపై ఒక రాయి పెట్టి హీరోను అనుసరిస్తాడు. ఇంతలో ఒక బాటసారి అటుగా వచ్చి, గుడ్డ చుట్టి ఉన్న మైలురాయిని గంగానమ్మ దేవతగా భావించి పూజలు మొదలుపెడతాడు. దాన్ని చూసిన కొందరు యాత్రికులు కూడా అక్కడకు చేరి, కొబ్బరికాయలు కొడుతూ, హారతులు పడుతూ భజనలు చేస్తారు. మరికొందరు ఒక మేకపోతును తెచ్చి బలి ఇవ్వబోతుండగా హీరో వచ్చి అడ్డుకుని, అది తన ఉత్తరీయమని, చెబుతూ మైలురాయి నుంచి పైకి తీసి చూపుతాడు. అంతా ఆశ్చర్యంతో 'అదా సంగతి' అని తెల్లమొగాలు వేస్తారు.

సినిమాలో ఈ సన్నివేశం పెట్టడంలో దర్శకుని ఉద్దేశం ప్రేక్షకులకు అర్థమవుతుంది. ఈ దేశంలో వున్న మెజారిటీ ప్రజలు కించిత్తైనా ముందూ వెనుకా ఆలోచించకుండా, ప్రతిదాన్నీ గుడ్డిగా ఎలా ఆరాధిస్తారో చెప్పడమే అతని ఉద్దేశం. కాషాయం కనపడితే చాలు, ఆలోచన మొద్దుబారి, భయమూభక్తీ నిద్రలేస్తాయి. ఒక

వస్తువు, ఏ ప్రాకృతిక కారణం వల్లనో, వికృతంగా కనిపిస్తే, దాని ఆకృతిని ఏ దేవుని ప్రతికృతిగానో భావించి చేతులు జోడిస్తారు. బొప్పాయిని వినాయకునిగా, వంకాయను శివలింగంగా, పొట్లకాయను ఆదిశేషునిగా... కొలిచినట్లు వార్తలు రావడం మనకు తెలియనిది కాదు. ఏదో ఎందుకు? మంచుకుప్పను శివలింగమని ఎంచుతూ ఏటేటా జమ్ము-కాశ్మీర్ రాష్ట్రంలోని హిమాలయాల్లో 'అమరనాథయాత్ర' చేయటం లేదూ!

ప్రతియేటా జులై మొదటి వారంలో అమర్‌నాథ యాత్ర మొదలౌతుంది. మొత్తం 48రోజుల పాటు హైందవ భక్తులు ఆ యాత్రకు బారులు కడతారు. వందలు, వేలు కాదు, లక్షల మంది ఎన్నో కష్టాలకు ఓర్చుతూ, అనారోగ్యాన్ని సైతం లెక్కచేయకుండా, డబ్బుకు వెనకాడకుండా ఆ యాత్రకు సన్నద్ధమవుతారు. 'అమరనాథగుహ'లో మంచుగడ్డను శివలింగంగా భావించి, భక్తితో తన మొక్కును చెల్లించి, తమ కోర్కెలు ఆ లింగాకృతికి విన్నవించి సంతృప్తులవుతారు. ప్రకృతి సిద్ధంగా ఏర్పడ్డ 'మంచుకుప్ప' అని వారికి తెలిసినా, వారి భక్తి నేత్రాలు మాత్రం దానిని పరమశివునిగా చూస్తాయి. **వాస్తవాన్ని విశ్వాసంతో కప్పివేసి వివేచనను భక్తిమత్తుతో నిద్రపుచ్చగల శక్తి ఆధ్యాత్మికతకు వుంది. ఆ శక్తికి ఊతంగా పండితులల్లే పురాణగాధలు, ఆరాధనా రీతులు పనిచేస్తాయి.**

మంచుతో ఏర్పడే గడ్డను లింగాకృతిగా భావించి, దానికి 'అమరనాథుని'గా పేరుంచి, అందుకు తగిన కథలనల్లి జనంలోకి వదిలారు హైందవపండితులు. విశ్వాసాన్ని బలంగా పాదుకొల్పడానికి తగిన ఘటనలను, సన్నివేశాలను కల్పించడంలో వారికి వారే సాటి. అలాంటి కల్పనలతో ప్రచారంలో వున్న అమరనాథుని స్థలపురాణం గురించి తెలుసుకుందాం. ఆ క్షేత్రానికి 'అమర'నాథ పేరు రావడానికి కారణంగా ఈ కథ చెప్తారు -

## పేరెలా వచ్చింది?

ఒకరోజు శివుడు తన మెడలో కపాలమాల (పుర్రెల దండ) వేసుకోబోతున్నాడు. అపుడు ప్రక్కనే ఉన్న పార్వతి, "ఎప్పటి నుండి ఈ దండను వేసుకుంటున్నావు?" అని అడిగింది. "నువ్వు పుడుతున్నప్పటినుంచి" అని శివుని జవాబు. అది విన్న పార్వతికి ఒక సందేహం పుట్టింది. "నువ్వెందుకు చావులేకుండా అమరునిగా వుండగల్గుతున్నావు? నేనెందుకు మళ్ళీ మళ్ళీ పుడుతున్నాను?" అని అడిగింది. "నేను అమరుణ్ణి" అన్నాడు. "అమరత్వం అంటే ఏమిటి? అసలీ విశ్వం ఎలా ఏర్పడింది?" అని అడిగింది. "అదంతా ఓ పెద్ద కథ. ఇప్పుడు వద్దులే" అన్నాడు. చెప్పాల్సిందేనని పార్వతి పట్టుబట్టింది. దాంతో, చెప్పక తప్పదనుకున్నాడు.

అమరత్వం గురించి అందరికీ తెలియకూడదు. తెలిస్తే వారూ అమరులై తనంతటి వారవుతారు. కనుక, ఏ ప్రాణీలేని ఏకాంతస్థలంలో తన కాంతకు అమరత్వకథ చెప్పాలనుకున్నాడు శివుడు. అందుకు, హిమాలయాల్లో వున్న ఒక గుహ అనువైనదిగా తోచింది.

తన వాహనం నందిని ఎక్కి, పార్వతీ గణపతులతో కైలాసం నుంచి బయల్దేరాడు శివుడు. పహల్‌గావ్ అనే ఊరి దగ్గరకు రాగానే నంది వాహనాన్ని అక్కడే వుండమన్నాడు. (ఆ వూర్ని ఇప్పుడు బైల్‌గావ్ అని కూడా భక్తులు పిలుస్తున్నారు ఈ కథ వల్లనే కావచ్చు!) కొంతదూరం వెళ్ళాక తలమీదున్న చంద్రుణ్ణి పడేసాడు (అదే చందన్ వాడీ). మరికొంత దూరం ప్రయాణించాక ఒక సరస్సు ఒడ్డున తన వంటిమీదున్న పాముల్ని వదిలేసాడు (అవే శేష్‌నాగ్ కొండలట!) ఇంకొంత దూరం వెళ్ళాక మహాగణపర్వతం వచ్చింది. గణపతిని అక్కడుండమన్నాడు. ఇంకా కొంత దవ్వు వెళ్ళగానే అయిదు సరస్సుల ప్రాంతం 'పంచతరణి' వచ్చింది. శివుడు భూతాలకు అధిపతి గనుక, ఆ పంచభూతాలను ఆ పంచతరణి దగ్గర వదిలేసాడు. ప్రక్కన పార్వతి, తన వంటి మీద జింకచర్మం మిగిలాయి. తానెంచుకున్న గుహలోనికి ప్రవేశించాడు శివుడు. ఒక అరుగు చూసుకున్నాడు. దాని మీద పార్వతిని కూర్చోబెట్టాడు. మొలకు చుట్టుకున్న జింకచర్మాన్ని తీసి కింద పరిచాడు. దిగంబరునిగా కూర్చున్నాడు. అనుమానం వచ్చింది ఎవరైనా తమను గమనిస్తున్నారేమోనని. ధ్యానంలోకి వెళ్ళి కాలాగ్ని (మూడోకన్ను) నుంచి 'రుద్ర' అనే అగ్గిని సృష్టించి, ఆ గుహచుట్టూ ఏ ప్రాణీ లేకుండా చేయమన్నాడు. ఇంకెవరూ లేరని నిర్ధారించుకున్నాక మొదలుపెట్టాడు అసలుకథ. అయితే, ఆ జింకచర్మం కింద ఒక గుడ్డు ఉందని తెలిసింది. అది ప్రాణి కాదులే అని పట్టించుకోలేదు. కానీ, అందులో వున్న రెండు కవల ప్రాణులు శివుడు చెప్పిన 'అమరత్వ' కథను విన్నాయట. గుడ్డులోంచి బయటపడ్డాక, రెండు పావురాలై ఇప్పటికీ తిరుగాడుతున్నాయట! ఇంతకీ 'ఏకాంత ప్రదేశం'లో పార్వతీకాంతతో ఆ దిగంబరుడైన ఉమాకాంతుడు చెప్పిన 'అమర' రహస్యమేమిటో ఈ కథాకాల్పనికుడు చెప్పలేదు. ఎందుకు అని అడిగామనుకోండి, అది రహస్యమాయె, ఎవరూ వినలేదాయె! తనకు మాత్రం ఎలా తెలుస్తుంది? అని తప్పించుకోగలడు.

ఈ కథలో చెప్పిన ఊళ్ళు, ప్రదేశాలు అమరనాథయాత్రికులకు కనపడతాయి. ఈ కథ వల్ల ఆ వూళ్ళలో కూడా ఆయా గుళ్ళు వెలసి ఆరాధనలు, అర్చనలు, జరుగుతూ భక్తి వ్యాపారంలో భాగమయ్యాయి. అమరనాథ గుహను చేరడానికి రెండు మార్గాలుంటాయి. రాష్ట్రానికి ఒక రాజధాని అయిన జమ్మూ నుంచి 315 కి.మీ. దూరంలో, మరో రాజధాని శ్రీనగర్ నుంచి 96 కి.మీ.లదూరంలో పహల్‌గావ్ వుంది.

అక్కడి నుంచి 16 కి.మీలదూరంలో చందన్‌వాడీ (నిజానికి గంధపుచెట్లు ఉంటాయి కనుక, ఆ పేరు వచ్చింది) వుంది. ఆ వూరి నుంచి నిటారుగా వుండే కొండలెక్కి 'పిస్సు'లుచేరాలి. అక్కడ శివుని చేతిలో చనిపోయిన రాక్షసులు శవాలుంటాయని చెప్తారు. ఆ శిఖరాల నుంచి నిటారుగా దిగుతూ కిందకి చేరి, ఏడు శిఖరాలుండే 'శేష్‌నాగ్' చేరాలి. మళ్ళీ అక్కడి నుంచి, 4-6 కి.మీ. దూరంలో వున్న 'పంచతరణి' చేరితే విశ్రాంతి తీసుకోవచ్చు. అక్కడికి అమరనాథగుహ 6 కి.మీ. దూరంలో వుంటుంది. ఉదయం బయల్దేరి వెళితే గానీ, సాయంత్రానికి తిరిగిరాలేరు. తప్పక తిరిగి రావాలి గనుక, ఉదయమే బయల్దేరాలి.

దీని కన్నా కొంచెం తక్కువ దూరంలో గల మార్గం మరొకటి వుంది. శ్రీనగర్ అవతల వున్న బాల్‌తల్ (జమ్మూకి 400కి.మీ) వెళితే, అక్కడికి గుహ 14కి.మీ. దూరం. గుర్రాల మీద వెళ్ళి రావచ్చు. దారంతా ఇరుకు, నిటారుతనం ఎక్కువ గనుక, ఆ కొద్దిదూరమే రోజంతా పడుతుంది. డబ్బున్నవారికి కష్టం లేకుండా, ప్రభుత్వం పంచతరణి వరకు హెలికాప్టర్లు నడుపుతోంది.

ఈ యాత్ర గురించి ఇన్ని వివరాలెందుకు చెప్పవలసివస్తున్నదంటే, ఎన్ని కష్టాలు పడి ఈ యాత్ర చేస్తారో తెలియడానికి. దాదాపు 30-40 కిలోమీటర్ల దూరం నడక తప్ప మరే యానకమూ వుండదు. నిటారుగా పాకుతూ. అంతే నిటారుతలం నుంచి దిగుతూ నడవడం ఎంత కష్టం! వయసు మళ్ళినవారి బాధ వర్ణనాతీతం. అనారోగ్యంతో వుండేవారికి, ఏమైనా అవసరమైతే, వైద్యం కూడా వుండదు. ఆ లింగాకృతిని దర్శించాలనుకునే వారిలో యువకుల కంటే, వయసు ముదిరిన వారే ఎక్కువ. ఒక్కసారైనా ఆ మంచులింగాన్ని దర్శిస్తే మోక్షం వస్తుందని నమ్మకం. అందుకే వృద్ధాప్య సమస్యలను పక్కనపెట్టి, అనారోగ్యాన్ని కూడా లెక్కచేయక బయల్దేరుతారు. ఇక స్త్రీల కష్టాల గురించి మనం వూహించవచ్చు. కాలినడకతో ప్రయాణించాల్సిన ప్రాంతమంతా వాతావరణ దృష్ట్యా ప్రమాదకరమైనదని వాతావరణ శాస్త్రవేత్తలంటున్నారు. అక్కడి చలిగాలులకు చర్మం పగుళ్ళిస్తుంది. ఆ శిఖరాలపై ఆక్సిజన్ తక్కువస్థాయిలో వుంటుంది. ఊపిరాడక చనిపోయే వారెందరో! ప్రభుత్వమే అలాంటి వారి లెక్కలను విడుదలచేస్తూ వుంటుంది. 1996వ సం॥లో 242మంది చలికి తట్టుకోలేక మరణించారు. 2012లో 130 మంది, 2017లో 50మంది, 2018లో 54 మంది 2019లో 65 మంది, దాకా మరణించినట్లు వార్తలొచ్చాయి. ప్రతి ఏటా కనిష్టంగా 50-100 వరకు ఇలా మరణిస్తున్నవారున్నారు.

దీనికి తోడు 'పులి మీద పుట్ర'లాగా ముస్లిం ఉగ్రవాదమొకటి. ఎక్కడ హిందువులు కన్పిస్తే అక్కడికక్కడే విచక్షణారహితంగా క్రూరంగా చంపివేయడం వారికి పవిత్రకార్యం!

అమర్‌నాథ యాత్రికులను చంపేస్తామన్న హెచ్చరికల వల్ల 1991-1995 మధ్యకాలంలో ఆ యాత్రనే ప్రభుత్వం అనుమతించలేదు. భక్త వశంకరుడని చెప్పబడే ఆ పరమశివుడు సైతం ఈ విషయంలో ఎందుకు కలుగజేసుకోలేదో! చివరికి, ఆ ఉగ్రవాదులే దయ తలచి, ఆ 'యాత్రికులను ఏమీ చేయము' అని హామీ ఇచ్చాక 1996 నుంచి మళ్ళీ మొదలయింది. అయితే, ఆ హామీని మన్నించని మరో ఉగ్రవాద సంస్థ లష్కరే తోయిబా చేసిక హంతక చర్యల వల్ల 2000 సం॥లో 95మంది యాత్రికులు ప్రాణాలు పోగొట్టుకున్నారు.

ఇలా ప్రాణాలు పోతున్నా, లక్షలాది భక్తులు ఎందుకు వెళుతున్నారు? అందుకు కారణం, వారిని నడిపిస్తున్న ఆధ్యాత్మిక చింతన. ఆ యాత్రలో చనిపోతే 'అమరత్వం' పొందవచ్చు, మళ్ళీ జన్మంటూ లేకుండా కైలాస వాసాన్ని పొందవచ్చన్న భ్రమపూరిత విశ్వాసపు వంచన. ఇలాంటి విశ్వాస మరీచికల వెంటబడి విలువైన జీవితాన్ని కోల్పోవడం ఎంతో బాధాకరం!

## ప్రాచీన చరిత్ర

నిజమే, అమరనాథగుహకు ఎంతో ప్రాచీన చరిత్ర వుండవచ్చు. క్రీ.పూ.300 ప్రాంతం వాడైన ఆర్యరాజు మంచులింగాన్ని పూజించాడని కాశ్మీరకథల్లో చెప్పి వుండవచ్చు. 11వ శతాబ్ది నాటి కల్హణుడు తన 'రాజతరంగిణి'లో దానిని రాసాడన్న సాక్ష్యం కొందరు చూపవచ్చు. మధ్యయుగాల్లో దాని పూజలు ఆగిపోయాయని, 15వ శతాబ్దిలో ఓ గొర్రెలకాపరి చూసి, పదిమందికీ చెప్పడంతో, మళ్ళీ ఆ గుహ గురించి తెలియవచ్చిందనీ జనం నమ్మవచ్చు. కానీ, ఆ రోజుల్లో, ఇప్పటిలాగా లక్షలాది మంది అక్కడికి బారులు కట్టారని ఎక్కడా చెప్పలేదు. ఇంతమంది ప్రాణాలు కోల్పోతూ వుండేవారని ఏ రచయితా రాయలేదు. తమ విశ్వాసంతో బతికే భగవంతుని దర్శనానికి తప్పనిసరిగా అంతదూరం ప్రయాణించాలని, అన్ని కష్టాలు పడాలని ఆనాటి వారనుకొనేవారని ఏ చరిత్రా ఉటంకించలేదు. మరి ఈ 20వ శతాబ్ది ద్వితీయార్ధంలోనే ఎందుకింత భక్తి ముదిరింది? ఏశక్తులు దీనికి కారణం? తేలిగ్గానే ఊహించవచ్చు. భక్తిని వ్యాపార, రాజకీయ ప్రయోజనాల కోసం వాడుకోవడానికి అమర్‌నాథ్ యాత్ర ఉపయోగపడుతున్నది.

## 'విదేశీ అమరనాథులు'

అమర్‌నాథ్ గుహలాంటి 'అద్భుతం' గల గుహలు ఇతర దేశాల్లోనూ ఉన్నాయి. వాటిల్లో ముఖ్యంగా చెప్పుకోవలసింది- వెర్ఫన్‌ఆల్ఫ్ మంచుగుహ. ఇది ఆస్ట్రియా దేశంలో వుంది. ప్రపంచంలోనే అతిపెద్ద మంచు'లింగా'లున్న గుహ. సాల్స్‌బరీ




పట్టణానికి దక్షిణంగా 40కి.మీ. దూరంలో వుంది. దీని పొడవు 42కి.మీ. ప్రతియేటా 2 లక్షలమంది ఆ గుహను చూడడానికి వస్తారు. అయితే, ఆ గుహలో ఒక కిలోమీటర్ దూరం వరకే సందర్శకులను అనుమతిస్తారు. 19వశతాబ్దిలో ఏర్పడిందని అంచనా. 1879లో ఆంటన్ పోసెల్ట్ అనే ప్రకృతి శాస్త్రవేత్త దాన్ని వెలుగులోకి తెచ్చాడు. దాన్ని గురించి స్థానికులకు అంతకుముందే తెలుసు. లోనికి వెళ్ళేందుకు భయపడేవారు. దాన్ని 'నరకద్వారం' అని భావించి, ఎవ్వరికీ చెప్పేవారు కాదు. 19వశతాబ్దిలో వెల్లివిరిసిన వైజ్ఞానిక స్పృహ వల్ల ఐరోపా దేశాలన్నింటా ఇటువంటి 'నరకద్వారా'లను 'ప్రాకృతిక స్వర్గధామాలు'గా మార్చారు శాస్త్రవేత్తలు. 'కనీసం ఒక్కసారైనా జీవితంలో ఇటువంటి దృశ్యాలను వీక్షించాలి' అన్న తృష్ణను కలిగించారు. అయితే, దాని పరమార్థం మోక్షప్రాప్తో, జన్మరాహిత్యమో, దైవసాన్నిధ్య సంసాధనో కానేకాదు. ప్రకృతిలోని రామణీయకతను వీక్షించి, పులకించి, ఒక మధురానుభూతిగా మిగుల్చుకోవడం. దానికంటే మించిన పరమార్థం ఏదీ వుండదు. అమర్‌నాథ్ గుహకైనా ఇది వర్తిస్తుంది. ఆ గుహను చేరేమార్గం, గుహ చుట్టూ వుండే ప్రకృతి, గుహలోపలి మంచుకుప్ప దర్శనీయాలు, ఆకర్షణీయాలే కావచ్చు. ఆధ్యాత్మిక లక్ష్యాల సిద్ధి కోసం అంత కష్టపడి, శారీరక మానసిక క్లేశాలను భరిస్తూ యాత్ర చేస్తే లభించేది ఆధ్యాత్మిక తృప్తికావచ్చు కానీ, 'ప్రకృతి మధురానుభూతి'గా మిగిలిపోదు. ఆస్ట్రియా ప్రభుత్వం ఆల్ఫ్స్ గుహల సందర్శన కోసం చేసిన ఏర్పాట్లలో సగమైనా మన ప్రభుత్వం చేయగల్గితే మరణాలు తగ్గుతాయి.

ఇంతకు, లింగాకృతిగా భావించే రీతిలో మంచుగడ్డలు, కుప్పలు ఎలా ఏర్పడతాయి? వాటి వెనుక వున్న వాస్తవం ఏమిటి? 'అమరనాథ శివలింగం' ఏటేటా ఎలా ఏర్పడుతున్నది? మొదలైన సందేహాలకు జవాబులు తెలియాలి కదా!

ఈ ప్రశ్నలన్నింటికీ జవాబులు చాలా సామాన్యమైనవి. మనం ఇళ్ళల్లో రిఫ్రిజిరేటర్లు చూస్తుంటాం. అందులో 'డీప్ ఫ్రీజర్' భాగం వుంటుంది. దాన్లో నీళ్ళ గ్లాసు వుంచితే, కొన్ని గంటల్లో ఆ నీళ్ళు మంచుగడ్డగా మారతాయి. ఆ 'ఫ్రీజర్'లో నీరు బొట్లుబొట్లుగా పడే ఏర్పాటు చేసామనుకోండి ఆ బొట్లు కూడా వేలాడే మంచుగడ్డలుగా మారి అందంగా కన్పిస్తాయి. ఇదే అమరనాథ గుహలోను జరుగుతోంది.

అమరనాథ గుహపై భాగాన ఒక నీటి సరస్సు వుంది. దానిని ఇప్పుడు 'రామకుండం' అంటున్నారు. వేసవిలో ఏర్పడే పగుళ్ళ కారణంగా, అందులోని నీరు బొట్లుబొట్లుగా కిందికి పడుతూ, ఆ గుహలో వుండే అతిశీతలత్వం కారణంగా గడ్డకడుతుంది. సున్నా డిగ్రీ సెల్సియస్ కంటే తక్కువ ఉష్ణోగ్రత వున్న చోట నీరు గడ్డకట్టడం సాధారణమే. ఆ గుహలోపల అంత చల్లదనం వుంది కనుక ఆ నీరంతా గడ్డగా స్తంభాకృతి దాల్చుతుంది. బొట్లు పడుతున్నంత కాలమూ మంచుగడ్డ పరిమాణం కూడా పెరుగుతుంది. ఇదంతా ఆషాఢ, శ్రావణ మాసాల్లో జరుగుతుంది కనుక ఈ యాత్రను 'శ్రావణ మేళా' అని కూడా అంటారు. శ్రావణ పౌర్ణమి నాడు ఆ మంచుగడ్డ పెద్దదిగా కన్పడడానికి కారణం అప్పటికే ఎక్కువ నీరు పడివుండడమే. యాత్రికులను ఆ రోజు వరకే అనుమతిస్తారు. ఆ తర్వాత, వర్షాకాలం శీతాకాలాల్లో నీరు పడడం ఆగిపోయి, మంచుకుప్ప తరిగిపోతుంది గనుక, ఆ ప్రాకృతిక వింత ప్రాధాన్యత కోల్పోతుంది.

ఇలాంటి మంచుకుప్పలను 'Ice Stalactites' అంటున్నారు భూభౌతికశాస్త్రవేత్తలు. ఇవి గుహల్లోనే కాదు, బహిరంగ ప్రదేశాల్లోనూ ఏర్పడుతాయి. వాతావరణంలో ఉష్ణోగ్రత సున్నా కంటే తక్కువ డిగ్రీల స్థాయికి చేరినపుడు, వాతావరణంలోని తేమ కూడా గడ్డకడుతుంది. వర్షం పడితే, ఆ నీటిధారలు కూడా ఇళ్ళ మీద, చెట్ల మీద, స్తంభాల మీద, వేలాడే మంచుతోరణాలుగా కన్పిస్తాయి. కర్కాటకరేఖకు దూరంగా వుండే దేశాల్లో ఇలాంటి దృశ్యాలు సాధారణమే. సముద్రనీటిలో వుండే ఉప్పు సాంద్రత కంటే ఎక్కువ సాంద్రత గల నీరు భూమి అడుక్కి చేరేటపుడు కూడా ఇలాంటి మంచు కళాకృతులు ఏర్పడుతాయట! వాటిని 'Brinicles' అంటారు. ఇవికూడా లింగాకృతుల్లో, ఇతర అనేక ఆకృతుల్లో ఏర్పడుతుంటాయి. అక్కడికి వెళ్ళటం కుదిరితే గనుక వాటికి సంబంధించిన "శివలింగ పూజలు", పురాణ కథలు, ఆరాధన పద్ధతులను కల్పించడానికి హిందూ పండిత ప్రకాండులు సిద్ధం!



విశాఖపట్నం నుంచి అరకులోయ వెళ్ళేదారిలో బొర్రాగుహలుంటాయి. ఆ గుహల్లో పైనుంచి కిందికి వేలాడే, అందమైన ఊడల్లాంటి ఆకృతులు కనువిందు చేస్తాయి. ఇలాంటి వాటిని కూడా Stalactites లంటారు. అలాగే గుహల అడుగు నుంచి పుట్టల్లా

పెరిగే వాటిని Stalagmites అంటున్నారు. అతిశీతలత వల్ల వాటిచుట్టూ మంచు ఏర్పడితే, వాటిని "Ice Stalagmites" అంటారు. ఇవి రకరకాల రసాయనాల సమ్మేళనం వల్ల ఏర్పడతాయి. సాధారణంగా సున్నం, గంధకం, కర్బనం, సిలికాన్‌లాంటి అలోహ మిశ్రమా లున్న గుహల కప్పుభాగాన లేదా, నేలభాగాన నీళ్ళు పడే అవకాశమున్నప్పుడు, అక్కడి శీతలత్వం కారణంగా జరిగే రసాయన చర్యల వల్ల అవి ఏర్పడు తుంటాయి. నీరు తుంపరులుగా పడినచోట, నేల బుడిపెలుగా కన్పించేది కూడా అందువల్లనే. పైన చెప్పుకున్న ఆస్ట్రియా దేశపు ఆల్ప్స్ పర్వతశ్రేణిలో ఏర్పడిన 42కి.మీ. పొడవైన గుహల్లో 1 కి.మీ.మాత్రమే మంచులింగాకృతులున్నాయి. ఆ తర్వాత లోపలికి వెళ్తే అన్నీ Stalagmites లే కన్పిస్తాయి. అంటే వివిధ అలోహాలతో నీటి కలయిక వల్ల ఏర్పడ్డ కళాకృతులే. వాటిమీద అక్కడక్కడా కాంతి ప్రసరించి, వర్ణవిశ్లేషణ పొంది, వింతవింత రంగుల్లో చెప్పలేనంత అందాన్ని, ఆనందాన్ని వెదజల్లుతుంటాయి. ఆ పర్వతాల్లో "హొహాచ్‌కోగెల్" అనే కొండపై 'సాల్ప్' అనే నీటి ప్రవాహం వుంది. అది అక్కడ నుంచి కొండల లోయల్లోకి వెళు తుంది. ఆ నీటి నుంచి గుహలోపలికి పడే బొట్లు వల్లనే మంచు కళాకృతులు ఏర్పడ్డాయి. ఆ గుహలో కూడా ఎముకలు కొరికే చలి వుంటుంది.



చెప్పుకుంటూపోతే, ఇలాంటి వింతలు, ఆకర్షణలు ప్రకృతిలో ఎన్నో వున్నాయి. మన ఊహకు అందవు కూడా. ఇవన్నీ స్వతస్సిద్ధంగా ఏర్పడ్డవే. వాటి ఆకృతులు, సొగసులు చూసి పూజలు మొదలుపెడితే ఎలా? రసాత్మక హృదయంతో వాటిని ఆస్వాదించాలి తప్ప ఆధ్యాత్మిక లక్ష్యాలతో కళవళపడకూడదు. ప్రకృతి నుంచి వచ్చిన మనం, ఆ ప్రకృతిని ప్రేమించాలి. దాని అందాన్ని, ఆనందాల్ని తర్వాతి తరాలకు అందించాలి. ప్రకృతినాస్వాదించడానికి తీర్థయాత్రలు కాదు, ప్రకృతి విజ్ఞానయాత్రలు చేయాలి. వాటి లక్ష్యం పుణ్యం పురుషార్థం వంటి ఎండమావులు కావు, మన మనసుల్ని ఆనందింపచేసుకోవడం, మనకీ ప్రకృతికీ మధ్య వుండాల్సిన బంధాన్ని అర్థం చేసుకోవడం. ఈ లక్ష్యాన్ని సాధించడంతోనే నిజమైన 'ప్రాకృతిక అమరత్వం' మనకు అవగాహన అవుతుంది.



# మంత్రజపానికి చింతకాయలు రాలవు కానీ...




రజని 10వ తరగతి 95% మార్కులతో పాసయింది. ఒక కార్పొరేట్ కాలేజీలో ఇంటర్మీడియట్ సీటు సాధించింది. ఒకరోజు, తన 10వ తరగతి క్లాస్‌మేట్ మంజరితో ఫోన్‌లో మాట్లాడుతూ తన కాలేజ్ గురించి గొప్పలు చెప్పింది.

"మంజూ! మా కాలేజ్‌లో చదువు బాగా వస్తుంది. రోజు ఉదయం 4గంటలకే నిద్రలేపి " గాయత్రీ మంత్రజపం" 108 సార్లు చేయిస్తారు. అలా చేయడం వల్ల మన బ్రెయిన్ ఏక్టివేట్ అయి, జ్ఞాపకశక్తి పెరుగుతుందట! ఒక్కోసారి సమయం చాలకపోతే, గాయత్రీమంత్రం సి.డి. ప్లే చేస్తారు. మేం నిద్రలేచి, ఆ సి.డి.వింటూ ఫ్రెష్ అవుతాం. ఆ మంత్రం విన్నా, మనలో వుండే చెడు ఆలోచనలు తొలిగిపోయి, నరాల వ్యవస్థ మొత్తం శుద్ధమవుతుందని మా హాస్టల్ మేట్రన్ ఒకరోజు క్లాస్ ఇచ్చారు. నువ్వు కూడా మా కాలేజ్‌లో జాయిన్ అవ్వకూడదూ! ఈ బెనిఫిట్స్ అన్నీ నీకూ వుంటాయి" అంది రజని. "మా ఫాదర్‌తో మాట్లాడి ట్రై చేస్తాలే" అన్న మంజరి సమాధానం ఆమెకు నచ్చింది.

రజని అలా చెప్పడంలో అవాస్తవమేమీ లేదు. తెలుగు రాష్ట్రాల్లోని పలు కార్పొరేట్ కళాశాలల్లో వేకువఝామునే గాయత్రీ జపాలు, సరస్వతి ప్రార్థనల సి.డి.గీతాలు,

మామూలైనాయి. బాగా చదివే పిల్లల్ని ఏరి, ఫీజు తగ్గింపుల ఎరవేసి, రేయింబవళ్ళు పుస్తకాల పురుగులుగా మార్చి, వేరే ప్రపంచ జ్ఞానం ఏదీ లేకుండా, చదువుల చిలకలుగా విద్యార్థుల్ని తయారు చేస్తున్న అనేక పాఠశాలల్లోనూ ఇదే తంతు. కష్టం విద్యార్థులది, వ్యాపారం ఆ సంస్థలదీ. కాగా, గాయత్రీ జపం వల్లనే మంచి ఫలితాలు సాధిస్తున్నట్లు ప్రచారం మాత్రం జరుగుతూ వుంటుంది.

చదువు విషయంలోనే కాదు, ఏ సమస్యనైనా తీర్చగల అపారశక్తి 'గాయత్రి'కుందని పెద్ద ప్రచారం వుంది. గాయత్రిని ఎంత ఎక్కువ సమయం జపిస్తే అంత ఎక్కువ ఫలితముంటుందని, ఉద్యోగాలు రావడానికైనా, హృద్రోగాలు తగ్గటానికైనా, చక్కెరవ్యాధికైనా, రక్తపోటుకైనా, గాయత్రీమంత్రమే ఏకైక మార్గమని పెద్ద ఎత్తున ప్రచారం జరుగుతోంది. "గాయత్రీ పరివార్" లాంటి సంస్థలు మంత్రజపాలను, గాయత్రీ జ్ఞానయజ్ఞాలను, ఏకాహ పూజల నుంచి సప్తాహాల దాకా వ్రతాలను కూడా ప్రచారం చేస్తూ, 'గాయత్రీ'మంత్రం పట్ల సాధారణ జనంలో వ్యామోహాన్ని పెంచుతున్నాయి. అష్టోత్తర శత జపాల నుంచి, 51లక్షల సార్లు ఆ మంత్రాన్ని జపించే భారీస్థాయి ఖర్చుతో కూడిన జపయజ్ఞాల నిర్వహణ కూడా జరుగుతోంది.

ఇలాంటివి విన్నప్పుడు, చూసినపుడు, ఆలోచనాపరుల్లో వచ్చే మొదటి ప్రశ్న "అసలు ఏమిటీ గాయత్రి? ఆ మంత్రంలో అంత మహత్తు వుందా? మహత్తే లేకపోతే, ఎందుకిన్ని ఆర్భాటాలు?" మొదలైన ఎన్నో ప్రశ్నలు పుట్టుకొస్తాయి. పెద్దలు చెప్పిందాన్ని ప్రశ్నించే ధైర్యం లేనివారు, ప్రశ్నించకూడదన్న వినయం గలవారు అతితేలిగ్గా 'గాయత్రీ' బుట్టలో పడుతుండడం, వారి ప్రచారమే మరికొందరికి మార్గం చూపడం ఎలా సాధ్యమవుతుందో కూడా తెలిస్తే మరింత ఆశ్చర్యం కలుగుతుంది.

"మంత్రజపానికి చింతకాయలు రాలవు" కానీ, మనుషుల తలకాయలు మాత్రం అజ్ఞానంతో వాలి సలాం కొడతాయి. అందుకు ఈ మంత్రమే ఉదాహరణ.

వాస్తవానికి 'గాయత్రి' అనేది ఒక మంత్రం కాదు. వేదాల్లో వాడబడిన అనేక ఛందస్సుల్లో అది ఒకటి. దాంతో పాటు ఉష్ణిక్, అనుష్టుప్, బృహతీ, పంక్తి, త్రిష్టుప్, జగతి – అనే పేర్లు గల ఛందస్సులు కూడా శ్లోకరచనకు నాటి కవులు (ఋషులు అంటారా?) వాడారు. ఋగ్వేదంలోని మొత్తం మంత్రాల్లో నాల్గవ వంతు మంత్రాలు, అంటే 2450 మంత్రాలు గాయత్రీఛందస్సులో వుంటాయి. ఇంత విస్తృతంగా వాడబడిన ఛందస్సు ఇదే కనుక, ఈ ఛందస్సు పేరును ఎక్కువగా వినియోగించడం వల్ల 'గాయత్రి'కి ఆ రోజుల్లో బాగా వ్యాప్తి వచ్చింది. ఆ మంత్రం అసలు పేరు 'సావిత్రి' మరుగున పడి,

ఛందస్సు పేరే ప్రఖ్యాతమైంది. గాయత్రీమంత్రం అని నేడు మనం పిలుస్తున్న శ్లోకం మొదటగా మనకు రుగ్వేదంలో కన్పిస్తుంది.

**"తత్సవితుర్వరేణ్యం**
**భర్గోదేవస్య ధీమహి**
**ధియో యో నః ప్రచోదయాత్"** (రుగ్వేదం:3-62/10)

ఇది సవితృ (సూర్య) దేవతను గూర్చి కీర్తించినందువల్ల దీనికి 'సావిత్రి' అనే పేరు వచ్చింది. దీని అర్థం-"సవిత అనే దేవత యొక్క శ్రేష్టమైన తేజస్సును నేను ధ్యానిస్తున్నాను. ఆ తేజస్సు మా బుద్ధిని ప్రేరేపించుగాక"

ఈ మంత్రమే సామవేదం (1462), యజుర్వేదా (22/9, 30/2, 36/3)లలో కూడా వుంది. యజుర్వేదంలో పై మంత్రానికి అదనంగా కొన్ని అక్షరాలను జోడించి ఇలా చెప్పారు.

**"భూర్భువస్స్వః తత్సవితుర్వరేణ్యం**
**భర్గోదేవస్య ధీమహి**
**ధియో యో నః ప్రచోదయాత్"**

ఏ శ్లోకానికైనా (మంత్రానికైనా) ముందు 'ఓం' చేర్చడం జరుగుతుంది. కనుక అది మంత్రంలో భాగం కాదు. భూః, భువః, స్వః - ఈ మూడు, సప్త లోకాల జాబితాలో వుండేవే. భూలోకం, దానిపైన వుండే భువర్లోకం, ఆ పైన వుండే స్వర్గలోకం. వాటిని ఈ మంత్రానికి ఎందుకు జోడించారో వారికే తెలియాలి. ఆ మూడింటిని 'వ్యాహృతు' అన్నారు. అంటే 'ఓం'లాగే తెచ్చిపెట్టుకున్న పదాలు. కనుక, మంత్రార్థానికి దానికి సంబంధం వుండాల్సిన అవసరం లేదు. అయినా మన పండితవర్యులు ఊరుకోరు గదా! "ఆ మూడులోకాలకు తేజస్సునందించే సవితను ధ్యానిస్తున్నాను" అనే అర్థాన్ని అతికించారు.

వైదికాభిమానులు కీర్తించేంత గొప్పగా వేదాల్లోనే అన్నీ వుండవు. క్రీ.పూ. 2500వ సంవత్సరంనాడున్న జనగణానికి, వారి జీవన వ్యవహారాలు, ప్రాకృతిక శక్తులను కీర్తించటాలే వర్ణనీయ అంశాలు. అవే వేదాల్లో వున్నాయి. సూర్యతేజస్సు వల్లనే ప్రాణుల్లో చైతన్యం వుంటుందని, దానివల్లనే బుద్ధి చురుగ్గా తయారవుతుందని, వారు గుర్తించి, శ్లోకంలో కీర్తించారు. అలాంటి శ్లోకాలు వేదాల్లో ఇంకా చాలా వున్నాయి. గాయత్రీ ఛందస్సులోనే ఇంకా 2449 శ్లోకాలున్నాయి. అయినా ఈ శ్లోకానికే పవిత్రతనాపాదించడం విచిత్రం.

వేదాలు అపౌరుషేయాలన్నారు. అంటే మనుషులచేత రాయబడినవి కావట! గాయత్రీ మంత్రాన్ని మాత్రం విశ్వామిత్రుడు కల్పించాడని చెప్పారు. వేదాల తర్వాత వచ్చిన సాహిత్యంలోనూ దీనికి ప్రాచుర్యం వుంది. దీనికి అనేక మహత్తులు, పవిత్ర కథలు, కల్పించి స్మృతుల్లో, శాస్త్రాల్లో, పురాణాల్లో, గృహ్య, శ్రౌత సూత్రాల్లో ప్రస్తావించారు. (వాటినన్నిటినీ ఇవ్వటం వల్ల ఈ వ్యాసవిస్తృతి జరుగుతుంది. కనుక ఇవ్వడం లేదు.)

గాయత్రికి విశేష ప్రాచుర్యం కల్పించిన మనుస్మృతిని మాత్రం చూడాలి. అధ్యాయం-2లో, 76-83 శ్లోకాల్లో గాయత్రీ గొప్పదనాన్ని గురించి మనువు వర్ణించాడు, శాసించాడు.

1. రుగ్వేద, యజుర్వేద, సామవేదాల నుండి బ్రహ్మ "భూః, భువః, స్వః" అనే వ్యాహృతులను తీసుకున్నాడు. (76)
2. ప్రతిరోజూ ఉదయం, సాయంత్రాలలో ఈ మూడు పదాలను గాయత్రితో కలిపి ఎవరు పఠిస్తారో వారికి మూడు వేదాల పఠనం వల్ల లభించే పుణ్యం లభిస్తుంది (78).
3. ద్విజులు (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యవర్ణాల వారు) పై మూడు వ్యాహృతులలతో పాటు, గాయత్రి మంత్రాన్ని ఊరికి దూరంగా వుండే నదీతీరాల్లోనో, అడవుల్లోనో వుండి (మిగిలిన కులాల వారు వినకుండా) వేయిసార్లు జపిస్తే పెద్ద పెద్ద పాపాల నుంచి కూడా పాముకుబుసాన్ని విడిచి శుద్ధి పొందినట్లు,పవిత్రులవుతారు (79).
4. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యవర్ణాలలో పుట్టినవారు ప్రతిరోజూ సాయం ప్రాతః కాలాదులలో ఈ మంత్రాన్ని జపించక, సంధ్యావందనాది హోమక్రతువులను చేయకున్నట్లయితే సజ్జనులలో నిందాపాత్రులవుతాడు (80)
5. వ్యాహృతులతో కూడిన గాయత్రి మంత్రం వేదానికి ముఖం వంటిది. (81)
6. మూడు సంవత్సరాల పాటు ఈ గాయత్రీమంత్రాన్ని నియమబద్ధంగా జరిపించేవాడు బ్రహ్మజ్ఞాని అవుతాడు. వాయువు వలె కోరిన చోటికి (సంకల్ప మాత్రంతో) వెళ్ళగలుగుతాడు. మరణానంతరం పరమాత్ముడవుతాడు (82)
7. గాయత్రిని మించిన మంత్రం లేదు (83)

ఇంత విశేష ప్రాచుర్యాన్ని ఇవ్వడం వల్లనే గాయత్రి అగ్రవర్ణాల్లో బలంగా నాటుకుంది. ఉపనయన సమయంలో చెవిలో ఊదే మంత్రంగా మారింది.

సంధ్యావందనంలో ముఖ్యమంత్రంగా నిలిచింది. ఆ మంత్రోచ్చారణ చేయని ద్విజుడు, ద్విజార్హతను కోల్పోతాడన్న స్థాయికి ఆ ప్రచారం పెరిగింది. భగవద్గీతలో కృష్ణునిచేత "గాయత్రీ ఛందసామహమ్" (ఛందస్సులో నేను గాయత్రి వంటివాణ్ణి) అని చెప్పించి, దాని ఔన్నత్యాన్ని పెంచడం కూడా గమనార్హం.

మంత్రమా, కాదా, దానికి మహత్తు వుందా, లేదా అన్న విషయాన్ని పక్కనపెట్టి, ఆ మంత్రము లోని ఛందోలక్షణాలను బట్టి చూసినా గాయత్రి శుద్ధమైనది కాదు.

గాయత్రి మూడు పాదాల్లో వుండే ఛందస్సు. ప్రతి పాదానికి 8 అక్షరాలుండాలి. మూడు పాదాల్లో 24 అక్షరాలుంటాయన్నమాట. కానీ, గాయత్రీమంత్రానికి(ఋగ్వేదం లోనిది) చూడండి. మొదటి పాదంలో 7, రెండో పాదంలో 8, మూడో పాదంలో 8 అక్షరాలుంటాయి. ఛందోనియమాల ప్రకారం పాదంలో ఒక అక్షరం తగ్గితే దాన్ని 'నిచృత్' ఛందం అంటారు. అంటే వెలుగులేని, నీరసమైన అని అర్థం. అంటే ఋగ్వేదంలోని గాయత్రి తక్కువ రకానికి చెందిందన్నమాట. యజుర్వేద గాయత్రిలో "భూర్భువస్స్వః" అనే మూడు వ్యాహృతులను కూడా మొదటి పాదానికి కలిపి చూస్తే 11 అక్షరాలవుతాయి. అప్పుడు కూడా ఛందోదోషమే. ఒకటి రెండు అక్షరాలు ఎక్కువైతే, ఆ దోషానికి 'నాగీ' అనే పేరుంది కానీ, నాలుగు అక్షరాలు అధికంగా వుంటే, ఏ పేరూ లేదు. అలాంటి దోషాన్ని సంస్కృత ప్రథమ ఛందోవేత్త "పింగళుడు" కూడా ఊహించలేదు. కనుక యజుర్వేద గాయత్రి కూడా శుద్ధమైనది కాదు.

వ్యాకరణ నియమాల ప్రకారం చూసినా గాయత్రీ మంత్రంలో దోషముందని పండితులు ఎత్తిచూపారు. ఇలాంటి దోషభూయిష్టమైన మంత్రాన్ని మహిమాన్వితంగా వర్ణించడం ఏరకంగా సమర్థనీయం? ఇలా అంటున్నందుకు ఉక్రోషంతో లేదా విద్వేషంతో ఊగిపోకుండా ఎవరైనా సరే వివేచనతో పరిశీలిస్తే వాస్తవ అంతరార్థం వెల్లడవుతుంది.

ఆధునిక కాలంలో గాయత్రికి విపరీత ప్రచారం ఇచ్చినవాడు ఆర్యసమాజ స్థాపకుడు దయానంద సరస్వతి. ఆ మంత్రానికి లేని విపరీత వ్యాఖ్యానాలను జోడించి, బాలబాలికలకు దాన్ని నేర్పించడం మొదలుపెట్టాడు. ఆయన తర్వాత ఆతని అనుచరులు గాయత్రీ యజ్ఞాలను, ఉపనయనాలను ఇబ్బడిముబ్బడిగావించి, దాని మహత్వానికి కథలు జోడించారు. అదే ఈనాడు "ఇంతింతై, వటుడింతయై...." అన్నట్లు రకరకాల ప్రక్రియలుగా విస్తరించింది. గాయత్రీ చాలీసా, గాయత్రీ పురాణం, గాయత్రీ దీక్ష, గాయత్రీ సహస్ర నియమావళి, మంత్రపుష్పం మొదలైన రూపాల్లోకి మారిపోయింది.

అనేక సంస్థలు పుట్టుకొచ్చి మిథ్యాప్రచారం చేస్తూ జనాన్ని మౌఢ్యంలో ముంచెత్తుతూ వస్తున్నాయి. జనం కూడా సమ్యగాలోచన, వివేచనలకు తావివ్వకుండా, "పిడుక్కీ బియ్యానికీ ఒకే మంత్రమన్నట్లు"నమ్ముతున్నారు. తమ సమస్యలకు పరిష్కారాన్ని ఆ మంత్రంలో వెతుకుతున్నారు. ఆ ఎండమావే తమ దాహార్తిని తీర్చగలదని ఆశపడుతున్నారు. వాస్తవాన్ని తెలుసుకుని ఆ తృష్ణనుంచి ఎంత తొందరగా బైటపడితే అంత మంచిది.



# సరస్వతి 'చదువుల తల్లి' ఎలా అయింది'?



**సంక్రాంతి** సెలవులు ముగిసి, తిరిగి పాఠశాలలు తెరిచారంటేచాలు, విద్యార్థులకు ఆందోళన మొదలవుతుంది. వారిపై తల్లిదండ్రుల, ఉపాధ్యాయుల ఒత్తిడీ పెరుగుతుంది. ఫిబ్రవరిలో చలి బాధకంటే, చదువుల బాధే ఎక్కువ వణుకుతెప్పిస్తుంది. మార్చినెల వస్తుందంటే మూర్ఛవస్తుందేమో ననిపిస్తుంది. నేటి పాఠశాల, కళాశాల విద్యార్థుల్లో ఈ అవస్థలు సాధారణమయ్యాయి. ఈ భయాందోళనల పెరుగుదలతోపాటు, విద్యాసంస్థల్లో సరస్వతీ భక్తికూడా ఇబ్బడిముబ్బడిగా పెరిగిపోయింది. భయానికీ భక్తికీ విడదీయరాని చుట్టరికమాయె!

విద్యార్థులతో సరస్వతీ పూజచేయించటం హైందవ సంస్కృతిలో ఏనాటి నుంచో వుంది.

"సరస్వతీ! నమస్తుభ్యం వరదే ! కామరూపిణీ!
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా!"

అంటూ దణ్ణం పెట్టి పుస్తకం పట్టుకుంటే సరస్వతీ కటాక్షం లభించి చదువు, జ్ఞానం ప్రాప్తిస్తాయన్న విశ్వాసం వేల సంవత్సరాల నుంచీ భారతీయ సమాజంలో వ్యాపించివుంది. తెలుగులోకూడా, పోతన రచనగా చెప్పబడే

"తల్లీ! నిన్నుదలంచి పుస్తకము చేతన్ బూనితిన్ నీవు నా
యుల్లంబందున నిల్చి........."

అన్నపద్యం బహుళ ప్రచారంలో ఉంది. విద్యార్థి వ్యక్తిగతంగా ఈ పద్యం చదువుకొని, మనసునిండా నిగ్రహాన్ని నింపుకొని పుస్తకం తెరిస్తే, చదవాల్సిన విషయం తేలిగ్గా అవగాహన అవుతుందని పెద్దలు బోధిస్తారు.

ఈనాడు భక్తి, పూజలు కూడా సామూహిక దంబాచారులుగా మారిపోయాయి. చదువులాగానే అవీ ఖరీదయిపోయాయి. విద్యార్థుల్లో ఆలోచించే పద్ధతిని ఒక అలవాటుగా మార్చేకోరికా, తీరికలేని విద్యాలయాల్లో, స్వయంకృషితో స్వీయప్రతిభను మెరుగుపర్చుకోవాలని ప్రబోధించాల్సిన విద్యాకేంద్రాల్లో పరాధీనతను, భక్తితత్వాన్ని తలకెక్కించటం ఈనాడొక ఫ్యాషన్‌గా తయారయింది. సరస్వతీ విగ్రహాలకు పూజలు చేయించటం, ఆ విగ్రహాల ముందుంచిన పెన్నులతో పరీక్షలు రాస్తే తప్పక ఉత్తీర్ణత సాధిస్తారన్న ప్రచారాలు చేయటం, అలాంటి పెన్నులను ఉచితంగా పంపిణీ చేయటం, విద్యాకేంద్రాల్లో లక్షలాది రూపాయల ఖర్చుతో సరస్వతీ వ్రతాలు, భజనలు చేయించటం, ప్రసాదాలు అమ్మటం మొదలయినవన్నీ నాలుగైదేళ్లుగా వ్యాప్తిలోకి వస్తున్న సరికొత్త కార్పొరేట్ విద్యావ్యాపారాలు. అలాంటివి చేయకపోతే తమ వ్యాపారం పడిపోతుందన్న ఆందోళనతో పలు విద్యాసంస్థలు పోటీపడి చాలా విలాసవంతంగా ఆ పని చేస్తున్నాయి. దాని ఖర్చంతా విద్యార్థులపైనే పడుతుందని వేరుగా చెప్పనక్కరలేదు.

**భారత రాజ్యాంగంలోని ఆర్టికల్ 28(1) ప్రకారం ప్రభుత్వ నిధులతో నడిచే ఏ విద్యాసంస్థలోనూ ఏవిధమైన మతబోధ జరగరాదు. అలాగే, 28(3) ప్రకారం, ప్రభుత్వం గుర్తించిన లేదా ప్రభుత్వ నిధుల సహాయంతో నడిచే విద్యాసంస్థల్లో హాజరయ్యే వారిని, ఆ సంస్థల్లో జరిగే మతబోధల్లో పాల్గొన వలసిందిగా గాని, లేదా ఆ ఆవరణల్లో జరిగే మతారాధనల్లో పాల్గొనవలసిందిగా గానీ ఎవరినీ బలవంతపెట్టరాదు.** అయినా సరే, ప్రభుత్వ, ప్రభుత్వ గుర్తింపుగల ప్రయివేటు పాఠశాలల్లో, కళాశాలల్లో గణపతి పూజలు మొదలుకొని సరస్వతీ పూజలవరకు అన్నీ జరిగిపోతూనే వున్నాయి. వాటిని ప్రోత్సహించేవారే కానీ ఆపే ప్రభుత్వాలేవీ? అధికారులేరీ?

ప్రార్థనలు, పూజలు ఒక విగ్రహానికి మొదలయ్యాయి అంటే, ఆ విగ్రహంతో జనాన్ని దోచుకునే వ్యాపారమూ మొదలవుతుంది. సరస్వతి చదువుల తల్లి, జ్ఞానప్రదాయిని, అయిన దేవత అన్న ప్రచారం పెరగటంతో, ఆ దేవత పేరిట ప్రసాదాలు,

చేతికి కట్టుకునే కంకణాలు, మెడలో వేసుకునే లాకెట్లూ, ఇంటిలోనూ స్కూళ్లలోనూ వేలాడదీసుకునే యంత్రాలు, చక్రాలు, జ్ఞానసరస్వతీ లేహ్యాలు వంటి వస్తువులు అమ్మకానికి సిద్ధమయ్యాయి. ఆ మధ్య ఒక శతావధాని జ్ఞాపకశక్తిని పెంచే "జ్ఞానసరస్వతీ లేహ్యం"తో పెద్ద వ్యాపారమే నడిపాడు. ఇవన్నీ విద్యార్థుల్నీ, వారి తల్లిదండ్రుల్నీ భ్రమల్లో ముంచెత్తటానికే తప్ప ఎందుకూ పనికిరావు.

శిశువులకు మూడేళ్ళు వయసు నిండీనిండక ముందే, బాల్యం వికసించకముందే, వారిని లాక్కెళ్లి బడుల గదుల్లో బంధించటం యిపుడు అతిసాధారణమయింది. బలిచ్చే జంతువును ముందుగా పూజించినట్లు, బడిలో చేర్చేముందు గుడికివెళ్లి అక్షరాభ్యాస పూజలు చేయించే వింత ఆచారం ఇటీవల బాగా ప్రాచుర్యం పొందింది. తెలుగునాట ఈ పనికోసం సరస్వతీ దేవాలయాలు కూడా వెలిసాయి. ఈ వ్యాపారం లాభసాటిగా వుండటంతో కొత్తగుడులు కూడా ఇటీవల పుట్టుకొస్తున్నాయి. ఆదిలాబాద్ జిల్లా బాసరలో వుండే జ్ఞానసరస్వతీ మందిరం, మెదక్ జిల్లా వర్గల్‌లో 1980లో నిర్మితమైన విద్యా సరస్వతీక్షేత్రం, కరీంనగర్ జిల్లా కాళేశ్వరంలోని మహాసరస్వతీ దేవళం ఇప్పటికే సుప్రసిద్ధులు. ఇవిగాక, దేశవ్యాప్తంగా వున్న సరస్వతీమందిరాల్లో, కేరళరాష్ట్రం, ఎర్నాకుళం జిల్లా ఉత్తర పరవూర్‌లో ఉన్న దక్షిణ మూకాంబికాగుడి, తమిళనాడులోని తిరువూర్ దగ్గర కొత్తనూర్‌లో వున్న గుడి, కర్నాటకలోని ఆదిశంకరుడు స్థాపించినట్లు చెప్పబడే శృంగేరి శారదాపీఠం,.... ఇలా ఎన్నో ఉన్నాయి. ఇన్ని వున్నా, ఇటీవల కాలంలో పాఠశాల ప్రాంగణాల్లో సరస్వతీ విగ్రహాలను పెట్టి, విద్యార్థులతో పూజలు చేయించే కార్పొరేట్ పోకడ విస్తృతమవుతున్నది.

అయ్యప్ప, భవానీ, శ్రీశైల శివుడు మొదలయిన దేవీదేవతల ఆరాధనా దీక్షలు మొదలయినట్లే విద్యార్థుల్లో 'సరస్వతీ దీక్ష'లు కూడా వస్తాయోమోనన్న అనుమానం వచ్చేంత హడావుడి జరుగుతోంది. ఎందుకంటే, పాఠశాల ప్రార్థనల్లో 'వందేమాతరం' పాడటంతో పాటు 'సరస్వతీ ప్రార్థన' చాలా చోట్ల తప్పనిసరి అవుతోంది.

**'యాకుందేందు తుషార హార ధవళా యా శుభ్రవస్త్రాన్వితా**
**యా వీణా వరదండమండిత కరా యా శ్వేత పద్మాసనా**
**యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభిర్దేవైః సదా వందితా**
**సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యాపహా"**

సరస్వతీ వర్ణనను, ఘనతను కీర్తించే ఈ శ్లోకం సభా ప్రారంభాల్లోనూ సాధారణ మవుతోంది. ఇంటర్నెట్‌లో సైతం సరస్వతీ పూజల ప్రాశస్త్యాన్ని ప్రచారం చేయటం

జోరుగా సాగుతోంది. "శక్తిమంతమైన ద్వాదశమంత్రాలు" ప్రతి ఒక్కరూ నేర్చుకోవాలని, విద్యారంభానికి, పరీక్షలకు ముందు వాటిని వల్లెవేస్తే విజయం తథ్యమని ఆ ప్రచార సారాంశం.

1. **"ఓం ఐం సరస్వతయే నమః ఓం"** – ఇది బీజమంత్రమట. చేతులు జోడించి, కనులు ముకుళించి ఈ మంత్రాన్ని ముందుగా స్మరించాలట!

2. **"సరస్వతీ నమస్తుభ్యం"** శ్లోకం రెండోది

3. **"శుక్లాం బ్రహ్మ విచార సార పరమామాద్యాం జగద్వ్యాపినీం**
**వీణాపుస్తక ధారిణీ మభయదాం జాడ్యాంధకారాపహామ్**
**హస్తే స్ఫాటిక మాలికాం చ దధతీం పద్మాసనే సంస్థితాం**
**వందే తాం పరమేశ్వరీం భగవతీం బుద్ధిప్రదాం శారదాం"**

   అజ్ఞానాన్ని తొలగించి, సద్బుద్ధిని ప్రసాదించమని కోరుతూ ఈ శ్లోకం నెమరువేయాలట!

4. దేన్నైనా తేలిగ్గా నేర్చుకోవటానికి సహాయపడే మంత్రమిది. పరీక్షల్లో ఎక్కువ మార్కులకూ ఇదే!

   **"ఓం ఐం హ్రీం క్లీం మహాసరస్వతీ దేవ్యైనమః"**

5. పోటీ పరీక్షల్లో ఘనవిజయాలు సాధించాలంటే కూడా ఈ మంత్రం ఒకచిట్కాగా పనిచేస్తుందట! సరస్వతీ ప్రసన్నత పొందటంలో ఇది 'గాయత్రీ'మంత్రంతో సమానమంటున్నారు.

   **"ఓం వాగీశ్వరాయ విద్మహే వాగధీనయే ధీమహి తన్నో సరస్వతీ ప్రచోదయాత్"**

6. నేరుగా సరస్వతీ కరుణా కటాక్ష వీక్షణాలు ప్రసరించాలంటే ఈ మంత్రం నిత్యం పఠించాలట!

   **"సరస్వతీ మహాభాగే విద్యే! కమలలోచనే!**
   **విశ్వరూపే విశాలాక్షి విద్యాం దేహి నమో஽స్తుతే"**

7. మేధోశక్తిని సొంతం చేసుకోవాలంటే– **"వద వద వాగ్వాదినీ స్వాహా"** అని జపించాలట!

8. జ్ఞాన సంపద, ప్రతిభ మీ దరికి చేరాలంటే–

**"ఓం అర్హ్రం ముఖకమలవాసినీ పాపాత్మా క్షయంకరీ**
**వద్ వదేవాగ్వాదినీ సరస్వతీ ఐం హ్రీం నమః స్వాహా"**

అనే మంత్రాన్ని జపించాలిట! ఇంకా ఇలాంటి శ్లోకాలు, మంత్రాల పేరుతో అదరగొట్టేస్తున్నాయి. నిస్సారపు పునరుక్తులు, ఈ మంత్రాల్లో అతిసాధారణం.

ఈ మంత్రాలను ఎంతమంది నిత్యమూ భక్తితో పఠిస్తుంటారో చెప్పలేం. కానీ, వీటిమీద వున్న నమ్మకం మాత్రం చాలామందిలో వుంటుంది. ఈమంత్రశక్తి వల్ల అద్భుతాలు జరుగుతాయన్న ధృఢవిశ్వాసం కూడా వుంటుంది. అయితే, ఈ విశ్వాసం వాస్తవమనటానికి ఏ రుజువులూ వుండవు.

## 'సరస్వతీ పండుగ'!

దేశమంతటా ప్రతి ఏటా 'వసంత పంచమి' ఉత్సవం జరుగుతుంది. దాన్నే సరస్వతీ పంచమి అంటారు. ఆరోజు సరస్వతి పుట్టినరోజట! ఆరోజున పిల్లలకు అక్షరాభ్యాసం చేయిస్తే, వారు ఉన్నత విద్యావంతులుగా, మేధావులుగా ఎదుగుతారట! అందుకే ప్రతిఏటా ఆ పంచమి రోజున సరస్వతీ గుళ్లన్నీ ఆబాలవృద్ధులతో కిటకిటలాడతాయి. తమిళులు, మలయాళులలో ఈ వసంతపంచమి ఇక్కడున్నంత ఉత్సవంగా లేదు. దసరా నవరాత్రుల్లో చివరి మూడురోజులు అక్కడ సరస్వతీ పూజలు చేస్తారు. అప్పుడు పిల్లల అక్షరాభ్యాసాలూ జరుగుతాయి. రెండు దశాబ్దాల కిందట తెలుగునాట కూడా ఈ 'పంచమి' పూజలేదు. ఉత్తరాది నుంచి, ముఖ్యంగా బెంగాల్ నుంచి ఈ 'బసంత్ పంచమి' మనకు అంటింది. దాదాపుగా, ఆ ఉత్సవ సమయంలోనే 'ప్రేమికుల రోజు' (వాలంటైన్స్ డే) వస్తూ వుంటుంది. దానిని ఎదుర్కోవటానికి కూడా ఈ సరస్వతీ పంచమిని హైందవ ధర్మపరాయణులు ప్రముఖంగా ముందుకు తెస్తున్నారు.

సరస్వతి విగ్రహాలను, చిత్రపటాలను జాగ్రత్తగా పరిశీలించండి. తెల్లని చీర, పసుపురంగు జరీ అంచు, హంసవాహనం, చేతిలోవీణ, అక్షమాల, తామరపూవుపీఠం, మరోచేతిలో పుస్తకం, అభయహస్తం, ప్రక్కన చిత్రవర్ణి (నెమలి) ..... వీటన్నింటితో వుండే సరస్వతీ చిత్రం చూస్తే ఎవరికైనా ముచ్చటేస్తుంది. ఆ చిత్రాన్ని ముందుగా చిత్రించిన రాజారవివర్మను అభినందించాలనిపిస్తుంది. అయితే, ఈ చిత్రాకృతిలో వున్న వస్తువులను బట్టి సరస్వతికి కూడా ఒక చారిత్రక పరిణామం ఉందని దాదాపు ఎవరికీ స్ఫురించదు.

## చారిత్రక సరస్వతి

'సరస్వతి' అనేపదం మనకు రుగ్వేదంలోనే మొదటగా వినిపిస్తుంది. అప్పటికి, ఆ పదానికి ఈనాడున్న అర్థం లేదు. 'శివుడు'- అంటే శుభాన్ని కలిగించేవాడు. 'విష్ణువు' అంటే అంతటా వ్యాపించినవాడు, 'పార్వతి' అంటే పర్వత రాజకుమార్తె, అనే రీతిలో 'సరస్వతి'కి వ్యుత్పత్తి చెపితే అసలు'రంగు' బయటపడుతుంది.

సంస్కృతంలో 'రస' అనేది వైదికకాలంలో నీటికి, (ప్రవహించే దానికి) పర్యాయపదం, 'సరస్' అంటే నీటితో వుండేది. అది కాలువ, నది, చెరువు, జలధార... ఏదైనా కావచ్చు. వీటిని కలిగివున్నదాన్ని సరస్వతి అన్నారు. అంటే 'సరస్వతి' ఒక నీటి ప్రవాహానికి, జలాశయానికి సంబంధించిన పేరు. సంస్కృతానికి మాతృకగావున్న 'ఇండో-ఇరానియన్' భాషా కుటుంబానికి చెందిన పదం 'సరస్వతి'. ఆర్య జనపదాలలో ఈ పదం ఆనాడు వ్యవహారంలో వుండేది. ఆర్యులతో పాటే వారి భాష కూడా మధ్యాసియా ప్రాంతం నుంచే వచ్చింది. అందుకే వైదిక సంస్కృతానికి సోదరభాషగా అన్పించే 'అవెస్తా'లోకూడా 'హరహ్వతి'గా ఆ పదం వుంది. 'సింధు-హిందు' అయినట్లే 'సరస్వతి-హరహ్వతి' అయింది. అవెస్తాలో కూడా ఆ పదానికి అదే అర్థం- 'సరస్సులతో సుసంపన్నమైనది'. ప్రాచీన పర్షియా భాషలోకూడా ఈ పదం "హరౌవతి"గ వుంది. ఆ పేరుతో ఇప్పటికీ ఆఫ్ఘనిస్తాన్‌లో 'హారూత్'నది వుంది.

వైదిక ఆర్యులు కైబర్ కనుమల నుంచి వచ్చి పంచనదుల ప్రాంతమైన పంజాబ్‌లో స్థిరపడ్డారు. పుష్కలంగానీరు, పచ్చిక, ఆహారధాన్యాలు లభించే చోట సుఖజీవితం లభించింది. ఆ నదుల తీరాలలో వుంటూ వాళ్ల జీవితాలను ఆడుతూ పాడుతూ గడిపారు. అలా గడిపేటప్పుడు వారి నోటినుండి జాలువారిన కవిత్వమే 'శ్రుతులు'గా, వేదాలుగా పరిణమించింది. వారు నివసించిన ప్రాంతానికి 'ఆర్యావర్తం, బ్రహ్మావర్తం'లో అని పేర్లుంచుకున్నారు. ఆ 'బ్రహ్మావర్తం' లోనే ఇండో ఇరానియన్ భాషగా వుండే ప్రాచీన ప్రాకృతం క్రమంగా సంస్కరణకులోనై, సంస్కృతమయింది. ఆ సంస్కృత భాషలోనే సామ, యజుర్, అధర్వవేదాలు, బ్రాహ్మణాలు, స్మృతులు, ఉపనిషత్తులు కాలక్రమేణ వ్యాప్తిలోకి వచ్చాయి. చారిత్రక పరిశోధకులయిన బ్రిడ్జెట్ అండ్ రేమండ్‌ల మాటల్లో చెప్పాలంటే, 'సరస్వతి- దృషద్వతి' నదీలోయ ప్రాంతాలు, మైదానాలే తొలికాలపు ఆర్యుల స్థిరావాసాలు'. అందుకే వారి జీవన వ్యవహారాల సంకలన గ్రంథమైన

రుగ్వేదంలో 'సరస్వతి' గురించి చాలాచోట్ల స్తుతులు, సూక్తాలు కన్పిస్తాయి. ఉదాహరణకి రుగ్వేదం (2-41-16)లో సరస్వతిని "అంబితమే, నదీతమే, దేవీతమే సరస్వతి" అన్నారు. ఉత్తమ తల్లి, ఉత్తమ నది, ఉత్తమ దేవతగా దానిని కీర్తించారు. మరొకచోట (8-21-18) పాలను, నేతిని అందించే తల్లిగా కొనియాడారు. రుగ్వేదంలో కనీసం 50 చోట్ల ఇలాంటి స్తుతి కన్పిస్తుంది. అప్పటికి, గంగానదికి కూడా ఇంతటి ప్రాముఖ్యత లేదు. పంజాబ్ ప్రాంతం నుంచి ప్రవహిస్తూ వచ్చే దృషద్వతి (చేతాంగ్), సతుద్రి (సత్లెజ్), చంద్రభాగ(చీనాబ్), విపాస(బియాస్), ఇరావతి (రావి) అనే అయిదు నదులు సరస్వతి దగ్గర కలుస్తాయి గనుక దానికి ఆ పేరు వచ్చిందని, అందుకే వైదికార్యులకు ఆ సంగమ ప్రాంతం పవిత్రస్థలంగా మారిందని మధ్యయుగ భారతీయ చరిత్రకారుడు ఉవాత అభిప్రాయ పడుతున్నారు.

ఆ మైదానప్రాంతంలోనే వేదరుషులుగా పిలవబడే గౌతమాదిరుషులు తమరచనలు కావించారు. ఉపనిషత్కారులు జ్ఞానబోధలు చేసారు. తాత్వికచర్చలు జరిపారు. వేదాంగాలు, వేదాంతాలు పుట్టుకొచ్చాయి. ఇంతటి సాహిత్యసృష్టికి, జ్ఞానవృద్ధికి ఆ 'సరస్వతే' కేంద్రస్థానం. కనుక, కాలక్రమంలో, కవుల వర్ణనలతో సరస్వతి జ్ఞానదేవతగా పరిణమించింది. హిమాలయాల్లోని శివాలిక్ పర్వత ప్రాంతాల నుంచి బయల్దేరిన నదీనదాలు పశ్చిమంగా రాజస్థాన్ వైపు పయనించాయి. కొన్ని మధ్యలోనే కనుమరుగై యింకిపోయాయి. సరస్వతి కూడా క్రమంగా ఎండిపోయింది. ఆ వాస్తవాన్ని అంగీకరించలేక, హైందవులు కొందరు ఇప్పటికీ అది 'అంతర్వాహిని'గా ప్రవహిస్తూనే వుందని, గంగ, యమునలతో 'త్రివేణి' వద్ద కలుస్తుందని విశ్వసిస్తున్నారు. మనకళ్ళ ముందే 'మూసీ' వంటి కొన్ని నదులు కొన్ని చోట్ల బక్కచిక్కి ఎండిపోయి ఆవాసప్రాంతాలు కావటం మనం చూస్తూనేవున్నాం. ఇలా ప్రవాహంగా కనుమరుగయిన తర్వాత సరస్వతి ఒక 'జ్ఞాన దేవత'గా కావ్యాల్లో ప్రత్యక్షమయింది. నీళ్లపై తేలాడే తామరపూవుపై కూర్చోవటం, హంసవాహనాల్ని కల్గివుండటం, నెమలి, చేతుల్లో పుస్తకం, అక్షమాల, వీణ మొదలయినవన్నీ పట్టుకొని వుండటం- ఇవన్నీ వైదికార్యుల 'సారస్వతా'నికి ఆనవాళ్లుగా మిగిలాయి. పురాణకథలు తామరతంపరగా పుట్టుకొచ్చే క్రమంలో, సరస్వతి, బ్రహ్మకూతరని, వారిద్దరూ విడదీయరాని భార్యాభర్తలని... ఇంకా ఎవరికి తోచిన రీతిలో వారు కల్పనలల్లారు. ఆ కల్పనల్లో భరించలేని అశ్లీలతను కూడా దట్టించి 'సరస్వతీ పురాణాలు రాసారు. బ్రహ్మ అంటే వేదజ్ఞానం గల వృద్ధ బ్రాహ్మణ పండితుడు.

## విదేశీ సరస్వతులు

జ్ఞానదేవతలు మనదేశంలోనే కాదు, ప్రాచీన నాగరికతలు వెలసిన అన్ని ప్రాంతాల్లోనూ వున్నారు. గ్రీకులో 'ఎథెనా' అలాంటి దేవతే. రోమన్ రాజ్యంలో 'మినర్వా' కూడా జ్ఞానదేవతే. బ్రహ్మతొడనుంచి లేదా నాలుక నుంచి సరస్వతి వచ్చిందని హిందూ పురాణాలు చెప్పినట్లు, జూపిటర్ తలలోంచి 'మినర్వా' వచ్చిందని వారు చెప్పుకున్నారు. ఆమె బ్రహ్మచారిణి. సంగీతం, కవిత్వం, జ్ఞానం, వాణిజ్యం, వైద్యం, మొదలగు వాటికి మినర్వా అధిష్టాన దేవత. సరస్వతికి హంసవున్నట్లే, మినర్వాకి ఒక గుడ్లగూబ వుంటుంది. ఆ హంస పాలను నీరును వేరుచేస్తుందని చెప్తారు. అంటే ఏది సరైనది, ఏది కాదు అనే వివేకాన్ని హంసకల్గి వుంటుందన్నమాట. అలాంటి వివేచనే మినర్వా గుడ్లగూబకి వుందని అక్కడి కథలు చెప్తాయి. నిజానికి హంసలు, అలాంటి గుడ్లగూబలు వున్నట్లు ఆధారాలు లేవు. భారతదేశానికి తూర్పున, ఈశాన్యాన వుండే చైనా, జపాన్, లాంటి ప్రాచీన నాగరిక దేశాల్లో జ్ఞానదేవతలు పురుషులు కావటం గమనార్హం.

## పూజలతో 'జ్ఞానం' వస్తుందా?

మానవ నాగరికతా పరిణామాన్ని మనం నిష్పాక్షికంగా పరిశీలించినపుడు, కాలానుగుణంగా, ప్రాంతాలకు తగినట్లు, మనుషుల అవసరాలను, అభిరుచులను అనుసరించి దేవీదేవతల ఆరాధన ఏర్పడుతూ వచ్చిందని తెలుస్తుంది. దీన్ని గ్రహించాలంటే మనలో చారిత్రక, పరిశోధక దృష్టి, ఆసక్తి ఉండాలి. మన విశ్వాసాలను అవసరమైనపుడు మార్చుకోగల విచక్షణ, ధైర్యం కూడా ఉండాలి.

సరస్వతీ పరివాహక ప్రాంతంలో ఆనాడు జ్ఞానం పరిఢవిల్లి, విద్యాగంధాలు వ్యాపించి, సంగీత సాహిత్యాది లలితకళలు విలసిల్లి నాగరికత వికసించి వుండవచ్చు. దానికి సరస్వతీ ప్రాంతం ఒక సంకేతంగా మారి, క్రమంగా దేవతాస్థాయిని పొంది వుండవచ్చు. ఇది కేవలం చరిత్ర. దాన్ని అధ్యయనం చేయాలి తప్ప, పూజించటం వల్ల ఏం ప్రయోజనం సిద్ధిస్తుంది? జ్ఞానదేవతలున్న దేశాల్లోని ప్రజలు సైతం, జ్ఞానం, చదువు, కళలకోసం ఆ దేవతలను పూజించటాన్ని ఏనాడో వదిలేసారు. ఆ దేవతల కథల్ని వినోదంగా చెప్పుకుంటూ, తమ సంతానానికి సాహిత్య సంపదగా అందిస్తారే తప్ప, పూజించమని చెప్పరు. ఆరాధనలతో, స్తోత్రాలతో, జ్ఞానదేవతలను ప్రసన్నం చేసుకోమని, తద్వారా ఉన్నతస్థాయిని అందుకోవచ్చని తప్పుడు దారి చూపించరు. మరి మనమెందుకు అలా చేస్తున్నాం?

ఒక్క వుదాహరణ చూద్దాం- ప్రపంచస్థాయిలో మేధోశక్తిని, పరిశీలనాప్రతిభను, అంచనావేసి, గౌరవించేందుకు 'నోబెల్ బహుమతి' ఏర్పడింది. 1901 సం॥ నుండి 2019 సం॥ వరకు నోబెల్ బహుమతులు అందుకున్న వ్యక్తులు, సంస్థలు మొత్తం 950 వరకు ఉన్నారు. కొందరు రెండుసార్లు కూడా ఆ బహుమతినందుకున్నారు. ఆ లెక్కన చూస్తే, ఇప్పటివరకు 869మంది పురుషులు, 54 మంది స్త్రీలు, 27 సంస్థలు ఆ బహుమతి స్వీకరించారు. వీరిలో ఏ ఒక్కరైనా సరస్వతీ పూజలు చేసే అంతవారయ్యారా? పోనీ, భారతదేశం వరకే పరిమితమై చూద్దాం. ఈ దేశ పౌరులుగా గుర్తింపు పొంది నోబెల్ అందుకున్నవారు- రవీంద్రనాథ్ ఠాగూర్, సి.వి.రామన్, అమర్త్యసేన్, మదర్‌థెరిసా, కైలాష్ సత్యార్థి. ఈ దేశంలోపుట్టి, విదేశీ పౌరులుగా వుంటూ నోబెల్ అందుకున్న హరగోవింద్‌ఖొరానా, సుబ్రహ్మణ్యం చంద్రశేఖర్, వి.యస్.నైపాల్, మహ్మద్ యూనస్, వెంకట్రామన్ రామకృష్ణన్, అభిజిత్ బెనర్జీలుగానీ, విదేశాల్లో పుట్టి, అవసరార్థం ఈ దేశంలో వుంటూ నోబెల్ అందుకున్న రోనాల్డ్‌రాస్, రుడ్‌యార్డ్ కిప్లింగ్, 14వ దలైలామా గానీ.. వీరిలో ఏ ఒక్కరైనా సరస్వతీ కటాక్షంతో అంత గుర్తింపు తెచ్చుకున్నట్లు చెప్పారా? వింతేమిటంటే, పైన పేర్కొన్న 13 మందిలో 10మంది తమకే మతం లేదని చెప్పుకున్నవాళ్ళు. మిగిలిన ముగ్గురూ హైందవేతరులు. సరస్వతీ కటాక్షంతో హిందువులకి నోబెల్ ఇంతవరకూ రాలేదన్నమాట.

జ్ఞానం వంశపారంపర్యం కాదు, అలాగే దైవదత్తమూ కాదు. పండిత పుత్రుల్లో పరమశుంఠలూ వుంటారు. నిరక్షరకుక్షులయిన వారి సంతానం పండితులుగాను ఎదుగుతారు. అందుకు కారణం దైవారాధన కానేకాదు. పామరుడైన కాళిదాసు లాంటివాళ్లు, తెనాలిరామలింగడు వంటివారు దైవకృపతోనో, సరస్వతీ కటాక్షంతోనో మహాకవులుగా ఎదిగారని చెప్పే కథలు వినసొంపుగా వుంటాయిగాని, వాస్తవాలు కాబోవు. 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం' అన్నట్లు, నేర్చుకునే వాటిపై మనం చూపే శ్రద్ధాసక్తులే మన జ్ఞానానికి దోహదపడతాయి. ఈవాస్తవాన్ని బాలబాలికలు గుర్తించేవిధంగా చేయాలి.

## అసర్ అందించే వాస్తవం

ఒక వాస్తవాన్ని కూడా మనం గుర్తించాలి. మనదేశంలో ప్రతిఏటా విద్యారంగాన్ని సర్వేచేసి కొన్ని కఠోర వాస్తవాల్ని వెల్లడించే సంస్థ ఒకటుంది. అది ASER (Annual Status of Education Report) పేరుతో ఒక నివేదికను విడుదల చేస్తుంది. ప్రతిఏటా 3-16 సం॥ మధ్య వయసున్న బాలబాలికల్లో ఎంతమంది పాఠశాలలకు వెళ్తున్నారు, 5-16 మధ్య వయస్కులయినవారు చదవటం, లెక్కలు చేయటంలో ఏ

స్థాయిని కనబరుస్తున్నారు మొదలగు విషయాలను గణాంకాలతో వివరిస్తుంది. దేశంలోని మొత్తం 560 జిల్లాల్లోంచి, 16,000 గ్రామాల్ని తీసుకొని 6,50,000 మంది బాలబాలికల్ని కలిసి సర్వే జరుపుతారు. ఈ సర్వేలో 500 స్వచ్ఛంద సంస్థలు, 25,000 మంది కార్యకర్తలు పాల్గొంటారు. ప్రభుత్వేతర సర్వేల్లో బహుశా యిదే అతిపెద్ద సర్వే. 2019 జనవరిలో వారు విడుదల చేసిన నివేదిక చూస్తే మన విద్యార్థులపై సరస్వతీ కటాక్షం ఎంతవుందో తెలుస్తుంది. మచ్చుకి, 2018 సం॥లో 5వ తరగతి చదివే పిల్లల్లో విద్యాస్థాయిని పరిశీలించినపుడు 50.3% మంది 2వ తరగతి పాఠ్యపుస్తకాన్ని చదవగలిగే స్థితిలో వున్నారు. అలాగే లెక్కలు చేయటంలోకూడా. ఇది ప్రభుత్వ పాఠశాలల్లోని పరిస్థితి. ఇందుకు మనం సవాలక్ష కారణాలను చెప్పవచ్చు. 'అందుకే ప్రయివేట్ స్కూళ్ళకు పంపుతున్నారు తల్లిదండ్రులు' అని కూడా కొందరనవచ్చు. కానీ, ఆ సర్వేప్రకారం వేలాది రూపాయల ఫీజులు చెల్లించి చదివించే ప్రయివేటు పాఠశాలల్లో కూడా, 54.2% మంది విద్యార్థులు మాత్రమే 5వ తరగతిలో వుంటూ 2వ తరగతి లెక్కలు చేయగల్గిన పాఠాలు చదవగల్గివున్నారు. మిగిలినవారి సంగతేమిటి? దీనికేమనాలి? ఎవర్ని బాధ్యుల్ని చేయాలి?

కనుక లోపాల్నిగుర్తించి సరిచేయాలి తప్ప, వాటినలాగే వుంచి, దేవీదేవతా కరుణా కటాక్షాల కోసం తాపత్రయ పడకూడదు. పుట్టమీద కొడితే పాము చస్తుందా?

**అన్వేషణ, జ్ఞానార్జన అనేవి మనిషికి సహజంగా అబ్బిన గుణాలు. పరిణామక్రమంలో వాటివల్లనే మానవ నాగరికత పెరిగింది. మనిషిని నడిపించేవి, తెలివినిపెంచేవి భౌతికాంశాలే తప్ప అభౌతికమైనవి కావు.**

అభౌతికశక్తుల ప్రమేయంతో మనిషి తెలివితేటలు ఎదుగుతాయన్న నమ్మకం నుంచి తక్షణం మనం బయటపడాలి. "దైవాధీనం జగత్సర్వం" అని నమ్మేరోజుల్లోనే మనం యింకా వున్నామంటే, చాలా వెనకబడివున్నామని అర్థం. అర్థించేస్థాయినుంచి స్వయంకృషితో దేన్నైనా సాధించేస్థాయికి ఎదగాలంటే మనలో అంతర్గతంగా వున్న సహజశక్తియుక్తుల్ని వెలికి తీయాలి. అందుకు భక్తిమార్గం ఏమాత్రం తోడ్పడదు. ఆత్మవిశ్వాసం, స్వీయప్రతిభ, స్వయంకృషి పిల్లల్లో బాల్యంనుంచే అలవడితే, వారి జీవనసౌభాగ్యానికి ఏ అభౌతిక శక్తుల అవసరమూ వుండదు.



# అంకెలకీ శుభాశుభాలకీ లింక్ ఉందా?




**ము**ప్ఫై నలభై ఏళ్లక్రితం రేడియోలో భక్తిరంజని వంటి కార్యక్రమాలను నిలుపుదల చేయాలంటూ ఉద్యమాలు నడిచాయి. ఉదయం 6 గంటల నుండి సుమారు గంటపాటు 'ఏమిటీ చాదస్తం'! అంటూ ప్రశ్నించడం ఉండేది. 'గొర్రెల్ని తినేవాడు పోయి బర్రెల్ని తినేవాడు వచ్చినట్లు' ఇపుడు రేడియో ఒక్కటేకాదు, దేశంలో వందలాది టీవీ ఛానళ్ల నుండి భక్తి ఏరులైపారుతోంది. చాదస్తం ఉవ్వెత్తున ఎగిసిపడే అలలుగా మెదళ్లని తాకుతూ వివేకాన్ని నిర్వీర్యం చేస్తోంది. అయినా అడిగేవాడు లేడు.

ఉదయం 5 గంటల నుండి 9 గంటల దాకా కొన్ని టీవీ ఛానళ్లు పెట్టుకోవాలంటేనే జుగుప్స కలుగుతోంది. మౌఢ్యాన్ని ఇంత నిస్సిగ్గుగా జనంలోకి ప్రసరింపచేయటమేమిటి? జ్యోతిష్యాలు, ముహూర్తాలు, పంచాంగాలు, నాటువైద్యాలు, రంగురాళ్ళు... ఇవన్నీ వాస్తవమేనంటూ రకరకాల కల్పనలతో, కథలతో వీక్షకులను నమ్మించే వైనం చూస్తుంటే, 'ఎంతటి బాధ్యతారాహిత్యం ఈ ఛానెళ్ళకి!' అనిపిస్తుంది.

ఒక పండితవేషధారి, ఆధునిక విజ్ఞాన, సాంకేతికశాస్త్రాల వల్ల తయారైన కంప్యూటర్‌ను తన ముందుంచుకొని, 'సంఖ్యాశాస్త్రవేత్త'నంటూ దర్పాన్ని ప్రదర్శిస్తుంటాడు.

వ్యక్తుల జీవితాల్లోని అన్ని సమస్యలకు, బాధలకు, 'పేరుబలం' కారణమంటూ, ఉన్నపేర్లను మార్చుకోమని సలహాలిస్తాడు. పేర్లలోని ఇంగ్లీషు అక్షరాలను తగ్గించటమో, పెంచటమో చేయమని. తద్వారా ఆరోగ్యం దగ్గర నుంచి ఆర్థిక సమస్యల వరకు, వుద్యోగాలు మొదలుకొని పెళ్లిళ్ల వరకు అన్ని బాధలు తొలగిపోతాయని నమ్మబలుకు తుంటాడు. 'దున్నపోతు ఈనింది' అనగానే 'దూడను తెచ్చిగాటను కట్టెయ్యమన్నట్లు' సాగే ఇలాంటి కార్యక్రమాలవల్ల ప్రజలకు మేలు జరుగుతుందా? కీడుజరుగుతుందా? అని ఆ పండితమ్మన్యులూ ఆలోచించరు, ఆ టీవీ వ్యాపారులూ గుర్తించరు.

అంకెలతో నిండివుండే గణితశాస్త్రానికున్న ప్రాధాన్యత విలువ కట్టలేనిది. అలాంటి అంకెల ఆధారంగా, 'సంఖ్యాశాస్త్రం' వంటి పదాడంబరత మాటున నక్కి అశాస్త్రీయమైన, నిరాధారమైన, పుక్కిటి కల్పనలతో ఏ విలువాలేని గారడిమాటలతో జనాన్ని ఎండమావులవైపు ఆకర్షిస్తున్న వంచనాశిల్పాన్ని ఎందుకు మన్నించాలి? ఎందుకు ప్రోత్సహించాలి?

అసలు అంకెల్లో శుభాశుభాలుంటాయా? అంకెలతో 'అదృష్టం' వస్తుందా?

'అదృష్టసంఖ్య'లను నమ్మేవారు మన సమాజంలో చాలామంది ఉన్నారు. లక్షలు ఖర్చుచేసి కొత్తగా కొన్నకారుకి కేవలం 'లక్కీనెంబర్' కోసం లక్షలు ఖర్చుపెట్టేవారున్నారు. లాటరీ టికెట్ కొనేటప్పుడు, జాక్‌పాట్ ఆడేటప్పుడు, మోటార్‌బైక్ కొనేటప్పుడు.. ఒకటేమిటి ఏ పనిచేయబోతున్నా అంకెల్ని చూసి అడుగువేయడం కొందరిలో అలవాటుగా ఉంది.

అంకెలకీ, అదృష్టానికీ సంబంధం ఉంటుందా? ఉంటే ఎలా ఉంటుంది? అదృష్టమే అశాస్త్రీయమైతే, అంకెలిచ్చే అదృష్టం శాస్త్రీయమవుతుందా? అంకెలే మన జీవితాన్ని నడిపిస్తాయని, మనకు కలిగే మంచిచెడుల వెనుక అంకెల ప్రభావం ఉంటుందని చెప్పే 'సంఖ్యాశాస్త్రం' కూడా మనిషిని పట్టి వేధిస్తున్న మూఢనమ్మకాల్లో ఒకటి. జ్యోతిష్యానికి, సంఖ్యాశాస్త్రానికి చాలా పోలికలున్నాయి. అందుకే, కొన్ని చోట్ల ఈ రెండింటి పేరుతో బోర్డులు తగిలించి అమాయక జనాన్ని ఆకర్షించి వారి జేబులు కొట్టి బ్రతికే మోసగాడు ఒక్కడే రెండూ చెబుతుంటాడు.

వ్యక్తుల జీవితాల్లోని అన్ని సమస్యలకు, బాధలకు, 'పేరుబలం' కారణమంటూ, ఉన్నపేర్లను మార్చుకోమని సలహాలిస్తాడు. పేర్లలోని ఇంగ్లీషు అక్షరాలను తగ్గించటమో, పెంచటమో చేయమని, తద్వారా ఆరోగ్యం దగ్గర నుంచి ఆర్థిక సమస్యల వరకు, వుద్యోగాలు మొదలుకొని పెళ్లిళ్ల వరకు అన్ని బాధలు తొలగిపోతాయని నమ్మబలుకుతుంటాడు. 'దున్నపోతు ఈనింది' అనగానే 'దూడను తెచ్చిగాటను కట్టెయ్యమన్నట్లు' సాగే ఇలాంటి కార్యక్రమాలవల్ల ప్రజలకు మేలు జరుగుతుందా? కీడుజరుగుతుందా? అని ఆ పండితమ్మన్యులూ ఆలోచించరు, ఆ టీవీ వ్యాపారులూ గుర్తించరు.

అంకెలతో నిండివుండే గణితశాస్త్రానికున్న ప్రాధాన్యత విలువ కట్టలేనిది. అలాంటి అంకెల ఆధారంగా, 'సంఖ్యాశాస్త్రం' వంటి పదాడంబరత మాటున నక్కి అశాస్త్రీయమైన, నిరాధారమైన, పుక్కిటి కల్పనలతో ఏ విలువాలేని గారడిమాటలతో జనాన్ని ఎండమావులవైపు ఆకర్షిస్తున్న వంచనాశిల్పాన్ని ఎందుకు మన్నించాలి? ఎందుకు ప్రోత్సహించాలి?

అసలు అంకెల్లో శుభాశుభాలుంటాయా? అంకెలతో 'అదృష్టం' వస్తుందా?

'అదృష్టసంఖ్య'లను నమ్మేవారు మన సమాజంలో చాలామంది ఉన్నారు. లక్షలు ఖర్చుచేసి కొత్తగా కొన్నకారుకి కేవలం 'లక్కీనెంబర్' కోసం లక్షలు ఖర్చుపెట్టేవారున్నారు. లాటరీ టికెట్ కొనేటప్పుడు, జాక్‌పాట్ ఆడేటప్పుడు, మోటార్‌బైక్ కొనేటప్పుడు... ఒకటేమిటి ఏ పనిచేయబోతున్నా అంకెల్ని చూసి అడుగువేయడం కొందరిలో అలవాటుగా ఉంది.

అంకెలకీ, అదృష్టానికీ సంబంధం ఉంటుందా? ఉంటే ఎలా ఉంటుంది? అదృష్టమే అశాస్త్రీయమైతే, అంకెలిచ్చే అదృష్టం శాస్త్రీయమవుతుందా? అంకెలే మన జీవితాన్ని నడిపిస్తాయని, మనకు కలిగే మంచిచెడుల వెనుక అంకెల ప్రభావం ఉంటుందని చెప్పే 'సంఖ్యాశాస్త్రం' కూడా మనిషిని పట్టి వేధిస్తున్న మూఢనమ్మకాల్లో ఒకటి. జ్యోతిష్యానికి, సంఖ్యాశాస్త్రానికి చాలా పోలికలున్నాయి. అందుకే, కొన్ని చోట్ల ఈ రెండింటి పేరుతో బోర్డులు తగిలించి అమాయక జనాన్ని ఆకర్షించి వారి జేబులు కొట్టి బ్రతికే మోసగాడు ఒక్కడే రెండూ చెబుతుంటాడు.

* * *

విజయ్‌కి తన 'లక్కీనెంబర్' తెలుసుకోవాలని కోరిక. ఒకరోజు ఒక సంఖ్యాజ్యోతిష్యుని దగ్గరకు వెళ్ళాడు. విజయ్ పుట్టిన తేదీని అడిగాడాయన.




'10-04-1975' అని చెప్పాడు విజయ్. సంఖ్యాజ్యోతిష్యుడు వెంటనే లెక్క ప్రారంభించాడు. ఆ తేదీలోని అంకెలన్నింటినీ ఇలా కూడిక చేసాడు.

1+0+0+4+1+9+7+5=27 వచ్చింది. మళ్ళీ 2+7=9 అని చేసాడు.

'విజయ్‌గారూ! మీరు చాలా అదృష్టవంతులండీ. మీ లక్కీనెంబర్ 9' అన్నాడు. 9కి ఉన్న ప్రాధాన్యతను వివరించాడు. జీవితంలో జరగబోయే శుభాలను, సత్ఫలితాలను ఏకరువు పెట్టాడు. విజయ్ మనసు తృప్తిపడింది. జ్యోతిష్యుడడిగిన విధంగా రూ. 5000/- సమర్పించి అక్కడనుండి కదిలాడు. అదృష్టం విజయ్‌దా? జ్యోతిష్యునిదా?

❉ ❉ ❉

అదృష్టసంఖ్య (లేదా అంకె)లను నిర్ణయించడానికి 'సంఖ్యాశాస్త్రవేత్త'లు వాడే పద్ధతులు మరికొన్ని ఉన్నాయి. కొంతమందికి పుట్టిన తేదీ, నెల గుర్తుండదు. అలాంటప్పుడు సంవత్సరం మాత్రమే చెబితే చాలు.

ఇందిరాగాంధీ 1917లో పుట్టింది. కాబట్టి ఆమె అదృష్టసంఖ్య 1+9+1+7=18 =1+8=9 అని నిర్ణయిస్తారు. పుట్టినతేదీ గుర్తుండి, దాన్నే సంఖ్యాశాస్త్రవేత్తలకు చెపితే వారు లక్కీనెంబర్‌ను చెబుతారు.

వివేకానందుడు 12వ తేదీ (జనవరి) పుట్టాడు కనుక 1+2=3 అని '3' ని లక్కీనెంబర్‌గా నిర్ణయిస్తారు. అలాగే కేవలం నెల ఏదో చెప్పినా, అందులోని అంకెలను కూడి చెబుతారు.

పై నాలుగుపద్ధతులు పుట్టిన తేదీల ఆధారంగా మాత్రమే లక్కీ నెంబర్‌లను నిర్ణయించేవి. పేరును బట్టికూడా నిర్ణయించే పద్ధతి మరొకటుంది. దాన్ని తెలుసుకోవాలంటే సంఖ్యాశాస్త్రం చరిత్రలోకి వెళ్ళాలి.

❉ ❉ ❉

గణితశాస్త్రానికి ఆరంభదశ క్రీస్తుపూర్వమే ఉంది. ఈజిప్టు, బాబిలోనియా, ఇండియా, చైనావంటి దేశాలలో ప్రాచీన గణిత ఆధారాలు దొరుకుతున్నాయి. కొన్ని సంఖ్యలను ఉచ్చరిస్తే వాటినుండి వెలువడే ప్రకంపనాలు వ్యక్తుల ప్రవర్తనపై ప్రభావం చూపుతాయని పూర్వం నమ్మారు. అలాంటివాటిని మాయాసంఖ్యలు (మాజికల్ నెంబర్స్) అన్నారు. క్రీ.పూ. 500 సంవత్సరాల నాడు గ్రీకులో జీవించిన గణిత శాస్త్రవేత్త పైథాగరస్ 'కొన్ని అంకెలతో ఏర్పడే సంఖ్యల లయబద్ధత, మధ్య ఏర్పడే విరామాలు వ్యక్తుల్లో ఉద్రేకాలను కలిగిస్తాయ' ని పేర్కొన్నాడు. 'అన్నింటికీ అంకెలే మూలం" అన్న తాత్విక దృక్పధానికి పైథాగరస్ మూలపురుషుడని తర్వాత వారు అన్నారు. ఈ ప్రపంచానికి 'సంగీతాత్మక సంఖ్యలే (మ్యూజికల్ నెంబర్స్) కొలబద్ద'గా పేర్కొన్నారు. పైథాగరస్ చెప్పకపోయినా, తరువాతి కాలంవారు ఆయన పేరుతో ఒక పట్టికను తయారుచేసారు. ఇంగ్లీషు 26 అక్షరాలను ఈ క్రిందివిధంగా 9 అంకెలకు పంచారు. చూడండి–




| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| A | B | C | D | E | F | G | H | I |
| J | K | L | M | N | O | P | Q | R |
| S | T | U | V | W | X | Y | Z | |

పైన చూపిన 'పైథాగరస్ పట్టిక' ఆధారంగా 'పేరు బలా'న్ని బట్టి అదృష్ట అంకెను రాబడతారు. ఉదాహరణ చూద్దాం– విజయ్ పేరుబలం ఇలా ఉంటుంది.

| | | | | |
|---|---|---|---|---|
| V | I | J | A | Y |
| 4 | 9 | 1 | 1 | 7 |

4+9+1+4+7=22=2+2=4

పేరుబలాన్ని బట్టి విజయ్ అదృష్ట అంకె '4' అని నిర్ణయిస్తారు.

ఇలంటిదే మరోపద్ధతి కూడా ఉంది. చాల్డియా అనే దేశంలో అది పుట్టింది. హిబ్రూభాషలోని అంకెలతో ఇంగ్లీషు అక్షరాలను విభజిస్తారు. దానిని 'చాల్డియన్' పద్ధతి అంటారు.

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|
| A | B | C,G | D, | E,H | | | F,P |
| I,J,Y | K | L | M | N | | O | |
| Q | R | S | T | | U,V,W,X | | Z |

పై పట్టికలో '9' అంకె లేదు. హిబ్రూలో ఆ అంకె క్రింద సూచించిన హిబ్రూ అక్షరాలకు సమానమైనవి ఇంగ్లీషులో లేవు. అందుకే దానిని తప్పించారు. ఈ నిజాన్ని దాచడానికి ఒక అందమైన అబద్ధం చెప్పారు. హిబ్రూలో దేవుని పేరు 9 అక్షరాలతో ఉంటుందని, కనుక ఆ నెంబర్‌స్థాయికి ఏ అక్షరము చేరరాదని, అందుకే 'చాల్డియన్ పట్టిక'లో 9 ఉండరాదని అన్నారు. ఎంతటి జాణతనమో చూడండి!

పై చాల్డియన్ పట్టికనే ఒకటిరెండు తేడాలతో 'కార్నేలియస్ అగ్రిపా' పద్ధతిలో ఇలా రాస్తారు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | A | I | Q | J | Y |
| 2 | B | K | R | | |
| 3 | C | L | G | S | |
| 4 | D | M | T | | |
| 5 | E | H | N | | |
| 6 | U | V | W | X | |
| 7 | O | Z | | | |
| 8 | F | P | | | |

పై మూడు పట్టికలే ప్రపంచవ్యాప్తంగా 'సంఖ్యాశాస్త్రవేత్త'లు వాడుతుంటారు. అందులో ఎవరికి నచ్చిన పట్టిక వారిది. అందుకే అదృష్టసంఖ్యల్లో కూడా తేడా వచ్చే అవకాశముంటుంది.

ఉదాహరణకి 'జహీరా' అనే స్త్రీ తన అదృష్ట అంకె కోసం మూడు పట్టికలతో చెప్పే ముగ్గురు సంఖ్యాశాస్త్రవేత్తలను కలిసిందనుకుందాం.

మొదటగా పైథాగరస్ పట్టిక వానిదగ్గరకు వెళ్ళింది. ఆయన ఇలా చేసాడు.

| Z | A | H | E | E | R | A |
|---|---|---|---|---|---|---|
| 8 | 1 | 8 | 5 | 5 | 9 | 1 |

8+1+8+5+5+9+1=37=3+7=10=1+0=1

జహీరా అదృష్ట అంకె 1 అని చెబుతాడు.

తర్వాత 'చాల్డియన్ పట్టిక' వాని దగ్గరకు వెళ్లింది. ఆయన ఇలా చేసాడు.

| Z | A | H | E | E | R | A |
|---|---|---|---|---|---|---|
| 8 | 1 | 5 | 5 | 5 | 2 | 1 |

8+1+5+5+5+2+1=27=2+7=9

ఇప్పుడు జహీరా అదృష్ట అంకె 9 అయ్యింది.

మూడోసారి 'కార్నేలియస్ అగ్రిపా' పట్టిక వానిని ఆశ్రయించింది. ఆయన చేసింది ఇలా ఉంది.

| Z | A | H | E | E | R | A |
|---|---|---|---|---|---|---|
| 7 | 1 | 5 | 5 | 5 | 2 | 1 |

7+1+5+5+5+2+1=26=2+6=8

జహీరా అదృష్ట అంకె 8 అయింది.

పై మూడింటిలో ఏది తన అదృష్ట అంకో జహీరా ఎలా తేల్చుకుంటుంది? ఇలాంటి అసంగతాలు, వైరుధ్యాలు 'సంఖ్యాశాస్త్రం'లో మామూలే.

పుట్టినతేదీని బట్టి, నెలను బట్టి, సంవత్సరాన్ని బట్టి, ఈ మూడింటి మొత్తాన్ని బట్టి, పేరులోని అక్షరాలను బట్టి మొత్తం అయిదు పద్ధతుల్లో అదృష్ట అంకెను కనుక్కుంటారని పైన చెప్పుకున్నాం. వీటితోపాటు మరో సులువైన పద్ధతికూడా ఉంది. ఆ ఆరో పద్ధతికి పట్టికలతో పనిలేదు.

V I J A Y

1 2 3 4 5

పైన వరుసగా రాసిన అంకెల్లో చివరిది '5'. కనుక విజయ్ అదృష్ట సంఖ్య 5 అవుతుంది.

ఈ మూడు పద్ధతుల్లో దేన్ని బట్టయినా అదృష్టఅంకెను నిర్ణయించి ఇస్తారు సంఖ్యాజ్యోతిష్యులు. అదంతా వారి సమయానుకూలబుద్ధిని బట్టి ఉంటుంది. కాని, ఈ పద్ధతులను బట్టి చూస్తే ఎవరైనా తమ అదృష్టం ఏ అంకెలో ఉందో తెలియని 'దురదృష్టానికి' లోనవుతారు. మీకు మీరుగా ఈ వినోదాన్ని చూసుకున్నా ఈ విషయం బయటపడుతుంది.

❋ ❋ ❋

వసంతనాగలక్ష్మికి చిన్నప్పటి నుంచీ సినిమాల పిచ్చి. ఎలాగైనా హీరోయిన్ కావాలని, తెరపై తనను తాను చూసుకుని మురిసిపోవాలని కలలు కనేది. మన 'కలల' రాష్ట్రపతి అబ్దుల్‌కలాం అన్నట్లే ఆమె కలలు ఫలించాయి. హైదరాబాద్ చేరుకుంది. మొదటిసినిమాలో నటించేముందు 'మంచిచెడు' కోసం సంఖ్యాజ్యోతిష్యుని కలిసింది. ఆమె పేరులోని అక్షరాలన్నింటి ఫలితాన్ని లెక్కించి ఆమె అదృష్ట అంకె '2' అని తేల్చారాయన. అది శుభం కాదన్నాడు. మరోపేరు ఎంచి పెట్టాడు. అయినా ఆమె సినిమా ఇంతవరకు విడుదలకు నోచుకోలేదు.

ఇలా ఎందరో సినీతారలు పేర్లు మార్చుకుంటుంటారు. తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి జయలలిత పేరు ఇంగ్లీషులో 11 అక్షరాలు. అందువల్లనే ఆమె 1998 ఎన్నికల్లో ఓడిపోయిందని, మరో అక్షరం చేర్చుకొమ్మని 'సంఖ్యాశాస్త్రవేత్త'లు చెపితే ఆమె తన పేరు చివర 'ఎ' అనే మరో ఇంగ్లీష్ అక్షరాన్ని అదనంగా చేర్చుకుంది. గతంలో మోహన్‌బాబు హీరోగా'శివ్‌శంకర్' అనే సినిమా వచ్చింది. 'శివశంకర్' అని వుండాలి. శివను 'శివ్' అనడానికి కారణం లక్కీనెంబర్ కోసం. అన్ని పాట్లుపడ్డా, ఆ సినిమా విజయవంతం కాలేదు. కర్నాటక బి.జె.పి. నాయకుడు యెడియూరప్ప, తనపేరును యెద్యూరప్పగా మార్చుకుంది కూడా రాజకీయాల్లో కలసిరావాలన్న కాంక్షతోనే. ఆయనే మళ్ళీ 2019లో అధికారానికి రావడానికి తమ పాత పేరునే వాడుకున్నాడు.

ఈ అదృష్ట అంకెలకోసం పేరు మార్పిడితో కొందరు నానాతంటాలు పడతారు. 'వెంకట రమణ' అని వుంటే, సరైన అంకె రాలేదనుకోండి, 'వెంకట్రమణ' అయిపోతాడు. లేదా ఇంగ్లీషులో అదనపు అక్షరాలను చేర్చుకొని, పేరును వికారంగా మార్చుకుంటాడు. **సంఖ్యాశాస్త్రంపై ఉన్న నమ్మకం తన మనసునే కాదు పేరునుకూడా ఎంత వికారంగా మారుస్తుందో!!**

కొందరు ఇంటిపేరునే పేరుగా మార్చుకుంటారు, కొందరు పొట్టిపేరునే వాడుకుంటారు. (శ్రీరంగం శ్రీనివాసరావు–శ్రీశ్రీ) కొందరు చివరి పేరుతోనే పిలిపించుకుంటారు (రావు, రెడ్డి, శర్మ, వర్మ మొదలగు) అందరూ అదృష్ట అంకె కోసమే అలా చేస్తున్నారని కాదు, కొందరలా చేస్తుంటారు.




జ్యోతిష్యం, సంఖ్యాశాస్త్రం– రెండూ తోడుదొంగలే కాదు, అన్న దమ్ములు కూడా.

జ్యోతిష్యంలో 9 గ్రహాలు ముఖ్యపాత్ర వహిస్తాయి. సంఖ్యాశాస్త్రంలో 9 అంకెలు ఉంటాయి. అందులో గ్రహాలకు గృహాలున్నట్లే ఇందులోనూ ఉంటాయి. ప్రతి గ్రహానికి కొన్ని ఫలితాలున్నట్లే అంకెలకూ ఉంటాయి. అదృష్ట అంకెలను బట్టి వాటి ఫలితాలు ఎలా ఉంటాయనేదానిపై ఎవరి పట్టికలు వారికుంటాయి. జ్యోతిష్యులకూ ఉంటాయి కదా!

ఏయే అదృష్ట అంకెలకు ఏయే ఫలితాలు ఉంటాయో చూపటానికి ఒక అంతర్జాతీయ సంఖ్యాశాస్త్రవేత్త అనుసరించే వివరాలను చూద్దాం.

## అదృష్టఅంకె–1

ఈ అంకెను పొందినవారు సానుకూలాలోచన గలవారై ఉంటారు. అప్పుడప్పుడూ కొంతమూర్ఖంగా, అసహనంగా ప్రవర్తిస్తారు. తమలోని సృజనాత్మకతను చూసుకుని గర్వపడుతుంటారు. ఈ గర్వంతో స్వేచ్ఛగా మసలుతుంటారు. ఇతరులపై ఆధారపడటాన్ని ద్వేషిస్తారు. ఎవరికీ లొంగి పనిచేయడానికి ఇష్టపడరు. ఏ చిన్నకష్టం వచ్చినా తీవ్రంగా స్పందిస్తారు. నాయకత్వం, పెత్తనం వీరికి సహజంగా వస్తాయి.

రానపుడు వీరే స్వతంత్రంగా ఏర్పరచుకుంటారు. వీరికి అనేక అంశాలు కలసి వస్తాయి. 2, 5, 3 అంకెలవారు వీరితో పోటీపడుతుంటారు.

## అదృష్టఅంకె-2

వీరు 1 అంకె వారివలె స్వతంత్రత కలిగివుంటారు. తమ సృజనాశక్తిని, ప్రతిభను ఆధ్యాత్మికతవైపు మళ్ళిస్తారు. ఆత్మవిశ్వాసం వీరికి తక్కువ. ఇతరుల సహాయాన్ని, రక్షణను కోరుతారు. కొన్ని సందర్భాల్లో తమస్థాయిని తామే తగ్గించుకుంటారు. అవసరమైన దానికంటే ఎక్కువగా స్పందించుతారు. పర్యావరణ ప్రభావం వీరి జీవితంపై ఎక్కువ. అభిరుచికి తగిన పరిసరాలు లేకపోతే పచ్చని పరిసరాలకోసం వెతుకుతారు. తమకంటే ఎక్కువ మనోధైర్యం ఉన్నవారిని పొగుడుతారు. 1, 4, 9 అంకెల వారిలో దానిని చూస్తుంటారు.

## అదృష్టఅంకె-3

ఈ అంకెవారు కూడా 1వ అంకెవారి వలె కోర్కెలు కలిగివుంటారు. పట్టినపట్టు సాధించేవరకు విడవరు. ప్రతి వస్తువుకి తగినస్థలం ఉండాలని, అక్కడ తప్ప అది వేరేచోట ఉండరాదని భావిస్తారు. వాటిని రోజూ చూసుకుంటారు. ఎంతవీలయితే అంత ఎక్కువకాలం ఇంట్లో గడపగోరతారు. సైనికదళాల క్రమశిక్షణను ఇష్టపడతారు. నిర్ణయాలను ఖచ్చితంగా అమలుచేసే అధికారులను మెచ్చుతారు. తమ అధికారులు అలా ఉండరని భావించి వారితో గొడవలు పడుతూ శత్రువులను పెంచుకుంటారు. 8వ అంకె వారికి దగ్గరవ్వాలని, 2, 6 అంకెలవారితో స్నేహంగా ఉండాలని కోరుకుంటారు.

## అదృష్టఅంకె-4

ఈ అంకెవారు పదిమందిలో ఉండికూడా ఒంటరితనం ప్రదర్శిస్తారు. నియమాలు, అధికారుల పనుల్లో ఏ తేడాలు కన్పించినా తీవ్రస్థాయిలో హఠాత్తుగా విరుచుకు పడతారు. చాలా రంగాలలో వీరు నాయకులుగా, కొత్తవాటిని కనిపెట్టేవారుగా గుర్తింపు పొందుతారు. తమ సంగతిని పక్కనపెట్టి, ముందు దీనస్థితిలో ఉన్నవారికి సాయపడి పేరు తెచ్చుకుంటారు. ఆర్థికస్థాయి వీరికి ముఖ్యం. కావాలనుకుంటే సంపాదించే సమర్థత వీరికి ఉంటుంది. వీరు సహజంగా అంతర్ముఖులు. కానీ మూడ్స్ హఠాత్తుగా మారుతుంటాయి. అప్పటికప్పుడు నిస్పృగా ఉండి, సంతోషంలోకి మారుతుంటారు. 6వ అంకె వారిలో కన్పించే ప్రేమ, దయ, అవగాహనలను వీరు కోరుకుంటారు. 5వ అంకె వారినుండి ఎక్కువ నేర్చుకోవాలనుకుంటారు.

## అదృష్టఅంకె-5

ఈ అంకెగలవారు ఎటులాగితే అటుపోతారు. అవసరాల్ని, పరిస్థితిని గుర్తించి చమత్కారంగా వ్యవహరించే గుణం వీరిది. ప్రయాణాలంటే ఇష్టం. హఠాత్తుగా వచ్చే మార్పులను ఆహ్వానిస్తారు. సూక్ష్మగ్రాహులు, అయినా తెలివితక్కువ వారిని వేధించరు. రాతల్లో అతిశయం వుంటుంది. ధనసంపాదన వీరికి కష్టంకాదు. ఖర్చుపెట్టేటప్పుడు ధనం విలువను వీరు గుర్తించరు. తమను మెచ్చే ఏ అంకెవారితోనైనా స్నేహంగా ఉంటారు.

## అదృష్టఅంకె-6

వీరు సాధారణంగా స్నేహశీలురు. ఎంత తక్కువస్థాయి వారితోనైనా సంబంధాలు నిలుపుకుంటారు. చమత్కార వంతులు. అదుపుతప్పినప్పుడు భయంకరంగా ప్రవర్తిస్తారు. కళలు, సంగీతం, ప్రకృతి వీరికి ఇష్టం. దేన్ని వదలటానికైనా అయిష్టత చూపుతారు. సుఖం, భద్రతలకు ప్రాధాన్యతనిస్తారు. ఎన్ని ఇబ్బందులనైనా వాటికోసం ఎదుర్కొంటారు. ఇతర అంకెల వారితో కలిసిపోయే స్వభావం ఉంటుంది. 7, 9 అంకెల వారితో దగ్గరగా ఉంటారు. తల్లిదండ్రుల పట్ల విపరీతమైన ప్రేమ ఉంటుంది.

## అదృష్టఅంకె-7

5వ అంకె వారివలె వీరు ప్రయాణాలను ఇష్టపడతారు. ఎక్కువగా మాట్లాడతారు. తమ లోకజ్ఞానం, కళలు ద్వారా జీవితం పట్ల తమకున్న తాత్వికతను వెల్లడిస్తారు. బహుముఖ ప్రతిభకల్గి, అనేకమార్గాల్లో ఆదాయం పొందేందుకు నిమగ్నులవుతుంటారు. సొంత ఆలోచనలు చేస్తుంటారు. కానీ వాటిని సాధించే స్థిరచిత్తం ఉండదు. ప్రయాణాలమీద ఇష్టంతో, వ్యాపారాలకోసం ఇతర దేశాలకైనా వెళ్ళగోరతారు. ఇతర అంకెలవారితో అధికంగా కలిసిపోతుంటారు.

## అదృష్టఅంకె-8

తమ ఆలోచనలు తమవి అన్నట్లు ఉంటారు. వీరి ప్రయత్నాలన్నీ 4వ అంకె వారిని పోలివుంటాయి. దీనుల బాధ్యతలను నెరవేర్చబూనుతారు. లోతుగా ఆలోచిస్తారు. వృత్తుల్లో, పదవుల్లో ఉన్నతస్థాయులకు ఎదుగుతారు. రాజకీయ వేత్తలనుండి మతాధిపతుల దాకా, శ్రామికుల నుండి వాణిజ్యవేత్తల దాకా వీరు ఎవరిలోనైనా పైకి ఎదుగుతారు. వీరి ఉద్దేశాలు బయటకు తెలియవు. పైకి చల్లగావున్నా, లోపల బాధల్ని భరించగల సమర్థులు. ఇతరులకు తప్పుగా అర్థమవుతుంటారు. దీంతో అందరికీ దూరమవుతుంటారు. ప్రతిభను అభిమానించే వారితో సానుకూలంగా ఉంటారు.

## అదృష్టఅంకె-9

మూర్ఖులుగా, అహంకారులుగా వీరు భావింపబడతారు. మిత్రులకంటే శత్రువుల్ని పెంచుకుంటారు. 'దీన్ని ఇంతకుముందు చాలామంది చేసార్లే' అంటూ ప్రతి పనినీ దాటవేస్తుంటారు. స్వేచ్ఛను కోరుకుంటారు. తమను తాము నియంత్రించుకోవడానికి ఎక్కువ సమయాన్ని గడుపుతారు. అధికారం అందివస్తే అవినీతికి పాల్పడతారు. ఇతరుల అభిమానం కోసం ఎదురుచూస్తారు. గొప్పవారితో స్నేహంకోసం తమ అహంకారాన్ని కూడా పక్కనపెడతారు. వీరిలో సమర్థత, మర్యాద, పరాధీనత ఉంటాయి. ముఖ్యంగా 3, 6 అంకెల వారతో సానుకూలంగా ఉంటారు.

పై వివరాల్లో ఎంతటి అస్పష్టమైన కల్పనలు వున్నాయో తేలిగ్గా అర్థమవుతాయి. మాటలగారడీ తప్ప వాస్తవానికి చోటేది?

ప్రపంచంలో ప్రస్తుతం 800 కోట్లపైగా జనాభా వుంది. వారందరినీ అదృష్టఅంకెలతో విభజిస్తే ఒక్కో అంకెకు 90 కోట్లమంది వస్తారు. ఆ 90కోట్లమంది ప్రవర్తనలూ పైన చెప్పినట్లే మూసపోసిన విధంగా ఉంటాయా? ఎవరైనా దీన్ని ఎలా సమర్థించగలరు? సంఖ్యా 'శాస్త్రీయత'ను ఎలా నిరూపించ గలరు?

సంఖ్యా'శాస్త్రం' సైన్సు అయితే ఇన్ని గందరగోళాలుండవ్. అందుకే దానిపై అనేకమంది మేధావులు పాశ్చాత్యదేశాల్లో చాలెంజ్ చేసారు. ఎవరూ అది 'శాస్త్రీయమ'ని చెప్పలేకపోయారు. అందుకే దాన్ని 'కళ' అంటున్నారు. 'వ్యక్తిత్వాలను ప్రవర్తనలను అంకెలతో ముడిపెట్టి వినోదించే క్రీడ' అని కూడ అంటున్నారు. అయితే ఆ 'వినోదం' శృతిమించితే వ్యసనంగా మారి విషాదానికి దారితీస్తుంది. ఇలాంటి క్రీడలను ఆదరించక పోవడమే మేలు.

నేడు మనం వాడుతున్న ఇంగ్లీషు అంకెల (1, 2, 3.. మొ॥) అసలు పేరు 'ఇండో అరబిక్ అంకెలు'. ఇవి ఇండియా నుండి 13వ శతాబ్దంలో అరబ్బులకు చేరాయి. అక్కడి నుండి యూరప్‌దేశాలకు, ఇంగ్లాండుకు పరిచయమయ్యాయి. అంతకుముందు వరకు ఆ దేశాలవారు గ్రీకు, లాటిన్, రోమన్ భాషల్లోని అక్షరాలనే అంకెలుగా వాడారు.

పైథాగరస్‌కు లాటిన్ తెలియదు. ప్రాచీనగ్రీకులోనే రాసాడు. అయినా న్యూమరాలజిస్టులు (సంఖ్యాశాస్త్రవేత్తలు) ఆయన పేరుతో 9 అంకెలు, వాటికింద ఇంగ్లీషు అక్షరాలను చూపే 'పైథాగరస్ పట్టిక'ను ప్రచారం చేసారు.

రాశుల నుంచి, నక్షత్రాల నుంచి, లేదా గ్రహాలనుంచి విడుదలయ్యే కాస్మిక్ కిరణాలు మనిషిని తాకుతాయని, ఏ రాశిలో పుట్టినవారిని ఆ రాశి కిరణాలు వచ్చి తాకి ప్రభావితం చేస్తాయని జ్యోతిష్యులు ఒక తప్పుడు వాదనతో సమర్థించుకోజూస్తారు. దానికి పరిశోధనలు, రుజువులు లేవు. అలాగే సంఖ్యాశాస్త్రం చెప్పేవాళ్ళు కూడా తమ వాదనల్ని సైన్సుతో సమర్థించుకోవడానికి ప్రయత్నిస్తారు. విశ్వమంతా ప్రకంపనాలతో నిండివుంటుందని, ప్రతి వస్తువునుండి అవి విడుదలవుతుంటాయని, వాటిని అంకెలు, వ్యక్తులకు చేరవేస్తాయని అంటారు. అలా జరిగేటపుడు, వారి అదృష్ట సంఖ్యలు, మిగిలిన వాటిని దూరంచేసి, తమ ప్రభావాన్ని వ్యక్తులపై చూపిస్తాయని కూడా వాదిస్తారు. 'అది ఎలా? నిరూపించండి?' అంటే మాత్రం మౌనం వహిస్తారు. కనుక దాన్ని శాస్త్రం (సైన్సు)గా చెప్పడం 100% తప్పు. వారు చెప్పే ఈ ప్రకంపనల వివరణ ఊరికే 'ఎందుకు చెప్తున్నారు?' అంటే 'పొట్టకూటికోసం' అంటారు.

కొందరు దాన్ని 'కేలండర్'తో ముడిపెడతారు. కేలండర్‌లోని తేదీలు కాలాన్ని తెలుపుతాయని, విశ్వంలో విడుదలయ్యే ప్రకంపనాలను కాలం గ్రహిస్తుందని వాటిని తేదీల ద్వారా వెల్లడిస్తుందని 'తెలివి'గా వాదిస్తారు. కాలం మొదలైనప్పటి నుంచీ ఇలా జరుగుతోందని బుకాయిస్తారు.

కేలండర్ అనేది కాలాన్ని లెక్కించడానికి/గుర్తించడానికి మనిషి తయారు చేసుకున్న ఒక ప్రక్రియ. వాటిలో చాలా రకాలున్నాయి. నక్షత్రాలను తెలిపేవి, వాతావరణాన్ని సూచించేవి, సూర్యచంద్రగమనాలను తెలిపేవి అందులో కొన్ని. సూర్యుని ప్రమాణంగా సంవత్సరాన్ని లెక్కగడితే 365 రోజుల, 5 గం॥, 48 ని॥ 46 సె॥ అవుతుంది. మన సౌకర్యంకోసం నాలుగేళ్ళకోసారి 366వ రోజు లెక్కిస్తున్నాం. ప్రతి 100 ఏళ్ళకొకసారి అదనంగా లీపుసంవత్సరం ప్రకటిస్తున్నాం. అప్పటికీ, ప్రతి 400 ఏళ్ళకీ, 400 సూర్య సంవత్సరాలతో పోలిస్తే, 2.88 గం॥ తక్కువ వస్తుంది.

ఇక నెలల విషయానికి వస్తే, అవి చంద్రగమనాన్ని బట్టి లెక్కిస్తున్నాం. ఆ గమనాన్ని సగటున లెక్కిస్తే నెలకు 29.53 రోజులొస్తాయి. సంవత్సరానికి లెక్కిస్తే 12.36 నెలలు వస్తాయి. ఈ తేడాలన్నింటిని కలిపితే 5% దోషాలు కన్పిస్తాయి.

కేలండర్ చరిత్రకూడా అస్తవ్యస్తమైనదే. ప్రస్తుతం మనం వాడేది గ్రిగేరియన్ కేలండర్. ఇది ప్రాచీన రోమన్ కేలండర్‌ను సంస్కరిస్తే ఏర్పడింది. రోమన్ కేలండర్‌లో నెలకు 29 లేదా 30 రోజులుండి సంవత్సరానికి 354 రోజులుండేవి. 3ఏళ్లకోసారి అధికమాసం ఉండేది. క్రీ.పూ. 46లో జూలియస్ సీజర్ చక్రవర్తి దాన్ని మార్చాడు.

అదే క్రీ.శ. 730 వరకు వాడబడింది. బేడే, కాలాన్ని మరింత సూక్ష్మంగా లెక్కించి 1582లో ఆనాటి క్రైస్తవ మతపోప్ అయిన గ్రెగరీ-13 ముందుంచాడు. ఆయన అంగీకరించిన రోజు అక్టోబర్ 4. ఆ తేదీని అక్టోబర్ 15గా గుర్తించమని ఆదేశించాడు. అంటే మధ్యలో 11రోజుల కాలం గుర్తింపుకు నోచుకోలేదన్నమాట. అప్పటినుంచే 4 ఏళ్లకు ఒక 'లీపు సంవత్సరం' లెక్కింపు అమల్లోకి వచ్చింది.

కేలండర్ల ఆధారంగా కాలంలో 'తొలిరోజు' ఏదో గుర్తించడం అసాధ్యం. తేదీలకు విశ్వప్రకంపనాలకు ముడిపెట్టడం, బట్టతలకీ మోకాలికీ ముడిపెట్టడం కన్నా కష్టం. నిరూపణ అసాధ్యం.

## సంఖ్యాశాస్త్రంలో 'భారతీయత'

జ్యోతిష్యంలాగే సంఖ్యాశాస్త్ర ఫలితాలపైన కూడా భారతీయులకు నమ్మకం ఎక్కువ. ఫలానా అంకె శుభం, ఫలానాది అశుభం అని పూర్వముండేది కాదు. ప్రతీ అంకెకీ విలువనిచ్చారు. ప్రపంచంలో 'సత్య'మొక్కటేనన్నారు. 'ఏకో'నారాయణ అనుకున్నారు. పాపపుణ్యాలు, మంచిచెడ్డలు, ఇహపరాలు, రాత్రింబవళ్ళు మొదలగువాటిని 'రెండు'తోనే కొలిచారు. త్రిమూర్తుల్ని, త్రికోణాల్ని, త్రిగుణాల్ని, త్రికాలాన్ని చెప్పుకున్నారు. చతుర్విధ పురుషార్థాలకు, చతురంగ బలాలకు, చతురుపాయాలకు ప్రాధాన్యతనిచ్చారు. ఇలా ప్రతి అంకెతో తమ ఊహల్ని, పరిశీలనలను కొలిచే ప్రయత్నం చేశారు. సంఖ్యాశాస్త్రం చెప్పే 9 అంకెలకే పరిమితం కాలేదు. 10, 11, 12... అలా రెండంకెలు, మూడంకెలతో చెప్పాల్సినవి కూడా చెప్పారు. అవన్నీ శుభమైనవే వారిదృష్టిలో.

రానురానూ అంకెలకూ శుభాశుభాలను నిర్ణయించే వారొచ్చారు. జ్యోతిష్యంలో రోజుల్ని మంచిచెడులుగా విడదీసినట్లే, అంకెల్నీ చేసారు. '7' అనేది 'ఏడుపు'గా తోచింది. అశుభం అనుకుని ఆరున్నొకటి అని పలికారు. రాసేటపుడు '7'కు అడ్డుగీత రాసే మూర్ఖత్వం ఇటీవల పుట్టిందే. 3,6,9 అంకెలు అత్యంత శుభప్రదమని, వాటిలోనూ 3 మరీ శుభ ప్రదమని చాటటానికి పుస్తకాలు రాసిపడేశారు. క్రింది పట్టిక చూడండి.

| అశుభాలు లేదా దయ్యాలు | మధ్యస్థాలు లేదా మానవులు | శుభాలు లేదా దైవాలు |
|---|---|---|
| 1 | 2 | 3 |
| 4 | 5 | 6 |
| 7 | 8 | 9 |

మధ్యస్థాలుగా ఉన్న అంకెలకు 'అశుభాలు' శత్రువులు, 'దైవాలు' మిత్రులు. అందుకే 'లక్కీనెంబర్లు' 3, 6, 9 దైవ అంకెలు. వాటిలో దివ్యత్వం ఉంటుందని గట్టిగా నమ్ముతారు. తమ ఇంటినెం., కారు నెంబరు, ఫోనునెంబరు.. ఇలా అన్నీ వాటికిచెందినవే కావాలనుకుంటారు. వాటికోసం ఎంతఖర్చైనా వెనకాడరు. 'ఆదిత్య 369' లాంటిపేర్లు సినిమాలకు అందుకే పెడతారు. ఇంకాస్త ముందుకెళ్ళి, మన ప్రధానులు, ముఖ్యమంత్రులు పుట్టిన తేదీల్లో 3, 6, 9 లున్నాయి కనుక వారంతవారయ్యారు అంటారు. ఈ కెలండర్ వారికి అనుకూలంగా లేకపోతే పాతకేలండర్‌ను ఆశ్రయిస్తారు. పాత ఇంగ్లీష్ కేలండర్‌లో కొత్త సంవత్సరం మార్చినుంచి మొదలవుతుందన్నారు (కాదు ఏప్రిల్ నుంచి అనేవారు కూడా ఉన్నారు). అ లెక్కన చూస్తే ఎన్.టి.రామారావు 3వ నెల (మే)లో పుట్టినట్లు, రాజీవ్‌గాంధీ 6వనెల (ఆగష్టు)లోనూ, ఇందిరాగాంధీ 9వనెలలో (నవంబర్) పుట్టినట్లవుతుంది. ఆ 'లక్కీనంబర్' నెలల్లో పుట్టారు గనుక అంతవారయ్యారని గొప్పగా చెబుతారు. 'మరి ఆ ముగ్గురు చివరకు ఎందుకంత దయనీయంగా మరణించారు?' అని అడిగితే నోరు మెదపరు. మిగిలిన అందరు ప్రధానులు, ముఖ్యమంత్రులు, రాష్ట్రపతులు అలా పుట్టకపోయినా అంతస్థాయికి ఎలా చేరారు? అని ప్రశ్నిస్తే కొరకొరా చూస్తారు. అంతకుమించి ఏమీ చేయలేరు గదా!

నవరత్నాలవలె, లక్కీనెంబర్లతో ఉంగరాలు, లాకెట్లు కూడా మార్కెట్‌లోకి వచ్చాయి. వాటిని ధరిస్తే రోగాలు రావని, ఏ పీడలు ఉండవని, ఆత్మవిశ్వాసం పెరుగుతుందని 'కథలు' చెప్తారు. ఆ వ్యాపారం ఇప్పుడు అంతగా లేనట్లుంది. అది వారి లక్కీనెంబర్ ఫలితమేమో!

అదృష్టం-దురదృష్టం అనేపదాలు భావపరాధీనతకు చిహ్నాలు. 'దృష్టం' అనే సంస్కృతపదానికి 'చూడబడినది' అని అర్థం. 'అ-దృష్టం' అంటే 'చూడబడనిది' అని అర్థం. అదే క్రమంగా 'అనుకోకుండా కలిగే ఫలితం' అనే అర్థంలో ఇప్పుడుంది. ఏ కారణం లేకుండా కార్యం జరగదు. ఫలితం రాదు. కార్యకారణసంబంధమైన జ్ఞానానికి అదృష్టం వ్యతిరేకం. అదృష్టాన్ని నమ్మటమంటే మన వివేకాన్ని మనం అణచివేసుకోవటమే.

అంకెలు అదృష్టానికి కారణాలనుకోవటం మనం ఇంకా అజ్ఞానంలోనే ఉన్నామనడానికి గుర్తు. జీవితంలోని మంచీచెడులను వాటితో ముడిపెట్టుకోవడం తెలివితక్కువ తనం. వాటిపై మోజుతో సంఖ్యాజ్యోతిష్యుని ఆశ్రయించి వారి దోపిడీని ప్రోత్సహించడం మనం చేస్తున్న నేరం. మన జీవన వికాసానికి ఈ మూఢనమ్మకం ఒక అవరోధం.

## '365' - '666'

అంకెలకు అదృష్ట దురదృష్టాలను అంటగట్టి, వాటికి శుభాశుభశక్తులను ఆపాదించి చెప్పటం ప్రాచీన ప్రపంచంలో ఉంది. దాన్నే 'జెమిట్రియా' అనేవారు. గ్రీకుదేశంలో 'జ్ఞానులు'గా పిలవబడిన సన్యాసులు 'దేవుడి నుండి 365 మంది దైవదూతలు దిగివచ్చారని, వారే, సంవత్సరంలో వుండే ఒక్కొక్కరోజును, ఒక్కొక్కరు కాపాడుతుంటారని చెప్పారు. వారందరిని 'Abraxas' అని పిలిచారు. ఎందుకంటే ఈ పదానికి వాడే గ్రీకు అక్షరాల విలువ అంకెల్లో 365.

ప్రాచీన హిబ్రూ గ్రంథాలైన మిష్నా, కబ్బాలాలోను, క్రైస్తవుల కొత్తనిబంధన గ్రంథంలోనూ సంఖ్యలను శుభాశుభాలకు వాడడం చూడవచ్చు. ఉదాహరణకి, 'క్రీస్తు విరోధి'ని తెలపటానికి ప్రకటనగ్రంథంలో ఒక వాక్యంవుంది. "బుద్ధిగలవాడు మృగము యొక్క సంఖ్యను లెక్కింపనిమ్ము. అది ఒక మనుషుని సంఖ్యయే. ఆ సంఖ్య అరువది వందల అరువది యారు" (ప్రకటన గ్రంథం 13-18)

రోమన్ చక్రవర్తి నీరో, యూదుల భాషలో అతని పేరులోని అక్షరాలను అంకెల్లోకి మారిస్తే (Kaesar Neron) దాని విలువ 666. కాబట్టి ఆ రోజుల్లో చాలామంది క్రైస్తవాధికారులు అతనిని క్రీస్తువిరోధిగా భావించారు.

సంఖ్యల ఆధారంగా రోజుల్ని కూడా మంచి, చెడుగా విడదీసి చూడటం భారతదేశంలోనే కాదు, ప్రాచీన బాబిలోనియా, అస్సీరియా ప్రాంతాల్లో ఉండేది. నెలలోని 7, 14, 19, 21, 28 రోజులు ఆనాడు అశుభాలు. అశుభదినాల్లో జన్మించిన శిశువుల్ని నిర్దాక్షిణ్యంగా చంపటం 'మడగాస్కర్'లాంటి దేశాల్లో వుండేది. అలా చంపకపోతే కీడుగా భావించేవారు.

ఇలాంటి మూఢాలోచనలు ఆయాదేశాల్లో ఇపుడులేవు. ఈ నమ్మకం విషయంలో మనదేశం మాత్రం ఇంకా మధ్యయుగాల కాలంలోనే ఉండడం విచారకరం.



# దండకాలు, చాలీసాలు.. కాదు, స్వయంకృషి కావాలి



'జై చిరంజీవా! జగదేక వీరా!
అసహాయశూరా! అంజనికుమారా!'

అంటూ పిల్లలంతా దీనంగా, ఆర్ద్రంగా గొంతెత్తి పాడుతూ ఉంటారు. పాట పతాకస్థాయి చేరేటప్పటికి చావుబతుకుల మధ్య కొట్టుకునే హీరోగారు నెమ్మదిగా కళ్ళు తెరచి స్పృహలోకి వస్తాడు. తనను బాధించిన విలన్లను, రౌడీలను, నూతనంగా ఆవేశించిన బలంతో చితగ్గొట్టేస్తాడు. దాంతో, ఆంజనేయుని వేడుకుంటున్న ఆ పిల్లల్లోనే కాదు, ఈ దృశ్యాన్ని తెరపైన చూస్తున్న ప్రేక్షకులలో కూడా ఆ దేవుని ఆర్తత్రాణ పరాయణత, కరుణాదృష్టి పట్ల ఆరాధన పెరుగుతుంది. అందరి మనసుల్లో ఆ దైవంపట్ల భక్తి మరింత ఎక్కువవుతుంది.

ఇలాంటి దృశ్యాలు ఏదో ఒక సినిమాలో కాదు, తెలుగు తెరపై ప్రదర్శితమైన కొన్ని వందల సినిమాల్లో మన కంటబడి ఉంటాయి. ఒకదేవుని గురించి కాదు, అనేక దేవుళ్ళ మహిమలను ప్రేక్షక మస్తిష్కాలకెక్కించటానికి ఇలాంటి ఎన్నో ఘట్టాలు పుట్టుకొస్తుంటాయి. వీటి లక్ష్యం ఒకటే.. 'ఆపదల్లో భగవంతుణ్ణి ప్రార్థిస్తే, అవన్నీ తొలగిపోతాయి. దైవభక్తిని మించింది లేదు' అనే సందేశాన్ని అందించటం–

అమెరికా మాజీ అధ్యక్షుడు బరాక్ ఒబామా జనవరి 16, 2016వ తేదీ 'యూట్యూబ్' సృష్టికర్త నీల్సన్‌కు ఇంటర్వ్యూ యిస్తూ హఠాత్తుగా తన జేబుల్లోంచి కొన్ని మతచిహ్నాలను తీసి "ఇవన్నీ నా ప్రయాణంలో నేను కలిసిన వివిధ ప్రజలవి" అన్నారు. వాటిల్లో హిందువుల ఆరాధ్యదైవం "హనుమంతుని బొమ్మ" కూడా ఉంది. "వీటిని నేను అన్నివేళలా నా దగ్గరే ఉంచుకొంటాను. అంతమాత్రాన, నేను మూఢవిశ్వాసిని కాను"అన్నారు. "వివిధ సమస్యల విషయంలో నాలో అలసట, నిరుత్సాహం ఏర్పడినపుడు, జేబులోకి చేతులుంచి, నేనెలాగైనా ఈ అలసట, నిరుత్సాహాన్ని విడవాలి, ఈ సమస్యలపై పనిచేసే అవకాశం నాకెవరో యిచ్చారు అని తిరిగి ఉత్సాహాన్ని పొందుతాను" అన్నారాయన. ఈ వార్తతో హిందూ భక్తులంతా ఎంతో సంతోషించారు. తమదైవం ఆంజనేయుని ఘనతను స్మరించుకున్నారు. భక్తితో హనుమాన్ చాలీసానో, దండకాన్నో వల్లించుకున్న వాళ్ళూ ఉండివుంటారు. హైందవులకు రాముడెంత ప్రీతిపాత్రుడో, ఆంజనేయుడూ అంతే. దాక్షిణాత్యులకైతే, రామునిపై కంటే ఆంజనేయునిపైనే భక్తి మరింత ఎక్కువ. దానికీ కారణం ఉంది.

రామాయణం చదివాక, ఆంజనేయుడి వృత్తాంతం అర్థం చేసుకున్నాక, ప్రతి ఒక్కరూ గుర్తించే విషయాలు- 1.అతడు మహాబలశాలి, 2. రాక్షసుల్ని/దుష్టశక్తుల్ని చిత్తుచిత్తుగా కొట్టి చంపగలడు, 3. రామునికి నమ్మినబంటు, 4. పొగిడితే ఉబ్బిపోయి ఏదైనా చేయగలడు, 5. రామభక్తి అంటే మైమరచిపోతాడు.

ఆంజనేయునిలో ఇలాంటి గుణాలు ఇంకా ఉన్నాయని అనుకున్నా అభ్యంతరం లేదు. కాని, పైన చెప్పిన గుణాలు భక్తుల్ని ఆకట్టుకొని, ఆయనపట్ల ఆరాధనను పెంచుతాయి. ఆయన బ్రహ్మచారి అన్న విషయం మూలరామాయణంలో లేదు. ఆ తర్వాతే వచ్చింది. ఆయనకు పెళ్ళయిందని, భార్యపేరు సువర్చల అని, పూర్వగాథాలహరి పేర్కొంటున్నది. అలాగే ఈ శ్లోకం చూడండి-

**"సువర్చలా కళత్రాయ, చతుర్భుజ ధరాయచవీ**
**ఉష్ట్రారూఢాయ వీరాయ మంగళం శ్రీహనూమతే"**

*(శ్రీ ఆంజనేయ మంగళాష్టకం, శ్లోకం:3)*

ఇందులో హనుమంతుని భార్య సువర్చల అని, ఆయన నాలుగు భుజాలు గలవాడని, ఒంటెనెక్కినవాడని వుంది. హనుమంతునికి ఒక కొడుకున్నాడని, అతనిపేరు మత్స్యవల్లభుడని కొన్ని కథలు చెప్తున్నాయి.

హనుమంతుని కీర్తించే సాహిత్యం కూడా చాలా వుంది. అయితే, ఆయననెందుకు కీర్తిస్తున్నావని ప్రశ్నిస్తే వచ్చే జవాబులు కొన్ని ఇలా ఉంటాయి:

1. ఆయన మహాబలశాలి–అంతటి బలం, ఆరోగ్యం, మాకూ వస్తాయని నమ్మకం.
2. ఆయన దుష్టశక్తుల్ని దునుమాడగలడు– అందుకు రామకథే సాక్ష్యం, మాకు ఏ పీడలూ అంటకుండా ఉండాలంటే ఆయన్నే కొలవాలి.
3. ఆయన కోరినవన్నీ ఇస్తాడు– కొందరికి ఇచ్చాడు కూడా. పరీక్షలో ఉత్తీర్ణత, ఉద్యోగం, వ్యాపారం, ఏ పని అయినా సఫలం కావటం ఆయనను తలచుకుంటే సాధ్యమవుతాయి.
4. ఆపదల్లో అండగా ఉంటాడు– బలహీనులకు, బాధల్లో ఉన్న వారికి పిలిస్తే పలికే దేవుడాయన. బోళాస్వభావి, ఇతర దేవుళ్ళకున్నట్లు ఏ దర్పమూ ఉండదు.

రామాయణ కథ వ్యాప్తిలోకి వచ్చాక చాలాకాలం వరకూ ఇలాంటి ఘనత ఆంజనేయునికి రాలేదు. వైష్ణవ మతవ్యాప్తి మొదలయిన 8వ శతాబ్ది తర్వాతనే, వైష్ణవులు రామభక్తిలో భాగంగా హనుమద్భక్తినీ ప్రచారంలోకి తెచ్చారు. దాన్ని గమనించిన శైవులు కూడా, తాము వెనకబడకూడదని, హనుమంతుణ్ణి శివుని అవతారంగా కల్పించి కథలల్లారు. స్కాందపురాణం, మహాభాగవతం, బృహద్ధర్మపురాణం, మహానాటకం గ్రంథాల్లో ఇందుకు ఆధారాలున్నాయి. శైవ, వైష్ణవ మతాల మధ్య ఏర్పడివున్న 'అహమహమికత్వం' వల్ల హనుమంతునికి మహిమలు అంటించటంలో పోటీ పెరిగి, అర్చనలు, కీర్తనలు, గుళ్ళు, పూజలు ఇబ్బడిముబ్బడయ్యాయి.

## హనుమాన్ చాలీసా

ఉత్తర భారతమంతటా ఆంజనేయభక్తి విస్తరించటానికి దోహదపడిన చిన్న కీర్తన గ్రంథం 'హనుమాన్ చాలీసా'. 16వ శతాబ్ది నాటి భక్తికవి తులసీదాసు దీన్ని రాసాడంటారు. అందుకు ఒక కథను కూడా అల్లారు. ఆ కాలంలో మొగల్ చక్రవర్తి అక్బరు పాలిస్తున్నాడు. తులసీదాసుకు అద్భుతశక్తులున్నాయని విని, తనకొలువుకు పిలిపించాడు అక్బర్. వాటిని ప్రదర్శించకపోవటంతో, కోపించి జైల్లో పెట్టాడు. అందులో ఉంటూనే తులసీదాస్ 'హనుమాన్ చాలీసా' రాసాడట! చాలీసా అంటే 40 చౌపాయిలున్న కీర్తన.(చౌపాయి పద్యంలో 4 చిన్ని పాదాలుంటాయి. సంస్కృతంలో అనుష్టుప్ ఛందస్సులాంటిదే చౌపాయి.) 40వ చౌపాయి రాస్తూ ఉండగా, ఒక పెద్దకోతులగుంపు ఫతేపూర్‌సిక్రీ (అక్బర్ రాజధాని)ని ఆక్రమించింది. భటుల్ని హింసించసాగింది. ఎవరో చెపితే తెలిసికొని, అక్బర్ తులసీదాస్‌ను చెరనుండి విడిపించడంతో ఆ కోతుల బెడద ఆగిపోయింది.

ఈ కథ వ్యాప్తిలోకి వచ్చాక, హనుమాన్ చాలీసా ప్రచారం పెరిగింది. ప్రతిరోజూ తులసీదాస్ వారణాసిలో గంగాస్నానం చేసివచ్చి హనుమాన్ చాలీసా చదివేవాడని, ఒకరోజు అతనికి ప్రార్థనా మందిరంలో ఒక కుష్టువాని రూపంలో వచ్చిన హనుమంతుని దర్శనమయిందని మరోకథనం. ఆ ప్రార్థనామందిరాన్నే ఇపుడు "సంకట్ మోచన్ హనుమాన్ మందిరం" అంటున్నారట!

ఒక దేవునికో, భక్తికో, ఒక ఆధ్యాత్మిక స్థలానికో, ప్రజల్లో వ్యాప్తి రావడానికి ఇలాంటి కథాసాహిత్యం పుట్టుకొస్తుంది. జనంలో సహజంగా వున్న ఆరాధనా తత్వం, వాటిని గుడ్డిగా నమ్ముతుంది. హనుమాన్ చాలీసాలో జనాన్ని నమ్మించే చౌపాయిలు చాలావున్నాయి.

**"బుద్ధిహీన్ తను జానీకే, సుమరౌం పవనకుమార**
**బలబుధి బిద్యా దేహు మొహి హరహు కలేస బికార"**

(దోహ-2)

(నేను బుద్ధిహీనుణ్ణి. కనుక పవన పుత్రుడైన హనుమంతుని స్మరిస్తున్నాను. బలము, తెలివి, చదువు నాకు కల్గి, నాలోవున్న కష్టాలు, వికారాలు తొలగును గాక)

**"మహాబీర్ బిక్రమ బజరంగీ - కుమతి నివార సుమతికే సంగీ"**

(చౌపాయి-3)

(మహావీరుడూ, విక్రముడూ, వజ్రదేహుడూ అయిన ఓ హనుమాన్! నీవు చెడు ఆలోచనలను తుంచేవాడివి. సదాలోచనలందించేవాడివి)

**"భూత పిశాచ నికట నహిం, ఆవై మహాబీర జబనామసునాలై"**

(చౌపాయి-24)

('మహావీర' అనేపేరు వినబడితే చాలు, ఏ భూతాలూ పిశాచాలు భక్తుల దరికిరావు)

**"నాసైరోగ హరై సబపీరా, జపతనిరంతర హనుమత్ బీరా"**

(చౌపాయీ-25)

(ధీరుడైన హనుమంతుని పేరు రోజూజపిస్తే రోగాలు, నొప్పులూ అన్నీ తొలగిపోతాయి)

**"సంకట తే హనుమాన ఛుడావై**
**మనక్రమ బచన ధ్యాన జోలావూ"** (చౌపాయి-26)

(ఆలోచనల్లో, ఆచారాల్లో, మాటల్లో హనుమంతుని జ్ఞప్తి చేసుకునేవారు ఆపదల నుంచి బైటపడతారు)

ఇలాంటి ఆశాపాశాలతో భక్తుల్ని, విశ్వాసుల్ని బంధించివేస్తుంది ఈ హనుమాన్ చాలీసా. "ఎవరైతే వందసార్లు దీన్ని పఠిస్తారో, వారు అన్ని బంధనాల నుంచి విముక్తిపొంది, భగవంతుని కృపకు పాత్రులవుతారు (చౌపాయి-38)" అని కూడా చెపుతుంది. భక్తి విశ్వాసాలు చెదరకుండా ఉండటానికి అన్ని ఎక్కువసార్లు చేయాలని చెబుతారు.

ఈ 'చాలీసా'ను ఉత్తరప్రదేశ్ మాండలికమైన 'అవధీ'లో తులసీదాస్ రాశాడు. అయినా హిందీ భాషీయులంతా దీన్ని పవిత్రంగా పఠిస్తారు. చాలామంది కంఠస్థం చేస్తారు. అవసరాల్లో పాడుతుంటారు. హనుమంతుని కరుణతో తమ సంకటాలన్నీ తీరతాయని భ్రమిస్తుంటారు.

## శ్రీ ఆంజనేయం..

దక్షిణాదిలో చాలీసాకంత ప్రాచుర్యం రాలేదు. ముఖ్యంగా తెలుగునాట "ఆంజనేయ దండకాని"కున్న ఆదరణ 'చాలీసా'కు లేదు. ఆంజనేయ దండకాన్ని ఎవరు రాసారో తెలియదు. కానీ, హైందవ విశ్వాసులు దాన్ని ప్రీతిపాత్రంగా చదువుకుంటుంటారు. చీకట్లో నడవాల్సి వచ్చినా, జడుపు, భయం కలిగినా, సన్నిపాత జ్వరం లాంటివి వచ్చి మంచంపట్టినా, ఈ దండకాన్ని చదవమంటుంటారు.

ఒక హైస్కూలు విద్యార్థి బాగా చదువు రావాలని కోరుకున్నాడు. స్కూల్ మాష్టారు ఒక సలహా యిచ్చాడట- రోజు రాత్రి పాఠ్యాంశాలు చదవబోయేముందు, ఆంజనేయ దండకం చదవమన్నాడట! ఆ అబ్బాయి మొదటిరోజు బిగ్గరగా, భక్తిగా చదవటం మొదలెట్టాడట! దాన్ని ముగిస్తూ కుడివైపు తిరిగితే, ఒక పెద్ద వానరాకృతి కళ్ళముందు నిలిచి, క్షణాల్లో మాయమైందట. కనుక 'దండకం చదివితే దర్శనం తథ్యం' అన్న వాడుక వచ్చిందట!

"శ్రీ ఆంజనేయం, ప్రసన్నాంజనేయం, ప్రభాదివ్య కాయం, ప్రకీర్తిప్రదాయం..." అంటూ సంస్కృతాడంబరంతో మొదలయ్యే ఆంజనేయ దండకం తెలుగులోనే ఉంటుంది. చాలా దైన్యంగా తన అశక్తత గురించి వర్ణించుకొని, రామాయణకథలో హనుమంతుని పాత్రను కీర్తిస్తూ ముందుకు సాగే భక్తుడు, దండకం చివర్లో **"భూతప్రేత పిశాచ శాకినీ ఢాకినీ గాలిదయ్యంబులన్, నీదు వాలంబునన్ జుట్టి నేలంబడగొట్టి, నీ ముష్టిఘాతంబులన్ బాహుదండంబులం, రోమఖండంబులన్ ద్రుంచి,..."** అంటూ వీరోచిత వర్ణనతో తనలో ధైర్యాన్ని నింపుకుంటున్నట్లు కన్పిస్తాడు.

చాలీసాలో ఈ ముగింపు ఉండదు. అందులో భక్తులకు ఆశలు కల్పించేవి ఉంటే, ఇందులో వీరోచితంగా దయ్యాలపై ముష్టిఘాతాలు కురిపించే హీరో హనుమాన్

కన్పిస్తాడు. చాలీసా భక్తిమైకంలో ముంచుతుంటే, దండకం పూనకంలోకి లాగుతుంది. రెండింటి లక్ష్యమూ భక్తుల్ని భావదాసులుగా మార్చటమే.

ఇవేగాక, హనుమత్ స్తవం, హనుమత్ ద్వాదశనామస్తోత్రం, శ్రీమదాంజనేయ స్తోత్రం, ఆపదుద్ధారక హనుమత్‌స్తోత్రం, ఆంజనేయ అష్టోత్తరశతనామస్తోత్రం, ఆంజనేయ జయఘోష, హనుమత్ కవచమ్, ఆంజనేయ మంగళాష్టకం, మంత్రాత్మక మారుతిస్తోత్రం.... ఇలా చెప్పుకొంటూ పోతే 'హనుమంతుని తోక' లాగా సాగే పెద్ద జాబితా తయారవుతుంది. కష్టపడి ఇవన్నీ భక్తితో చదివినా, వాటినిండా పదాడంబరత, వాచాలత, పునరుక్తులు తప్ప జీవితాన్ని చక్కదిద్దే ఒక్క సూక్తికూడా ఎక్కడా దొరకదు.

## అంజనేయుని చారిత్రకత

చారిత్రక రచయితలు, పరిశోధకులు హనుమంతుని పాత్ర గురించి కొన్ని కొత్త విషయాలు చెప్పారు. వానరారాధన దక్షిణాదిలో ఒకప్పుడు ఉండేది. ఆఫ్రికా ఖండంలోని నేటి జాంబియా, నికారాగ్వా, మొదలగు ప్రాంతాల నుంచి బతుకు తెరువును వెతుకుతూ దక్షిణ భారతదేశానికి చేరిన ద్రావిడులలో ఈ ఆరాధన ఉందని ఎఫ్.ఇ.పార్గిటర్ (1852-1927) వంటి చరిత్రకారుల అభిప్రాయం. సునీత్‌కుమార్ ఛటర్జీ వంటి పలు భారతీయ చరిత్రకారులూ దీన్ని సమర్థించారు. 20వ శతాబ్దంలో ఉన్న జెసూట్ ఫాదరీ కెమిల్లే బల్కే "రామకథా: ఉత్పత్తి ఔర్ వికాస్" అనే తన రచనలో రామాయణ రచనాకాలం నాటికి మూలవాసులయిన గిరిజన తెగల్లో హనుమంతుని ఆరాధన వుందన్నారు.

శివుడు ద్రావిడుల ఆరాధ్యదైవం. హనుమంతుడు శివునికి ద్వారపాలకుడు. అనుమతి లేకుండా శైవవనంలోకి చొరబడిన రామలక్ష్మణులతో శివుడు యుద్ధం చేస్తాడు. ఎవరూ గెలవలేదు. చివరికి సంధి చేసుకున్నారు. దాని ప్రకారం, హనుమంతుని, రామునికి బంటుగా ఒప్పగించాడు శివుడు. దాంతో హనుమంతుడు రామదాసు డయ్యాడన్న కథ బెంగాలీ రామాయణంలో ఉంది. కృత్తివాసుడు, కవిచంద్రుడు తమ రామాయణాల్లో దీన్ని చెప్పినట్టు ప్రముఖ కవి ఆరుద్ర "రాముడికి సీత ఏమవుతుంది?" (పేజి:55)లో చెప్పారు.

ఈ కథాంశాల్ని కల్పనగా కొట్టిపారేసినా, కథలో ధ్వనిస్తున్న చారిత్రకతను గుర్తించాలి. హనుమంతుడు ద్వారపాలకుడుగా నాడేకాదు, నేడూ ఉంటున్నాడు. తెలుగునాట చాలా ప్రాంతాల్లో ఊరికి ముందు నిలబెట్టిన హనుమాన్ విగ్రహాలు

కన్పిస్తుంటాయి. కట్టినగుళ్ళు కూడా ఉంటాయి. ఆ విగ్రహాలు ఇటీవల కాలంలో చాలా ఎత్తుగా కూడా నిర్మించబడుతున్నాయి. ఈ సాక్ష్యాలను తడుముకుంటూ క్రీ.పూ. చరిత్రలోకి వెళితే, అక్కడ ఆయన అసలురూపు బయటపడుతుంది.

హనుమంతుడు పొలిమేర దేవత. దుష్టశక్తుల్ని, చెడు'గాలి'ని, గ్రామాల్లోనికి రానివ్వకుండా నిలువరించే బలశాలి అయిన వానరం. ఇలాంటి పొలిమేర వేల్పులు ప్రాచీన నాగరికతలన్నింటిలోనూ ఏదో ఒక పేరుతో కన్పడతారు. దక్షిణాదిన 'ఆనమంతి' (గాలికోతి)గా ప్రసిద్ధిపొంది, క్రమంగా హనుమంతుడయ్యాడు. అందుకే తమిళ, తెలుగు, కన్నడ రాష్ట్రాల్లో వేలయేళ్ళ నుంచీ అనమయ్య, అనుమాండ్లు, అనుమంతు, అనమప్ప... పేర్లు వాడుకలో ఉన్నాయి. దక్షిణాదిని తమవశంలోకి, తెచ్చుకునే ప్రయత్నంలో ఉత్తరాది పాలకులు, రచయితలు కావించిన సంస్కృతీకరణ వల్ల 'హనుమంత' ఏర్పడి, 'హనువులు (దవడలు) కలవాడు' అన్న కృత్రిమ వ్యుత్పత్త్యర్థం పుట్టింది. ఆ రోజుల్లో గెలిచేవారు, ఓడినవారి సంస్కృతిని కూడా తమ సంస్కృతిలో కలుపుకొనటం సర్వసాధారణమే కనుక, హనుమంతుడు, వానరారాధన, రామకథలో భాగమయ్యాయి. రామునికి వానరులంతా దాసులు కావటం, వాళ్ళ గ్రామపొలిమేర దేవత 'ఆనమంతి', రాముని పాదదాసుడు కావటం ఆ విషయాన్ని ధ్రువపరుస్తాయి. దక్షిణాది ప్రజలు ఇప్పటికీ దయ్యాలు పట్టిన వారిని, 'గాలి' సోకిన వారిని హనుమంతుని గుడికి తీసుకెళ్ళి మంత్రాలు వేయించి, సింధూరబొట్టు పెట్టించి, హనుమాన్ తాయెత్తును కట్టించటం వంటి పనులు చేస్తుంటారు. ఇవన్నీ ప్రాచీన ఆచార అవశేషాలే.

ఇలాంటి ఆచారాలన్నింటి వెనుక అజ్ఞానమే ఉందని గుర్తించాలి. వేలయేళ్ళ కిందట జనంలో ఉన్న పరిజ్ఞానం అశాస్త్రీయతపై ఆధారపడిందే. వాటిని చారిత్రకాంశాలుగానే చూడాలి తప్ప, ఆరాధ్యాలుగా, ఆచరణీయాలుగా కాదు. శాకినీ, ఢాకినీ వంటి దయ్యాల ఊహలకు, భయాలకు ఎన్నడో కాలం చెల్లింది. విషూచి, మశూచి వంటి మహమ్మారి రోగాలు దేశాల పొలిమేరలు దాటిపోయాయి. దుష్టశక్తులు గాలిద్వారా గ్రామం లోకి ప్రవేశిస్తాయనే మాటకు ఇప్పుడు విలువలేదు. ఒక మంత్రం ఉచ్చరిస్తేనో, ఒక కీర్తన పాడితేనో, ఒక దండకం చదివితేనో, చాలీసా వల్లెవేస్తేనో మనం కోరుకున్నవి వాటంతట అవే సమకూరటం అసంభవమని తేలిగ్గా రుజువు చేయవచ్చు. అయినా, ఇష్టకామ్యసిద్ధికోసం ఇంకా వాటినే ఆశ్రయిస్తూ, వాటి వెంట పరుగులిడుతున్నామంటే దోషం వాటిది కాదు, వాటిని ప్రచారంచేస్తున్న స్వార్థపరులయిన పరాన్నభుక్కులది, దాన్ని వాస్తవంగా భ్రమిస్తున్న అమాయక విశ్వాసులది మాత్రమే.



# వైజ్ఞానిక స్పృహను కప్పివేస్తున్న 'హోమధూమం'




**మొత్తం మీద యజ్ఞాల అజ్ఞానం వైద్యానికీ అంటుకొంది.**

2017, జూలై 24వ తేదీ, హైదరాబాదులోని సుప్రసిద్ధ ప్రజావైద్యశాల "గాంధీ" హాస్పిటల్‌లో జరిగిన 'మహా మృత్యుంజయహోమం' వల్ల, తెల్ల కోటులు వేసుకు తిరిగే వైద్యుల మెదళ్లలో కూడా మూఢత్వపు మురికి పేరుకొని వుంటుందన్న వాస్తవం బట్టబయలయింది. ఈ ఒక్క సంఘటనతో, 150 ఏళ్ల నాటి 'గాంధీ' ఘనకీర్తి హోమధూమంతో మలినమయింది. మహిళా ప్రసూతి విభాగానికి అధిపతిగా వున్న ఒక డాక్టర్ పర్యవేక్షణలో కొద్దిమంది నర్సులు, ఉద్యోగులు, కొందరు రోగుల సమక్షంలో, నాలుగు గంటల పాటు, నలుగురు పురోహితుల వేదమంత్రోచ్చారణలతో వైద్యశాల మరో యాగశాలగా మారిపోయింది. ఆ హోమాగ్నికీలల్లో ఆ వైద్య విభాగపు వైజ్ఞానిక సామర్థ్యం, పరిజ్ఞానం కాలి బూడిదైపోయింది. గుండె మార్పిడి శస్త్ర చికిత్సను తొలిసారిగా నిర్వహించి, తెలుగు వారి కీర్తిని రెపరెపలాడించిన ఆస్పత్రిలో ప్రసూతి మరణాలను తగ్గించమని అలౌకికశక్తుల్ని ప్రాథేయపడటానికి మంత్ర విద్య దిక్కయింది.

అంతధైర్యం, ఆ తలంపు వైద్యుల కెలావచ్చాయి? వాళ్ల చదువు, వృత్తి నిపుణత, శాస్త్రీయదృష్టి ఎందుకు వక్రిస్తున్నాయి? అన్న ప్రశ్నలు దేశమంతటా మీడియాలో

చర్చకు వచ్చాయి. ఇటీవల తెలంగాణా ప్రభుత్వం ప్రకటించిన "కె.సి.ఆర్.కిట్స్" పథకం గాంధీ ఆస్పత్రిలో అమలవుతున్నందు వల్ల, ఆ పథకం ద్వారా తల్లులకు లభించే డబ్బు, నవజాతశిశువుకు వినియోగించే వస్తువులకు ఆశపడి పలువురు గర్భిణులు ఆస్పత్రికి వస్తూ వుండటంతో, పనివత్తిడి వల్ల కొన్ని శిశు మరణాలు సంభవించటంతో, ఆస్పత్రిలో 'దుష్ట శక్తుల'నుపారద్రోలేందుకు ఈ హోమం నిర్వహించవలసి వచ్చిందన్న ఆస్పత్రిలోని కొందరి వాదన ఒప్పుకోదగిందేనా?

అప్పటికి రెండునెలలు నుంచి మాత్రమే రోజుకి 25-30 ప్రసవాలు జరుగుతున్నాయి. దానిని పని 'వత్తిడి' అనుకొంటే, ప్రయివేటు ఆస్పత్రుల్లో అంతకన్నా ఎక్కువ జరుగుతున్నాయే! అయినా, హోమమంత్రాలతో ఆ పనివత్తిడి, యాగాలతో రోగాలు, తగ్గితే ప్రభుత్వం మంత్రవైద్యశాఖనుకూడా ఏర్పాటు చేసి వేదపండితుల్ని భూతవైద్యుల్నే వైద్యులుగా నియమిస్తే సరిపోతుందిగదా!' అని చెప్పే హేతువాదులకేం జవాబుంది?

రోదసిలోకి దూసుకుపోయే రాకెట్ నమూనాలను గుళ్ళల్లో పూజలు చేసి, మంత్రాలతో పవిత్రం చేసి, ప్రయోగించటాన్ని ఇప్పటికే వైజ్ఞానిక ప్రపంచం నిరసిస్తోంది. శాస్త్రవేత్తల ప్రతిభను మసకబర్చటమే అది. విద్యారంగం ఇప్పటికే మత భావజాలంతో, పూజా ప్రార్థనలతో నిండిపోయి లౌకికతకు రాచపుండయింది. ఇపుడు ఆ గాలి వైద్యరంగానికీ మళ్లింది. ఇకపై ఇతర రంగాలకు విస్తరించినా వింతేమీకాదు. ఈ దుస్థితికి ముఖ్య కారణం మన రాజకీయ రంగమే. ప్రజాస్వామ్యం, లౌకికత్వం అంటూ నినాదాలిస్తూ, అధికారాన్ని చేపట్టే 'పాలకులు ఆచరణలో వాటికి పూర్తి విరుద్ధంగా వ్యవహరిస్తూ మూఢత్వాన్ని, మతతత్వాన్ని ఎంత ఎక్కువ వీలయితే అంత ఎక్కువగా ప్రోత్సహిస్తున్నారు. వాస్తు, జ్యోతిష్యం, భూమిపూజలు, జాతకాలు, భూతవైద్యాలు, గ్రహ దోషపూజలు యజ్ఞయాగాలు ఇలా ఎన్నో అశాస్త్రీయ, ఆలోచనా రీతులకు ప్రజాధనాన్ని దుర్వినియోగం చేస్తూ ప్రజల్లో అంతో యింతో వున్న వైజ్ఞానిక స్పృహను కూడా అంతం చేస్తున్నారు. 2015 డిశంబర్‌లో తెలంగాణ ముఖ్యమంత్రి నిర్వహణలో 1100 మంది పురోహితులతో 5 రోజుల పాటు కరువు నివారణకోసం 7 కోట్లరూపాయలు యాగాగ్నిలో బూడిదకావటం మనకు తెలియదా? వరుణుడి కరుణతో వర్షాలు కురవటానికి యాగాలు చేయండంటూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆదేశించటం మన మెరుగనిదా? సమస్యలు తొలగాలంటే, పరిష్కారాల అన్వేషణ జరగటానికి బదులుగా, 'యాగాలు, హోమాలు చేయటమే మేలు' అనే నిర్ణయానికి వచ్చేవిధంగా, పాలకులు వ్యవహరించటం వల్లనే పలువురు ప్రజా ప్రతినిధులు సైతం ఆ దారిలో

నడుస్తుండటం వల్లనే, ఇవాళ, వైజ్ఞానిక స్పృహకు నిలయంగా వుండాల్సిన వైద్యం, పరిశోధన, లాంటి రంగాలకు సైతం ఈ మూఢత్వపు చీడ అంటుకొంటోంది.

**"యద్యదాచరతి శ్రేష్ఠః తత్ తదేవేతరో జనాః"**

పెద్దలు ఏది ఆచరిస్తే, ఇతరులూ వారినే అనుసరిస్తారు. తమ చదువుని విజ్ఞానాన్ని మత మౌఢ్యపు బలిపీఠంపై వుంచటానికి సైతం సిద్ధపడతారు.




యాగాలు, హోమాలు నిర్వహించడం ఇప్పుడొక ప్రజాకర్షక విధానంగా మారిపోయింది. రాజకీయరంగం నుంచి మొదలయిన ఈ వైరస్, ఎంతో పవిత్రమైనదనుకుంటున్న న్యాయ వ్యవస్థకూ, రక్షణ రంగానికీ పాకిపోయింది. ఒక మతానికే పరిమితమైన ఆచారం, మతాతీత రాజ్యాంగం సాక్షిగా ప్రజా సంక్షేమ సాధనకు కట్టుబడి వుండాల్సిన అన్ని వ్యవస్థలకూ అంటుకొని, లౌకికత్వాన్ని సెంటిమెంట్‌తో హత్యచేసే స్థాయికి చేరింది. వర్షాలు ఎక్కువైనా, తక్కువైనా, రోగాలు తగ్గాలన్నా, పోవాలన్నా, క్రికెట్‌లో ఇండియా గెలవాలన్నా, అమెరికా అధ్యక్షునిగా ట్రంప్ ఎంపిక కావాలన్నా కోర్టులో కేసు గెలవాలన్నా, ఎంఎల్ఏ / ఎంపీ సీటు దక్కాలన్నా, కాంట్రాక్ట్ దొరకాలన్నా, ఆఖరికి కొడుకుపుట్టాలన్నా... ప్రతి దానికీ యజ్ఞమే సాధనమవుతోంది. శత్రు సంహారం జరగటానికి యజ్ఞమే, ప్రపంచ శాంతికీ యజ్ఞమే... ఎంత విచిత్రం!

యజ్ఞం – యాగం – హోమం – సవనం – ఇష్టి...... పేరేదైనా, కొద్ది మార్పులతో జరిగే ఆ తంతులన్నీ ఒకటిగానే వుంటాయి. ఈనాడు వ్యవహారంలో వాటి మధ్య వున్న తేడాలను ఎవరూ పట్టించుకోవటం లేదు. కానీ, వాటి ప్రాచీనత ఆధారంగా చూస్తే ఆ తేడాలు తెలుస్తాయి. ఈ తంతులన్నీ ఒక ఒకప్పటి ఆర్యుల జీవన విధానంలో భాగంగానే వచ్చాయన్నది మాత్రం మనం గుర్తించాలి. వేదాల్లో ఆర్యుల జీవన చిత్రణ వుంది. ఋగ్వేద మంత్రాలతో యజ్ఞాలు చేయాల్సిన తీరు తెన్నుల్ని యుజుర్వేదాదులు వివరిస్తాయి. వేద సాహిత్యంలో సుమారు 400 క్రతువుల ప్రస్తావన వుంది. చిన్నా చితకా, తాలూ తప్పా లాంటివే వాటిల్లో ఎక్కువ. వాటిని తొలగించి, ముఖ్యంగా

చేయవల్సినవి 21 అని నిర్ధారించారు. వాటిని 'నిత్యకర్మలు' అన్నారు. మిగిలిన వాటిని 'ఐచ్ఛికాలు' గా ప్రక్కన బెట్టారు.

ఆ 21 నిత్యకర్మలను 1. పాకయజ్ఞాలు 2. హవిర్యజ్ఞాలు 3. సోమ యజ్ఞాలుగా విభజించారు. అష్టకం, స్థాలీపాకం, పర్వణం, శ్రావణి, ఆగ్రహాయని, చైత్రి, ఆశ్వయుజి- పాకయజ్ఞాలు. వీటిలో, వండే పదార్థానికే ప్రాధాన్యం. పాకమంటే వంట.

హవిస్సు అంటే అగ్నిలో వేసి కాల్చే ఆహారాదులు. అగ్న్యాధానం, అగ్ని హోత్రం, ధర్మ పూర్ణమాస, చాతుర్మాస్యం, నిరుద్ధ పశుబంధం, సౌత్రామణి - ఇవి హవిర్యజ్ఞాలు.

'సోమ' అనే తీగ మొక్కల నుంచి తీసిన సోమరసం గ్రోలుతూ, పశుబలులనిస్తూ చేసేవి సోమయజ్ఞాలు. అగ్నిష్టోమం, అత్యగ్నిష్టోమం, ఉక్థ్యం, షోడశి, వాజపేయం, అతిరాత్రం, ఆప్తోర్యామం-ఇవి సోమయజ్ఞాలు. పరిశీలిస్తే, అసలు సోమయజ్ఞమే ఆర్యులలో అతిప్రాచీనంగా వుంది. వారి తొలినివాస ప్రాంతమైన మధ్యాసియా, కశ్యప (కాస్పియన్) సముద్ర తీరావాసాల్లో ఇది జరిగేది. పారసీకుల్లోనూ అది వ్యాప్తిలో వుండేదనటానికి వారి వేదం 'జందవేస్తా' సాక్ష్యమిస్తోంది. పారసీక పర్వత ప్రాంతాల్లో సోమలత విరివిగా లభిస్తుంది. అగ్నిపూజలు చేస్తూ సోమలతల నుంచి తీసిన సోమరసాన్ని ఆస్వాదిస్తూ ఆటపాటలతో కేరింతలు కొట్టటం వారికి వినోదం. ఆర్యులు సింధులోయను చేరుకున్నాక, ఆ నదీతీర ప్రాంతంలోనూ దానిని కనుగొన్నారు. హిమాలయాలు, కశ్మీరుల్లోనూ గుర్తించారు. దాన్ని ప్రధాన వినియోగవస్తువుగా చేసుకొని, రుగ్వేద మంత్రాల్లో కూడా దేవతగా వర్ణించుకున్నారు. 9వ మండలంలో 114 మంత్రాలు సోమరసాన్ని కీర్తిస్తూ చెప్పినవే. అందుకే దాన్ని సోమమండలమన్నారు. ఇళ్లల్లో కుండల కొద్దీ సోమరసాన్ని నిల్వ వుంచుకునేవారని రుగ్వేదం (9-20-6) తెలుపుతోంది.

పారసీకులు 'స' ను 'హ' గా పలుకుతారు. వారి ఉచ్ఛారణలో 'సోమ', 'హోమ'గా మారిపోయింది. కనుక హోమం అంటే సోమరసం ప్రధానంగా వుండాల్సిన యజ్ఞమే. ఇప్పుడు అదిలేకపోయినా, ఇంగువ కట్టిన గుడ్డలా, పేరు మిగిలిపోయింది.

యజ్ఞాలు నిత్యమూ ఆచరించాల్సిన కర్మలు .కాగా, అవసరాన్ని బట్టి అప్పుడప్పుడూ చేయాల్సి వచ్చేవాటిని 'యాగాలు' అన్నారు. రాజసూయం, అశ్వమేధం, అలాంటివి. అయితే యజ్ఞానికి - యాగానికి వున్న స్వల్ప భేదం కాలక్రమంలో కనుమరుగయింది. ఆ రెండింటినీ ఒకే అర్థంలో వాడటం, జంటగా వాడటం సర్వసాధారణమయింది. ఏ యజ్ఞం చేసినా, యాగం చేసినా, అవిపూర్తయ్యాక, వాటికి అనుబంధంగా చేసే క్రతువులను 'ఇష్టి' అన్నారు. వర్ణాశ్రమధర్మాలను, వేద ధర్మాన్ని కాపాడటాన్నే 'ఇష్టం'

అన్నారారోజుల్లో. ప్రజలకుపయోగపడే సమావేశ గృహాలను, చలివేంద్రాలు, చెరువులు వంటి సౌకర్యాలను కల్పించటాన్ని 'పూర్తం' అనేవారు. రాజయినవాడు పట్టాభిషేకం పొందాక, 'ఇష్టాపూర్తాలను' తప్పక చేయాలి. ఇదే విషయం విద్యారణ్య స్వామి రాసిన వేద భాష్యంలో ఇలా వుంది.

'వర్ణాశ్రమ త్రయీధర్మ ఇష్టపూర్త మథేతరం
ప్రపా తటాకాది రూపం తచ్చ సర్వత్ర విద్యతే "

ఐతరేయ బ్రాహ్మణం కూడా **"ఇష్టాపూర్తావపరిజ్యానిః"** అంటోంది. "ఇష్టాపూర్తం" అనే పదబంధమే ఇప్పుడు మన వాడుకలో 'ఇష్టపూర్తి' అయింది. "నువ్వాపని ఇష్టపూర్తిగా చేస్తావా, లేదా?" అని అడుగుతుంటాంగదా!

ఇంతకీ 'ఇష్టం' అనేదాన్ని యజ్ఞయాగాలకు అనుబంధంగా సాగే మరో క్రతువు అనుకున్నాం గదా! రామాయణంలో దశరథుడు అశ్వమేధ యాగం పూర్తి చేసాక, 'పుత్రకామేష్టి' చేస్తాడు. పుత్రులు కావాలన్న కోరికతో చేసిన 'ఇష్టి' అది. దాన్ని ఋశ్యశృంగుడు నిర్వహిస్తాడు. ఆ తర్వాతే దశరథుని ముగ్గురు భార్యలకు పుత్ర సంతానం కల్గుతుంది. మహా భారతంలో ధర్మజుడు రాజసూయ యాగం చేసిన అనంతరం, 'ఉదవసానీయ+ఇష్టి' జరుపుతారు. ఆ 'ఇష్టి' లోనే శిశుపాలుణ్ని బలిపశువుగా చంపుతారు.

ఇక 'సవనమ్' అనే మరోక్రతువు కూడా యజ్ఞాలకు అనుబంధితమే. 'సోమరసస్రావణం', 'సోమరస స్రావకదినమ్' అని కూడా అంటారు దాన్ని. అంటే సోమాన్ని పిండే ప్రక్రియ ఇందులో ప్రధానం. 'సౌత్రామణి, బృహస్పతి' అనేవి సవనాలే. అగ్నిచయన, రాజసూయ యాగాలకు సౌత్రామణి, వాజపేయం యజ్ఞానికి బృహస్పతి సవనాలుగా (అనుబంధయజ్ఞాలుగా) వుంటాయి. వేద కాలంలో ఆర్యుల జీవనంలో యజ్ఞం ఒక ప్రధాన భాగం. అదే క్రమంగా మతం రూపు ధరించింది. యజ్ఞం లేకపోతే వేదం లేదు, వేదం లేకపోతే వైదిక మతం లేదు. వైదిక మతమే పరిణమక్రమంలో హిందూ మతమయింది. అందుకే 'యజ్ఞం' అనే పదాన్ని అనేక పనులకు అన్వయించి చెప్పటం కూడా అలవాటయింది. పలువురితో చేయాల్సిన ఒక కష్టమైన పనిని 'యజ్ఞం' తో పోల్చటం చూస్తుంటాం. హిందూ మతంలో, ఒక మనిషి తల్లి గర్భంలో వున్నప్పట్నుంచి చనిపోయిందాక 'షోడశ (16) కర్మల్ని' ఆచరించవలసివుంటుంది.

'కర్మ' అంటే వైదిక కాలంలో యజ్ఞాన్ని నిర్వహించే తీరు. ఆ తర్వాత దానికి ఆధ్యాత్మికత అంటుకొని 'కర్మ సిద్ధాంతం' అయింది. 'యజ్ఞో వై శ్రేష్ఠతమంకర్మ' –

యజ్ఞమే అన్నింటికంటే గొప్పదైన కర్మ ('పని) అంటోంది వేదం. యజ్ఞంలో ప్రధానంగా మూడు భాగాలుంటాయి – యజ్ఞ వస్తువులు, యజ్ఞదేవతలు, యజ్ఞ విధులు. పెరుగు, నెయ్యి, వంటి పదార్థాలను (యజ్ఞవస్తువులు) ఇంద్రుడు, వరణుడు మొదలయిన దేవతల కోసం అగ్నిలో 'హుతాలు'గా సమర్పిస్తుంటారు. పదార్థాలను దేవతలకు అర్పించేందుకు జరిగే మొత్తం తంతునే 'కర్మ' అంటారు. అలాంటి కర్మల వల్లనే అనుకున్న ఫలితాలులొస్తాయని ఆర్యుల విశ్వాసం. భగవద్గీతలో కూడా –

**"అన్నాద్భవంతి భూతాని, పర్జన్యాదన్న సంభవః**

**యజ్ఞాత్ భవతి పర్జన్యో యజ్ఞః కర్మ సముద్భవః** (3–14)

కర్మవల్లనే యజ్ఞం ఏర్పడుతుందని చెప్పింది. కనుక, యజ్ఞ కార్యం ప్రధానంగా ఆహారం కేంద్రంగా ఏర్పడిందే. యజ్ఞం చేసాక, అంటే అగ్నిలో వేయాల్సిన వాటిని వేసాక, మిగిలిన వాటిని తింటే సమస్త దోషాలు పోతాయని కూడా ఆర్యులు విశ్వసించారు.

పారసీకులయినా, ఆర్యులయినా, ఆహారాన్ని సేకరించుకొని అగ్నిసాక్షిగా దాన్ని భుజించటానికి ఏర్పాటు చేసుకున్నతతంగాన్నే 'యజ్ఞం' అన్నారు. వేద కాలానికంటే ముందు, ఈ తంతు ఎలా జరిగేదో చూడండి...

"మన వైదికార్యులు అప్పటికింకా కాశ్యపి (కాస్పియన్ సముద్ర ప్రాంతం) లోనే వున్నారు. అప్పటికి రాళ్లు గుండ్రంగా పేర్చి కుండాలు తయారు చేసేవారు. పచనానికి సిద్ధంగా వున్న పశుకళేబరంలో ఓ ఖదిర శూలాన్ని గుచ్చేవారు. కుండానికి అటూ యిటూ పంగల కర్రలను పాతి, పశువుకు గుచ్చిన శూలాన్ని ఆ పంగల కర్రలకు అమర్చేవారు. కుండంలో కర్రలు వెలిగించి, పంగల కర్రకు అమర్చిన పశువును గుండ్రంగా మంటమీద తిప్పేవారు. పశుమాంసం కొన్ని చోట్ల మందంగాను, మరికొన్ని చోట్ల పలుచగాను వుంటుంది. మందంగా వున్న భాగాన్ని పచన చేయటం కోసం నిప్పుల మీద ఆజ్యాన్ని పోసేవారు... పచనం కోసం హోతలు (కాల్చేవారు) స్రుక్, స్రువాలనే సాధనాలను వాడతారు. మంటలను పెంచటానికి కొవ్వును వాడతారు. ఆవుల కొవ్వునే... వైదికులు ఆజ్యం అన్నారు." (వేదభూమి, పేజీ : 39,40 రచన : రాంభట్ల కృష్ణమూర్తి.)

పశుమాంసాన్ని కాల్చటంలో నిపుణతగల వాడుహోత. సోమరసం గ్రోలుతూ సామగానం చేసేవాడు ఉద్గాత. మంటల ఎక్కువ తక్కువలను గమనిస్తూ, కట్టెలను వేస్తూ, ఆజ్యం పోస్తూ వుండేవాడు అధ్వర్యుడు. దాన్ని మొత్తాన్ని పర్యవేక్షిస్తూ యజ్ఞం జరిపించే పెద్ద, యజమాని. నాటి సమాజానికి వివిధ రకాల సేవలందించే సేవకులు

ఇంద్ర, వరుణ, అగ్ని, యములు. వారివాటా వారికి యజ్ఞంలో అందాల్సిందే. అవి వ్యక్తుల పేర్లు కావు, పదవులు. (ఇలాంటి ఎన్నో చారిత్రక యజ్ఞ విశేషాలు పైన ఉదహరించిన పుస్తకంలో వున్నాయి - రచయిత)

స్థూలంగా చెప్పాలంటే, యజ్ఞం అనేది తింటానికి, తాగటానికి, ఉల్లాసంగా గడపడానికి ఏర్పడిన ఒక ప్రక్రియ. దానికి అలవాటు పడిన సోమరులు, యజ్ఞానికి పవిత్రతను, మహత్తును ఆపాదిస్తూ వచ్చారు. ఆహారం సమృద్ధిగా దొరికే అవకాశాలు వచ్చాక, యజ్ఞాల లక్ష్యం స్వర్గం, మోక్షప్రాప్తి అయ్యాయి. మోక్షప్రాప్తి కోసమే పశువులను బలియిస్తున్నామని కూడా సమర్థింపు మొదలయింది. యజ్ఞాలు చేయటం, చేయించటం బ్రాహ్మణుల జన్మ హక్కుగా మారింది. ఆర్యావర్తం 'యజ్ఞభూమి' గా పేరు పొందింది. క్షత్రియులు, వైశ్యులు యాగాలు చేయించాలి, కానీ, యాగం చేసే హక్కువారికిలేదు. సమాజంలో ధనికులయిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యవర్గాల వారు యాగాలు చేయించవచ్చు.




రాజరికం మొదలయ్యాక యజ్ఞక్రతువులు భారీగా జరిగాయి. ఒక్కరోజు నుండి 12 రోజుల వరకు జరిగే వాటిని యజ్ఞాలన్నారు, అంతకంటే ఎక్కువ రోజులు జరిగే వాటిని 'సత్రాలు' అన్నారు. ఒక్కో 'సత్రం' ఏడాది నుండి వందేళ్లు వరకు కూడా జరపవచ్చు. రాజు కోశాగారంపై అది ఆధారపడి వుంటుంది. యజ్ఞాంతంలో , సమస్త ధనాన్ని, గోవుల్ని, బ్రాహ్మణులకు దానం చేసి చక్రవర్తి బికారి అయ్యే పరిస్థితి కూడా వుండేది. రామాయణ, మహా భారతాల్లోనూ, మరికొన్ని పురాణ కథల్లోనూ యజ్ఞాలు జరిగిన తీరును పరిశీలిస్తే ఇది అర్థమవుతుంది. యజ్ఞాల పరమార్థం ద్విజుల సంక్షేమమే తప్ప, సర్వజన క్షేమం కాదనటానికి ఎన్నో ఉదాహరణలు చూపవచ్చు.

ఈ అన్యాయాన్ని ప్రశ్నించింది మొదటగా చార్వాకులే. "యజ్ఞంలో దర్భలు, కలప, నేయి మొదలయిన వాటిని కాల్చిన యజమానికి చనిపోయాక స్వర్గం వచ్చేది నిజమైతే, అడవిలో దావాగ్నికి దగ్ధమైన అనేక వృక్షాలకు కూడా స్వర్గం లభించాలి గదా!" అని అడిగారు.

"పశుశ్చేత్ నిహతం స్వర్గం జ్యోతిష్టోమే గమిష్యతి
స్వపితా యజమానేన తత్ర క స్మాన్న హన్యతే"

(సర్వదర్శన సంగ్రహం)

'జ్యోతిష్టోమం లాంటి యజ్ఞాల్లో పశుబలి జరుగుతుంది. అలా చేయటం వల్ల ఆ పశువు స్వర్గానికి చేరుతుందంటారు. అదే నిజమైతే, యజమాని తన తండ్రిని బలియిచ్చి స్వర్గప్రాప్తి ఎందుకు కల్గించడు?' అని వారు ప్రశ్నించారు. నిత్యమూ అగ్ని హోత్రాలు చేయటం, మూడు వేదాలు చదవటం, త్రిదండంతో మౌనంగా కూర్చోవటం, వంటినిండా విబూది రాసుకోవటం లాంటివన్నీ బుద్ధి, పౌరుషం లేనివారు పొట్టకూటికోసం చేస్తుంటారని నిర్భయంగా చాటారు. చార్వాకుల బాటలోనే జైనులు, బౌద్ధులు నడిచారు. యజ్ఞ హింసను ఎదిరించారు. ఈ విషయంలో తనతో తలపడిన ముగ్గురు బ్రాహ్మణులు - కూట దంతుడు, ఉజ్జయుడు, ఉదయనుడు - అనే వారికి బుద్ధుడు గట్టిగానే బదులిచ్చాడు. జీవహింస, మత్తుపదార్థసేవనం, దానం లాంటివి లేకుండా జాగృతితో జీవించగల్గటమే నిజమైన యజ్ఞమన్నాడు. అంటే వ్యక్తిగత దురలవాట్లు లేకుండా జీవించాలని దానిభావం.

యాగాల వల్ల జరిగేదేమి లేదని, అవి అగ్ర జన్ముల భోగాల కోసమే తప్ప, ప్రజలకు మేలు చేసేవి కావని భావించి, వాటిని వ్యతిరేకించిన పాలకులూ కొందరు చరిత్రలో వున్నారు. అశోకుడు అందుకు వుదాహరణ. అలాగే మహా భాగవతంలోని వేనరాజు ఉపాఖ్యానమూ దీన్నే చెపుతుంది. అంగరాజ్యాన్ని పాలించే వేనరాజు ఇలా శాసించాడు-

**"న యష్టవ్యం న దాతవ్యం న హోతవ్యం ద్విజః క్వచిత్**
**ఇతి న్యవారయత్ ధర్మ భేరీ ఘోషేణ సర్వశః (4-14-6)**

తన రాజ్యంలో 'బ్రాహ్మణులు ఏ విధమైన యజ్ఞాలను చేయరాదు. దానాలను, హోమాలను చేయరాదు.' అని రాజ్యమంతటా దండోరా వేయించాడు. దాంతో యజ్ఞాలమీద పడి బ్రతికే భృగువు వంటి రుషులకి ఆగ్రహం పెరిగింది. వేనుని మాయోపాయంతో అంతమొందించారు. తమ చెప్పుచేతుల్లో వుండగల్గిన వేనుని కొడుకు పృధువుని రాజుగా చేసారు.

ఇలాంటి కథలు యజ్ఞ విరోధులయిన రాజులకు ఒక హెచ్చరిక, వారిని భయపెట్టి తమ అదుపాజ్ఞల్లో వుంచుకునేందుకు అల్లేపన్నుగడ. అశోకుని కాలంలోనూ, అతని వారసులుగా వచ్చిన తదనంతర మగధరాజుల పాలన లోనూ యజ్ఞాలకు ఆదరణ లేనందు వల్లనే, చివరి మగధరాజు బృహద్రధుని చంపి, అతని బ్రాహ్మణ మంత్రి

పుష్యమిత్రుడు గద్దెనెక్కాడు. యజ్ఞయాగాలకు పునరుజ్జీవనం కల్పించాడు. క్రీ.పూ. 185 సం॥లో జరిగిన ఈ సంఘటన నుండి, మనదేశంలో ముస్లిం పాలన ఏర్పడిందాకా, యజ్ఞ యాగాలకు 'స్వర్ణ యుగమే'. గుప్తులు, శాతవాహనులు, కాకతీయులు, చోళులు, చాళుక్యులు.... దాదాపు ప్రతిరాజవంశమూ వందలాది యజ్ఞ క్రతువులను చేయించి, పొగడ్తలందుకుంది. వందయాగాలు చేస్తే స్వర్గలోకంలో ఇంద్రపదవి దక్కుతుందట! ఇలాంటి ఊరింపులతో రాజుల ఖజానాను ఖాళీ చేయిస్తూ ప్రజల జీవనాన్ని బండ బారించింది పురోహిత బృందమే.

ఇపుడు రాజుల కాలం పోయింది. పాలనలో ప్రజల భాగస్వామ్యాన్ని కలిగిన ప్రజాస్వామ్యం ఏర్పడింది. అయినా, దేశంలోని ప్రజా ప్రతినిధులు నాటి రాజరిక మనస్తత్వంతోనే వ్యవహరిస్తున్నారు. ఎన్నికల్లో ప్రజాస్వామికవాదుల్లా మాట్లాడి, పదవు లధిష్ఠించాక చక్రవర్తుల్లా మారిపోతున్నారు. వ్యక్తిగతంగా వుంచుకోవాల్సిన మత భావనలను ప్రభుత్వంలోకి తెస్తూ, వాటి ప్రచారానికి, పెంపుదలకూ ప్రభుత్వ ధనాన్ని, అధికార యంత్రంగాన్ని, హోదాను వుపయోగిస్తున్నారు. ప్రజాస్వామ్యం గొడుగుకింద మత తత్వానికి పట్టంగడుతున్నారు. పాలకుల ఈ వైఖరి పాలితులను, పాలనా సంస్థలను, సేవా సంస్థలను కూడా ప్రభావితం చేస్తూ అర్థం పర్థం లేని అశాస్త్రీయ ఆచారాలకు ఆలోచనలకు సమాయత్త పరిస్తోంది. ప్రజాస్వామిక వ్యవస్థ పునాదుల్ని పెకలింపజూస్తోంది.

**యజ్ఞాలు యాగాలు ఆధునిక సమాజాన్ని ఇంకా పట్టిపీడిస్తున్న దీర్ఘరోగాలు.** జీవన సమస్యలకు ఆభాస పరిష్కారాల్ని చూపుతూ భ్రమింపజేస్తున్న ఎండమావులు. వాటికోసం వెచ్చిస్తున్న కోట్లాది రూపాయలు దుబారాగావటం తప్ప ఏ ప్రజానీకానికీ సంక్షేమం లభించదు. వేద మంత్రాల్లో ఏదోశక్తి దాగివుందని, దానిని వెలికి తీయటం వల్ల కోరిన ఫలితాలను రాబట్టగలమని కొందరు చేస్తున్న వంచనా ప్రచారం వల్ల అంతిమంగా సామాజిక ప్రగతి ఆగిపోతున్నది. స్వశక్తి, కార్యనిపుణత, సామర్థ్యం వినియోగం వంటి వ్యక్తిగత ప్రతిభలన్నీ అభౌతిక శక్తులను ప్రసన్న చేసుకొనే క్రియాకలాపాలకు బలవుతున్నాయి. ఈ పరిస్థితి పెరుగుతూ పోతే, సమాజం మొత్తం కర్మ సిద్ధాంతానికి, భావదాస్యానికి బానిసగా మారుతుంది.

కనుక, మనం కళ్లు తెరవాలి. యజ్ఞయాగాలు, వాస్తు జ్యోతిష్యాలు, ముహూర్త శకునాలు వంటి అవాస్తవిక, తప్పుడు ప్రచారాల వ్యాప్తిని అడ్డుకునేందుకు సమాయత్తం కావాలి. సాధారణ పౌరులయినా సరే, పాలించేవారైనా సరే, భ్రమల్లోకి నెట్టే అంశాలను ప్రోత్సహిస్తుంటే, గట్టిగా ఎదిరించాలి. వారి మూఢత్వాన్ని మరొకరిపై రుద్దే ప్రయత్నాన్ని వీలయిన పద్ధతుల ద్వారా అడ్డుకునే ప్రయత్నం చేయాలి.

# మరణసామీప్య అనుభవాలు-సైన్సు



2016, డిశంబర్ 7వ తేదీ మధ్యాహ్నం 1.30 గం॥ తెలుగు న్యూస్ ఛానెల్ టీవీ-9 ఒక వార్తను ప్రసారం చేసింది.

జమ్మూ & కశ్మీర్ రాష్ట్రంలోని రాజౌరీలో అబ్దుల్ అజీజ్ అనే వ్యక్తి అప్పటికి వారంక్రితం చనిపోయాడు. గ్రామస్థుల సమక్షంలో అతణ్ణి పూడ్చి పెట్టారు. అయితే, అతడు హత్య చేయటం వల్లనే చనిపోయాడని, అజీజ్ మృతిపై విచారణ చేపట్టి నేరస్థులను దండించాలని కొందరు గ్రామస్థులు స్థానిక పోలీసులకు ఫిర్యాదు చేసారు. దాంతో, పోలీసులు రంగంలోకి దిగి, 3 రోజులక్రితం పూడ్చిన శవాన్ని వెలికితీసి, పోస్టుమార్టమ్ కోసం ఆస్పత్రికి తరలించారు. మృతశరీరాన్ని స్ట్రెచర్‌పై వుంచి, డాక్టర్లు ముందుగా శవం తలపై చిన్నగాటు పెట్టేందుకు ప్రయత్నించారు. అంతలోనే, శవం కదలాడి, కళ్లు తెరచింది. “నేనిక్కడున్నానేంటి?” అన్నాడు అజీజ్. డాక్టర్లు, పోలీసులు వులిక్కి పడ్డారు. దయ్యమేమో అనుకున్నారు. అయితే, అజీజ్ పైకిలేచి, మనిషిలాగే ప్రవర్తించటంతో స్థిమిత పడి ధైర్యం తెచ్చుకొన్నారు. ‘నువ్వు చనిపోలేదా?’ అడిగారు పోలీసులు. “నేను చనిపోవటమేమిటి?” అని ఎదురు ప్రశ్నించాడు అజీజ్. పోలీసులకు అర్థమయింది. అజీజ్‌కి అంతా వివరించారు. ‘మూడురోజులపాటు నువ్వు చనిపోయి

వున్నావు' అని చెప్పారు. 'ఈ మూడు రోజుల్లో ఏమైనా అన్పించిందా?' అని అడిగారు. అప్పుడు అజీజ్ గుర్తుకు తెచ్చుకుంటూ తనను ఎవరో వెంట తీసుకుని ఆకాశంలోకి వెళ్ళారని, తెల్లటి మేఘాల మధ్య ఇంకా తెల్లని గుర్రాలనెక్కిన దేవదూతలు తనకు కన్పించారని, వారితో పాటు తాను తిరిగానంటూ చెప్పాడు. ఇదంతా ఒక అద్భుతమని, చచ్చినోడు బ్రతకటం ఎప్పుడూ చూడలేదని గ్రామస్థులు విస్తుపోయారు. 'సైన్సుకు కూడా అంతుబట్టని వింత ఇది' అని మీడియా వర్ణించింది.

ఇలాంటి వార్తలు నిజంగానే 'వింత' అన్పిస్తాయి. శాస్త్రీయకారణాలు అంతుబట్టని వారందరికీ అద్భుతాలుగా తోస్తాయి. అప్పుడప్పుడు ఇలాంటి ఉదంతాలు మన తెలుగు సమాజంలో కూడా జరుగుతుంటాయి.

2005 జూలై 8న ఇలాంటి ఘటనే నల్లగొండ జిల్లాలో జరిగింది. కేతేపల్లి మండలం 'ఇనుమాముల' గ్రామానికి చెందిన బత్తుల మల్లారెడ్డి అనే 80 ఏళ్ల వృద్ధుడు చలనం కోల్పోయాడు. అతని భార్య కమలమ్మ కలవరపడి ఇరుగుపొరుగుకు చెప్పింది. ఇద్దరు గ్రామస్థులు అతని శ్వాసను, నాడిని పరీక్షించి చనిపోయాడని నిర్ధారించారు. అంత్యక్రియలకు ఏర్పాట్లు మొదలయ్యాయి. మల్లారెడ్డి దేహాన్ని వరిగడ్డిపై వుంచి, తల దగ్గర దీపం వెలిగించారు. వర్షం పడుతోందని, దహన సంస్కారానికి ఆలస్యం చేసారు. 20 గంటల తర్వాత మల్లారెడ్డి స్పృహలోకి వచ్చాడు. దాంతో దుఃఖసాగరంలో వున్న బంధువులంతా బిత్తరపోయారు. ఈ ఉదంతాన్ని తెలుసు కునేందుకు వెళ్లిన ఆంగ్ల దినపత్రిక 'హిందూ' విలేకరికి మల్లారెడ్డి తన 'అనుభవాలు' వివరించాడు. తాను యమదూత లతో కలిసి యమపురికి వెళ్లానని పెద్దకుర్చీపై, మెలివేసిన మీసాలతో బట్టతలతో వున్న యముడు, బీరువా లోంచి మృతుల పుస్తకాన్ని తీసి, ఒకపేజీ చూసాడని, యమకింకరులను పిల్చి వారిని తిట్టాడని, తిరిగి తనను యింటిదగ్గర దించి రమ్మన్నాడని, వాళ్ళు ఒక ఇంద్రజాలక విమానంలో తెచ్చి తన యింట్లో వదలివెళ్ళారని చెప్పాడు.

మల్లారెడ్డి సత్యసంధుడని ఏనాడూ అబద్ధం చెప్పడని గ్రామస్థులు ఒకే గొంతుకగా విలేకరికి చెప్పారు.

ఇలాంటి సంఘటనలు ప్రపంచమంతటా వార్తల్లోకి వస్తుంటాయి. ఈ అనుభవాలనే మరణ సామీప్య అనుభవాలు (Near Death Experiences - NDE) అంటుంటారు. వీటికి లోనైన వ్యక్తులు కావాలని అబద్ధాలు చెబుతున్నారు అనలేము. వారి మాటల్లోని నిజాయితీని శంకించాల్సిన అవసరమూ లేదు. పూర్వం రాసిన కొన్ని మతగ్రంథాల్లో, పురాణాల్లో కూడా ఇలాంటి కథలు విన్పడుతుంటాయి. చాలామంది విశ్వసిస్తుంటారు కూడా.

అయితే, ఇలాంటి మరణ సామీప్య అనుభవాల గురించి మొదటగా సైన్సు ప్రపంచం దృష్టికి తెచ్చిన వాడు ఫ్రెంచ్ సైకాలజిస్ట్ విక్టర్ ఎగ్గర్. 1890లో జరిగిన ఒక శాస్త్రవేత్తల సమావేశంలో ప్రస్తావించాడు. ఆయన వీటిని 'అనిశ్చిత మరణానుభవాలు' (Experiences of imminent Death) అన్నాడు. తర్వాత వీటి గురించి ఎవరూ పట్టించుకోలేదు. 1968లో సెలియా గ్రీన్ అనే శాస్త్రవేత్త వీటిపై దృష్టి సారించి ఇలాంటి 400 కేసుల్ని సేకరించి, వాటితో ఒక పుస్తకాన్ని ప్రచురించాడు. 1975లో, ప్రముఖ మనోవైద్యుడు రేమండ్ మూడీ ఆ కేసులపై పరిశోధనలు చేపట్టి వాటికి 'మరణ సామీప్య అనుభవాలు' (N.D.E.) అని పేరు పెట్టాడు. మూడీ రాసిన 'లైఫ్ ఆఫ్టర్ లైఫ్' పుస్తకం వచ్చాక, 1981లో ఈ అనుభవాలపై పరిశోధించటానికి 'ఇంటర్నేషనల్ అసోసియేషన్ ఫర్ నియర్ డెత్ స్టడీస్ (IANDS)' అనే సంస్థ ఏర్పడి, అమెరికా, ఆస్ట్రేలియా, ఆసియా, ఆఫ్రికా ఖండాలలో శాఖలను ఏర్పరచుకొని అధ్యయనం చేపట్టింది. కనుగొన్న నూతనాంశాలను ఆ సంస్థ 'జర్నల్ ఆఫ్ నియర్ డెత్ స్టడీస్'లో ప్రచురిస్తూ వుంది. 1975 నుండి 2005 సం॥ వరకు ఒక్క అమెరికాలోనే 2500 కేసుల్ని, యూరప్‌లో 600, ఆసియాలో 70 కేసుల్ని వివిధ పరిశోధకులు తమ పరిశోధనలకు నమోదు చేసుకున్నారు. వైద్య, మానసిక, సామాజిక, ఆర్థిక రంగాలకు చెందిన శాస్త్రవేత్తలు ఈ పరిశోధనల్లో పాల్గొన్నారు.

మరణ సామీప్య అనుభవాలకు గురయిన వారు ఎటువంటి అనుభూతులకు లోనవుతుంటారు? అనే అంశంపై పరిశోధకులు ఈ క్రింది అంచనాలకు వచ్చారు. మరణ సామీప్య అనుభవాలకు లోనైన వ్యక్తులు ముందుగా, తామీ ప్రపంచాన్ని వీడిపోతున్నామనే అనుభూతి పొందుతారు. వారి చెవుల్లో పెద్దమోతలు, హారన్ ధ్వనులు లాంటివి వినపడతాయి. అంతకు ముందు లేని ప్రశాంతత, ఏ వేదనా, నొప్పి తెలియని స్థితి ఏర్పడతాయి. తమ శరీరాన్ని వీడిపోతూ, కొందరు, ఆ శరీరాన్ని కూడా పైనుంచిచూస్తారు. గత జీవన స్మృతులను గుర్తుకు తెచ్చుకోగలమనుకుంటారు. ఏదో తెలియని చీకటి సొరంగంలోకో, మిరుమిట్లు గొలిపే వెలుగులోకో చొచ్చుకు పోతున్నట్లు అన్పిస్తుంది. కళ్లముందు వెలుగులు విరజిమ్మే వ్యక్తులున్నట్లు, వారంతా తెల్లని దుస్తుల్లో తేలిపోతున్నట్లు, లేదా అలాంటి తెల్లటి వస్తువులేవో ఎగురుతున్నట్లు అనుకొంటారు. తమకంటే ముందే గతించిన తమకిష్టమైన బంధువుల్ని, మిత్రుల్ని కలుసుకున్నట్లు భావిస్తారు. తామే ఏదో ఒక వెలుగులోకి ప్రవేశిస్తున్న అనుభూతీ కలుగుతుంది. తాము నమ్మే/ఆరాధించే దేవీదేవతల దర్శనాన్ని పొందినట్లు, వారితో మాట్లాడినట్లూ అనిపిస్తుంది. తిరిగి తన ఇంటికి, తన (పూర్వ) శరీరంలోకి వచ్చే అనుభూతికీ లోనవుతారు.

సాధారణంగా, ఇలాంటి అనుభూతులు పొందిన వారు తాము చూసిన వాటిని చెప్పమన్నప్పుడు స్వర్గం లేదా నరకం గురించి వర్ణిస్తారు. ఆ వర్ణనలు, అంతకుముందు వారు విన్న కథలు, చదివిన మతగ్రంథాలకు సంబంధించినవే అయి వుంటాయి.

ఏయే శారీరక, మానసిక అనారోగ్యాలకు గురయిన వారు మరణ సామీప్య అనుభవాలకు లోనవుతారు? అనే దానిపై చాలామంది పరిశోధకులు ఒక అభిప్రాయానికి వచ్చారు. గుండె పనిచేయటం తాత్కాలికంగా ఆగినపుడు, ఏదైనా ప్రమాదంలో రక్తస్రావం అధికంగా జరిగినపుడు, గాయానికి సెప్టిక్ అయి దీర్ఘకాలిక వైద్యానికి దారితీసినపుడు, విద్యుత్ షాక్ వల్ల అపస్మారకస్థితి ఏర్పడినపుడు, మెదడులో రక్తనాళాలు చిట్లి కోమా ఏర్పడినపుడు, మెదడులో వివిధ కారణాలతో రక్తస్రావం జరిగేటపుడు, ఆత్మహత్యకు పాల్పడి నపుడు, ఆక్సిజన్ అందకపోవటం వల్ల శరీరం నిశ్చేతన మైనపుడు, తీవ్రమైన ఆందోళన మనసులో ముసిరినపుడు,.... ఇంకా ఇలాంటి మరికొన్ని ఆరోగ్య పరిస్థితులు మరణ సామీప్య అనుభూతులనిస్తాయట!

మరణ సామీప్య అనుభవాల గురించి ప్రాచీనకాలం లోనూ పరిజ్ఞానం వుంది. పాశ్చాత్య మేధావి గ్రెగరీ శుషాన్ అనే మేధావి ఈ అంశంపై పరిశోధించటానికి ప్రాచీన నాగరికతలైదింటిపై విస్తృత పరిశీలన గావించాడు. ఈజిప్టు, సుమేరియా, బాబిలోనియా (మెసపొటేమియా), వైదిక భారతదేశం, బౌద్ధం ప్రవేశింపని చైనా, ప్రాచీన అమెరికన్- సాంస్కృతిక ప్రజా జీవనాలను అధ్యయనం చేసాక, ప్రాచీన మతగ్రంథాల రచయితలకు మరణ సామీప్య అనుభవాల గురించి పరిజ్ఞానం వుందని తేల్చాడు. ఆ అనుభవాల్లో ద్యోతక మయ్యే వ్యక్తులు/దేవతలు/వస్తువులు, మత విశ్వాసాలను బట్టి వేరుగా వుండవచ్చుగాని, మిగిలిని విషయాల్లో ప్రపంచమంతటా ఒకేవిధమైన అనుభవాలుంటాయన్నాడు. ఉదాహరణకి క్రైస్తవులకు ఏసు, హిందువులకు యమలోకం ద్యోతకం కావచ్చు, కానీ శరీరాన్ని విడిచి పైకివెళ్లటం, అక్కడ వింతలను ఎదుర్కోవటం వంటివి సాధారణమే.

మరణ సామీప్య అనుభవాలలో ద్యోతకమయ్యే పవిత్ర వ్యక్తులు /దేవతలు, ఆ అనుభవాలకు గురైన వ్యక్తుల మతవిశ్వాసాలను బట్టి వేరుగా వుంటాయన్న విషయాన్ని ఓసిస్, హరాల్డ్‌సన్, స్టీవెన్‌సన్, పశ్రీచా అనే పరిశోధకులు స్పష్టం చేసారు. వీరిలో చివరి ఇద్దరు భారతదేశంలోని వ్యక్తుల అనుభవాలపై క్షేత్రపర్యటనల ద్వారా సమాచారం కూడా సేకరించారు. స్టీవెన్‌సన్ ఉత్తరభారతదేశం, పశ్రీచా దక్షిణ భారతం లోని వ్యక్తుల్ని సంప్రదించారు.

మనో వైజ్ఞానికురాలైన సత్వంత్ పశ్రీచా 1985-87 మధ్యకాలంలో, బెంగుళూరులోని NIMHANS (ప్రసిద్ధ మానసిక ఆరోగ్యసంస్థ) సహకారంతో కర్నాటకలోని మరణ సామీప్య అనుభూతులు పొందిన 22మంది వివరాలు సేకరించి విశ్లేషించారు. ఆ వివరాలు 1993లో Journal of Scientific Exploration (Vol: 7 No:2) లో అచ్చయ్యాయి. వాటిలో కొన్నింటిని చూద్దాం.

ముత్తక్క అనే మహిళకు 65 ఏళ్లు. 20 ఏళ్ళక్రితం తీవ్రమైన కడుపునొప్పితో బాధపడింది. కాళ్లు చేతులు వాచాయి. మలమూత్రాలను కూడా విసర్జించలేకపోయేది. ఒకసారి స్పృహతప్పి పడిపోయింది. ఆ తర్వాత, "రింగురింగుల జుట్టు వున్న ముగ్గురు వ్యక్తులు దగ్గరకొచ్చారు. వాకిట్లోంచి బయటకు చూసా. బెంచ్ మీద కూర్చున్న ఒకాయన లావుగా వుండి, కొన్ని పేపర్లు తిరగేస్తున్నాడు. ఆమెనెందుకు తెచ్చారని, ఆయన ఆ ముగ్గుర్నీ తిట్టాడు. ఆమెకింకా టైముంది గదా అని, చేతిలోని పేపర్లను విసిరేశాడు. తర్వాత మళ్లీ ఎలా ఇంటికి వచ్చానో తెలియదు" అంటూ తన అనుభవం చెప్పింది.

60 ఏళ్ల జవనమ్మ అనే మహిళకు ఒకరోజు పనిలో ముంజేయి విరిగింది. ఆమె పట్టించుకోలేదు. మూడురోజులకి జ్వరం వచ్చింది. అప్పుడు డాక్టర్ దగ్గరకి వెళ్లింది. విరిగిన చోట రాయటానికి పూతమందిచ్చాడు గానీ, జ్వరాన్ని పట్టించుకోలేదు డాక్టరు. అపస్మారకస్థితికి వెళ్లింది. 'నలుగురు యమదూతలు వచ్చారు. ఒక ద్వారంలోంచి లోపలికెళ్లా. అక్కడ మా అమ్మానాన్న కన్పించారు. యముడు చాలా లావుగా వుండి, ముందున్న పుస్తకాల్ని తిరగేస్తున్నాడు. తెమ్మన్నవారిని తీసుకురాలేదని, నన్ను తెచ్చినందుకు కోపంతో దూతల్ని కొట్టాడు. పొరపాటుగా నామీద కూడా ఒక దెబ్బపడింది. చాలానొప్పి చేసింది. ఆ లోకం నుంచి తిరిగి వచ్చాక కూడా ఆ నొప్పి వుంది. అక్కడొక మచ్చకూడా పడింది. మా అమ్మానాన్నలను నాతో పంపమని అడిగా. ఆ జనంగోలలో నామాట విన్పించుకోలేదు. తిరిగి యింటికి వచ్చి నా పిల్లల్ని చూసా." అంటూ తలమీదనున్న చిన్న మచ్చను చూపింది ఆ జవనమ్మ. యమలోకం నుంచి వచ్చిన వారందరికీ అలాంటి మచ్చ వుంటుందని కూడా చెప్పింది.

28 ఏళ్ల వయసులో వున్నప్పుడు కంచెమ్మ గర్భవతి అయింది. 5వ నెలలో ఆమెకు గర్భస్రావం జరిగి, 4 గంటలపాటు రక్తం కారింది. స్పృహకోల్పోయింది. ఊపిరాడటం లేదు. నాడి అందటం లేదు. శరీరం చల్లబడింది. చనిపోయిందనుకున్నారంతా. "నలుగురు స్త్రీలు నన్ను తీసుకెళ్లి ఒక మగవాని ముందుంచారు. ఆమెనెందుకు తెచ్చారు? అసలే చిన్నపిల్లల తల్లి. తిరిగి విడిచిరండి అంటూ ఆయన

వారిని తిట్టాడు. కాలిన ఎర్రని ఇనుపకడ్డీని నా మోకాలిపై వుంచి, నన్ను కిందికి తోసాడు. నొప్పితో గిలగిలలాడుతూ భూమిమీదకి వచ్చిపడ్డా. తర్వాత ఏవో పూతమందులు రాసి ఆ గాయాన్ని తగ్గించుకున్నా. ఇదిగో ఆ మచ్చ "అంటూ చిన్నమచ్చను చూపింది 35 ఏళ్ల కంచెమ్మ.

గౌరమ్మకు ఏ రోగమూ లేదు. 22 ఏళ్ల వయసు. బలహీనతవల్ల ఒకరోజు స్పృహతప్పింది. 10 నిమిషాలు ఏం జరిగిందో తెలియదు. "కొంతమంది జీపులో ఎక్కించుకొని యమలోకం తీసుకెళ్లారు. ఒక పెద్దాయన దగ్గర పుస్తకా లున్నాయి. అందులో చాలాపేర్లుండాయి. నాపేరు వెతికి చూసి, వెనక్కి పంపమని తెచ్చిన వాళ్లతో అన్నాడు. నేను తిరిగి వస్తున్నపుడు నా యిల్లు నా శరీరం కింద వుండటం, చుట్టూ జనం వుండటం అందులో కన్పించాయి" అంది గౌరమ్మ.

పై నాలుగు కేసుల్లో వున్న మహిళలు విశ్వాసాల రీత్యా హిందువులే. కాబట్టే జనం వాడుకలో వున్న కథనాల ఆధారంగా, చనిపోయినవాళ్ళు 'యముని దగ్గరకు వెళతారు', అన్న భావన మీదనే ఆధారపడి వారి అనుభవాలున్నాయి. అదే క్రైస్తవులయితే, వారి స్వర్గం వేరుగా వుండేది. ఈ వ్యాసం మొదట్లో చెప్పుకున్న అబ్దుల్ అజీజ్ ముస్లిం గనుక, అతనికి తెల్లని మేఘాలమధ్య తెల్లగుర్రాలపై ధగధగమెరిసే దేవదూతలు కన్పించారు. ఖురాను అందించిన స్వర్గం గురించి ఆయన విని వుండటమే అందుక్కారణం. పైకేసుల్లో వర్ణింపబడిన యమలోకం, వారు కథల్లో, సినిమాల్లో గ్రహించినదే. యముడు కొడితే మచ్చబడటం, కాలిస్తే మచ్చ ఏర్పడటం మొదలయినవన్నీ అనూచానంగా వస్తున్న కథల్లోని అంశాలే. తాము చెప్పేదానికి రుజువులు చూపటం నిజాలు చెపుతున్నట్లు నమ్మించటానికే. ఇలాంటివి మరణ సామీప్య అనుభవాల కేసుల్లో సాధారణ మేనని మనోవైజ్ఞానికులంటున్నారు.

మానసిక విజ్ఞానశాస్త్రం ప్రకారం, మరణ సామీప్య అనుభవాలు పొందే వ్యక్తులకు ఇతరులకంటే భిన్నమైన కొన్ని లక్షణాలుంటాయి.

1. వారు చాలా తేలిగ్గా భ్రాంతులకు, భ్రమలకు, కల్పనా కథనాలకు, మార్మిక అనుభూతులకు లోనవుతారు. అతిత్వరగా హిప్నోనిద్రలోకి వెళ్లగలుగుతారు. ఒక పనిచేస్తూనే, మరోదానిపై మనసుంచి, చేసేపనిని మర్చిపోతుంటారు.

2. వారిలో జ్ఞాపకాలు ముక్కలు ముక్కలుగా వుండి, అవన్నీ మెదడులో ఒకచోట లేకుండా వుంటాయి. ఏదైనా సంఘటనను చెప్పాలంటే, జ్ఞాపకాలన్నింటినీ వరసగా చెప్పలేక, కొన్ని కల్పితాలను జోడిస్తుంటారు.

3. మరణ సామీప్య అనుభవాలలో కొన్ని చాలామంది చెప్పేవే వుంటాయి. ఉదా: యముడు, యమదూతలు, స్వర్గం, అప్సరసలు, తెల్లనిమేఘాలు, ధవళ కాంతులు, చీకటి సొరంగాలు వగైరా. ఆ అనుభవాలకు లోనైన వారిలో కొందరికి ఇలాంటివి నిజంగా ద్యోతకంకావు. అయినా, సరే, తమ అనుభవాలను వెల్లడించేటప్పుడు వాటిని జ్ఞప్తికి తెచ్చుకొని జతచేసి చెపుతారు.

4. ఈ అనుభవాలు భౌతికంగా చావు దగ్గరపడే వారిలో రావు. చచ్చిపోతామేమోనని తీవ్రంగా భయపడేవారికే వుంటాయి.

పై వాటిని జాగ్రత్తగా గమనిస్తే, వారి అనుభవాలకు ప్రధాన కారణం వారి జీవనసాంస్కృతిక అంశాలేనని తేలుతుంది. అయితే, పైన పేర్కొన్న రెండో అంశం మెదడులోని జ్ఞాపకశక్తికి సంబంధించినది. మూడో అంశం, మెదడు- నాడీవ్యవస్థకు సంబంధించింది. వాటికి సంబంధించి శరీరధర్మశాస్త్రం (ఫిజియాలజీ) ఏమంటుందో కూడా చూద్దాం.

మానవశరీరధర్మశాస్త్రాన్ని అనుసరించి, మెదడులో వుండే ఎడమ టెంపోరల్ లోబ్ (Temporal Lobe) మరణ సామీప్య అనుభవాలకు ముఖ్యహేతువవుతోంది. ఆ అనుభవాలకు లోనైనవారిలో, ఆ 'లోబ్' అతిచురుకుగా పనిచేసినట్లు గుర్తించారు. దాన్ని కొంచెం రెచ్చగొడితేనే భ్రమలు, భ్రాంతులు, శరీర సంబంధంలేని అనుభూతులు, పాత జ్ఞాపకాల దొంతరలు విపరీతంగా తన్నుకొని వస్తాయని తేలింది. క్రిస్టోఫర్ ఛార్లెస్ ఫ్రెంచ్ అనే బ్రిటీష్ మనోవిజ్ఞానవేత్త చెప్పే దాని ప్రకారం, టెంపోరల్ లోబ్‌కి చిన్నదెబ్బ /వత్తిడి కలిగినా, దాన్ని కప్పివుంచే పొరవల్ల ప్రేరణ కలిగినా మరణ సామీప్య అనుభవాలకు అవకాశం వుంది. జర్మనీ శాస్త్రవేత్త అలెగ్జాండర్ వుల్జర్ మాత్రం మెదడులో సెరిటోనిన్ (Seritonin) అనే రసాయనం పెరిగితే ఆ అనుభవాలు పెరుగుతాయన్నారు. సెరిటోనిన్ అనేది నాడీ కణాల్లో వుండే ఒక ప్రోటీన్. ఇది పెద్దప్రేవులు, చిన్నప్రేవుల్లో వుండి వాటి కదలికల ద్వారా జీర్ణక్రియకు తోడ్పడుతుంది. అలాగే రక్తంలోని ప్లేట్‌లెట్స్‌లోనూ, కేంద్రీయ నాడీవ్యవస్థలోనూ ఇది వుంటుంది. మరణ సామీప్య అనుభవాలన్నీ 'భ్రమలతో నిండిన పాతజ్ఞాపకాలే'నని 2013లో మేరీ తోనార్డ్, జిమో బోర్జిగిన్‌లు తమ ప్రయోగాలతో నిరూపించారు. 2015లో ద్యుయాన్ లీ, అతని సహచరులు కూడా తమ పరిశీలనల ద్వారా ఆ విషయాలను ధ్రువీకరించారు.

జిమో బోర్జిగిన్ అమెరికాలోని మిచిగాన్ లో నాడీకణశాస్త్రవేత్త. మరణ సామీప్య అనుభవాలకు గురైనవారు, భ్రాంతులకు గురయ్యేవారు తెల్లని మేఘాలను, ధగద్ధగ కాంతులను చూసినట్లు చెప్పటానికి కారణమేమిటి? అనేదానిపై ప్రయోగాలు చేసా

ఎలుకల్లో తాత్కాలికంగా గుండె స్పందనలను నిలుపు చేసారు. నాడీకణజాలంలో ప్రవహించే విద్యుత్తులో ఆల్ఫా, తీటా, గామాతరంగాలుంటాయి. తీటా తరంగాలు గామా తరంగాలతో జతపడినపుడు గుండె సాధారణస్థితిలో వుంది. ఆల్ఫా–గామా తరంగాలు జతపడినపుడు మాత్రం నాడీకణాల్లో 'అంతర్గత ఊహాత్మకత' వెల్లడయింది. మెదడు లో సంభవించే ఇలాంటి చర్యల వల్లనే మరణ సామీప్య అనుభవాల్లో 'ధవళ కాంతులు', 'మిరుమిట్లు' ద్యోతక మవుతాయన్నారామె. "హృదయ స్పందన లాగిపోయిన వెంటనే, మెదడుకి ఆక్సిజన్ చాలా తక్కువగా అందుతుంది. దాని ఫలితంగానే అలాంటి అనుభవాలు కలుగుతాయ"ని కూడా ఆమె స్పష్టం చేసారు.

భూశాస్త్రాల్లో ప్రొఫెసర్‌గా వున్న ఆస్ట్రేలియా శాస్త్రవేత్త జాన్ హేప్స్ కూడా బోర్జిగిన్‌ను సమర్థించారు. "మెదడనేది ఒక అద్భుత యంత్రం. దానికి ఆక్సిజన్ సరఫరాను తగ్గిస్తే అన్నిరకాల భ్రాంతులూ పుట్టుకొస్తాయి." అంటారు. యూనివర్సిటీ ఆఫ్ వెస్ట్ ఆఫ్ ఇంగ్లాండ్‌లో సైకాలజీ ప్రొఫెసర్ గా వున్న డాక్టర్ సుషాన్ బ్లాక్ మోర్ మరణసామీప్య అనుభవాలపై విశేషంగా పరిశోధించారు. "ఆరోగ్యవంతమైన మెదడు ఎలా పనిచేస్తుందో, సాధారణ నాడీ స్పందనలు కరువై, ఉక్కిరిబిక్కిరికి లోనయ్యే మెదడు ఎలా వుంటుందో మనకు తెలుసు. ఆ ఉక్కిరి బిక్కిరిలో అది తన ఉనికిని పనితీరును ప్రదర్శించటానికి తార్కికమైన మరోమాదిరి ప్రపంచాన్ని ఏర్పరుస్తుంది." అని ఆమెవివరిస్తారు. కనుక, శాస్త్రీయకోణంలోంచి పరిశీలించినపుడు మరణసామీప్య అనుభవాలు మెదడు, నాడీవ్యవస్థలలో ఏర్పడే వైపరీత్యం కారణంగా వస్తాయి. అవి వాస్తవాలు కానేకావు, కేవలం సాంస్కృతిక అంశాల్లోంచి పుట్టుకొచ్చిన భ్రాంతులు మాత్రమే.

ఇక్కడ మరో అంశం గురించి చెప్పుకోవాలి. అబ్దుల్ అజీజ్ "చనిపోయి బ్రతకటం సైన్సుకు కూడా అంతుబట్టని వింత" అని మీడియా వ్యాఖ్యానించటం సైన్సుపట్ల అవగాహన లోపించటం వల్లనే. చనిపోయిన వారెవరూ బ్రతకరు. మెదడు మరణించటమే నిజమైన మరణం. నాడి అందకపోవటం, గుండె ఆగిపోవటం, శరీరం చల్లబడటం లాంటివి మెదడు చనిపోని సందర్భాల్లో కూడా కొన్ని కారణాలతో జరగవచ్చు. ఆ పరిజ్ఞానంలేక, అలాంటి లక్షణాలతో చావును నిర్ధారించటాన్ని ఆధునిక వైద్యశాస్త్రం అంగీకరించదు.

అబ్దుల్ అజీజ్ విషయంలోనూ, బత్తుల మల్లారెడ్డి విషయంలోనూ అలాంటి తప్పుడు నిర్ధారణే జరిగింది. గుండె ఆగటం వల్ల వారు చనిపోయారనుకున్నారు. కానీ, వారి మెదడు చనిపోలేదు. వారి జీవకణాల్లో వుండే ప్రోటోప్లాజమ్ విచ్ఛిన్నం కాలేదు. వారిని అటునిటూ కదిలిస్తూ గుండె చుట్టూ వుండే డయాఫ్రం పొరకు,

నియంత్రిత కండరాలకు తగిన ఒత్తిడి కలగటం వల్ల తిరిగి గుండె కొట్టుకోవటం మొదలై వారు స్పృహలోకి రావటం జరిగింది. ఇలాంటివి జరుగుతూనేవుంటాయి. అమెరికాలోని ప్రఖ్యాత సినీ నటుడు పీటర్ సెల్లర్స్ 1963లో 7సార్లు ఇలాగే మరణించి, ఎలక్ట్రానిక్ పేస్‌మేకర్ వినియోగంతో మళ్లీ బ్రతికాడు. 1968లో వసంత బాబూరావు అనే వ్యక్తి ఛాతినొప్పితో, పూనేలోని ఒక నర్సింగ్ హోమ్‌లో చేరాడు. కొద్దిసేపటికి గుండె ఆగి మరణించాడని వైద్యులన్నారు. అతన్ని కారులో ఎక్కించి, గంట ప్రయాణించ గానే, ఆ గతుకుల రోడ్డు ఊపులవల్ల, అతని చేతులు, కాళ్లు, కదలి, కళ్లు తెరిచాడు. రెండురోజుల తర్వాత ఆస్పత్రి నుంచి పూర్తి ఆరోగ్యంతో ఆయన ఇంటికివెళ్లాడు. ఇలాంటివి ఇంకా చెప్పుకోవచ్చు.

ఒకవ్యక్తి చావును నిర్ధారించే ప్రాచీన చిట్కా విధానాల నుంచి మనం బయటపడాలి. 'మెదడు మరణాన్ని' వైద్యులు ధృవీకరించిందాక మనం తొందరపడటం తగదు. అలాగే, చావుచుట్టూ అల్లుకొనివున్న, ప్రాచీన మతగ్రంథాలు ఆనాటి అజ్ఞానంతో అల్లిన, అశాస్త్రీయ ప్రమాణాల నుంచి మనం బయటపడి, ఆధునిక విజ్ఞానాన్ని ఆశ్రయించాలి. ఆత్మలు, వాటి ప్రయాణాలు, పూర్వ, పునర్జన్మలు, స్వర్గ, నరకాలు, కర్మఫలాలు వంటి కాల్పనిక, అజ్ఞానపు భావజాలం నుంచి మనల్ని మనం విముక్తిగావించు కోవాలి. వాటిని నమ్మించటానికి చెప్పే పురాణ కథలు, ఇపుడు తెలుగునాట వస్తున్న 'యమగోల', లాంటి వినోదాత్మక సినిమాలకంటే విలువైనవి కావు.

నిరంతరం ప్రగతిపథంలో దూసుకెళ్తున్న వైజ్ఞానిక పరిశోధనలను తక్కువచేసి చూపటానికి, కుహనా సైన్సు ప్రచారకులు "విజ్ఞాన ఫలాల"ను ప్రజలకందకుండా చేయటానికి ఆధునిక యెహోవాలవుతున్నారు. తస్మాత్ జాగ్రత్త !






**ఆ మధ్య 'సెవన్త్ సెన్స్' అని ఒక సినిమా వచ్చింది. తమిళం నుంచి తెలుగులోకి అనువదించబడిన ఆ సినిమా చూసిన ఒక మిత్రుడు ఒక ప్రశ్న వేసాడు. "అందులో విలన్ కంటి చూపుతోనే ఎదుటివారిని తన వశంలోకి తెచ్చుకొని, తాను కోరుకున్నట్లు వారిని ఉపయోగించుకుంటాడు. అలాంటి వశీకరణ విద్యలు పూర్వం చాలావుండేవట! వాటిని ఎలా పొందాలో కూడా ఆ సినిమాలో వివరించారు. అవన్నీ అబద్ధమంటారా?"**

ఆ మిత్రుని అమాయకప్రశ్నకు నవ్వొచ్చింది. 'అది సినిమా బాబూ! కథను రక్తిగట్టించటానికి ఎన్ని కల్పనలనయినా జోడిస్తారు." అన్నాను.

"అంటే, అసలు వశీకరణ శక్తులే లేవంటావా?" అన్నాడు ఉక్రోషంగా. 'ఉండవు' అన్నాను తాపీగా. "అయితే, ఈ ప్రకటన చూడు" అన్నాడు. మిత్రుని చేతిలోని డైలీపేపర్‌ను అందుకొని చూసాను.

"వశీకరణ ఉంగరం" అన్నది శీర్షిక. ఇష్టపడ్డ వారిని లొంగదీసుకోవటానికి దీనిని ధరిస్తే చాలట! ఆ ప్రకటన చదివాక, అదెంత మోసపూరిత ప్రకటనో వివరించటానికి, ఆయన్ని ఒప్పించటానికి 2 గంటలు పట్టింది. ఈ సంఘటన ఎప్పుడో రెండుమూడేళ్ల నాటిది. ఇలాంటి ప్రకటనలు ఇప్పుడు పేపర్లలోనేకాదు, సోషల్ మీడియా

లోనూ వరదలా వచ్చిపడుతున్నాయ్. వాళ్ల ఘరానా మోసం ఎందరో అమాయకుల్ని చిత్తుజేస్తున్నదన్న వార్తలూ వస్తున్నాయ్.

తనకు నచ్చిన దాన్ని స్వంతం చేసుకోవటానికి, అనుకున్న వాటిని సాధించటానికి స్వశక్తిమీద విశ్వాసం లేనివారు ఇలాంటి ప్రకటనల వెంటబడి ఆగమాగమవుతుంటారు. అలౌకికశక్తులుంటాయని, వాటి ప్రభావం వల్లనే మంచీచెడులు మనిషి జీవితంలో కల్గుతుంటాయని నమ్ముతుంటారు. ఆ శక్తుల దుష్టత్వాన్ని తగ్గించాలంటే, మన ప్రాచీన మహర్షులు రూపొందించిన మంత్రతంత్రాలే శరణ్యమని, వాటికి లొంగి పోతుంటారు. ఇటీవల కాలంలో మళ్లీ మొదలయిన చెత్త ప్రకటనలెన్నో మీడియాలో జనాన్ని ఆకర్షిస్తూ వుండటమే అందుకు నిదర్శనం.

వశీకరణను ఒక విద్యగా భావించారు పూర్వీకులు. 64 కళల్లో దీన్ని 'వశ్యము' అని పేర్కొన్నారు. ప్రాచీన పురాణకథల్లో, జానపదగాథల్లో, ఎదుటవ్యక్తిని తనకు వశమయ్యేలా చేయటానికి పలు ప్రయోగాలకు పాల్పడటం కన్పిస్తుంది. వాటిల్లో ముఖ్యమైనవి- 1. మంత్రప్రయోగం, 2. తంత్రచర్య, 3. ఆహారంలో దేన్నైనా తినిపించటం, 4. కళ్లతో ఆకర్షించటం, 5. ఆభరణాలతో, పూలతో లోబర్చుకోవటం వగైరా.

* * *

వరలక్ష్మికి పెళ్ళీడు వచ్చింది. ఇంట్లో వాళ్లు ఆమెకు బావవరస అయిన వ్యక్తికిచ్చి పెళ్లి చేసారు. ఇద్దరు పిల్లలు పుట్టాక, భర్త తనను పూర్వంలా ప్రేమించటం లేదని వరలక్ష్మి అనుమానించింది. రోజూ ఈ విషయమై ఏదో నెపంతో భర్తను ఏదో ఒకటి అంటూవుంది. ఒకరోజు పక్కింటావిడ వచ్చి వరలక్ష్మితో పిచ్చాపాటి మాట్లాడుతున్నప్పుడు, తనభర్త గురించి ఆమెతో చెప్పింది. 'అలాగా! లక్ష్మీ ! మీ ఆయనకెవ్వతో మందు పెట్టి వుంటుంది. అందుకే, నిన్ను చులకన చేస్తున్నాడు. ఆమె ఎవరో తెలుసుకుని, ఆ మందును కక్కించి కాపురం నిలుపుకో" అని ఒక ఉచిత సలహా బాంబు విసిరింది పక్కింటావిడ.

ఆ మాటలు నమ్మింది వరలక్ష్మి. రాత్రి అలసి వచ్చిన భర్తను నిలదీసి "అదెవ్వతో చెప్ప"మంది. భర్తకి మతిపోయింది. అలాంటి పరస్త్రీ సంబంధం ఏదీలేదని ఎంతచెప్పినా వరలక్ష్మి సమ్మతించలేదు. "మందు కక్కాల్సిందే"నని పట్టుబట్టింది. తెల్లవారాక, ఆ పక్కింటావిడను సంప్రదించి, మందుకక్కించే నిపుణుడయిన మంత్రాల వీరయ్యను

పిల్పించింది. బలవంతాన భర్తకు, వీరయ్య ఇచ్చిన కటిక కషాయాన్ని తాపించి వాంతి చేయించింది. ఆ వాంతిలో, నల్లగా కన్పించే చిన్న తునకను చూపి, “ఆ, అదేమందు” అన్న వీరయ్య మాటలు ఆమెకి తృప్తినిచ్చాయి.

‘హమ్మయ్య!’ అని నిట్టూరుస్తూ ‘ఇకపై ఏ ఆడది ఏం పెట్టినా తినకండి’ అంటూ భర్తను హెచ్చరించింది. నీరసంగా తలూపుతున్న భర్త జేబులోంచి రూ. 1000/- నోటు తీసి వీరయ్య చేతిలో పెడుతూ “నా కాపురం నిలబెట్టావయ్యా” అంది. వరలక్ష్మి అమాయకత్వానికి నవ్వుకుంటూ వీరయ్య నిష్క్రమించాడు. వాంతి చేసుకునే భర్తను పట్టుకునే నెపంతో తన చేతిలోవున్న కరివేపాకు పసరుముద్దను చాకచక్యంగా వాంతిలో జారవిడిచినందుకే వేయి రూపాయలు సంపాదించ గల్గాడు. వరలక్ష్మి నమ్మకమే వీరయ్యకు ఆదాయవనరు.

* * *

ఇప్పుడు చాలావరకు తగ్గివుండవచ్చు గానీ, పదేళ్లక్రితం వరకు చాలా పల్లెటూళ్లలో ఈ ‘మందుకక్కించటం’ వుండేది. ఒకవ్యక్తి దిగులుతో బక్కగా అవుతున్నా, భార్యను కుటుంబాన్ని పట్టించుకోకుండా ఆవారాగా తిరుగుతున్నా, మనోవ్యాధితో బిక్కచూపులు చూస్తున్నా, ఎవరో మందుపెట్టి ఉంటారన్న అనుమానం సహజంగా వచ్చేది. వెంటనే దాన్ని కక్కించే వీరయ్యలను పిల్పించి ఖర్చుపెట్టి తృప్తిపడేవారు. రోగమొకటైతే మందు మరొకటి! అసలు ‘మందుపెట్టటం’ అనేది ఉండదని, ఒకవేళ ఎవరైనా ఆ పనిచేసినా, దాని ప్రభావం 24 గంటల్లో బయటపడుతుందని, కడుపులోకి వెళ్లిన పదార్థం రోజులు, సంవత్సరాల తరబడి అలాగే వుంటూ ఆ వ్యక్తిని వేధించదని తెలియని అనాగరక జనసమూహాల్లో ఇంకా ఈ ‘వశీకరణ విశ్వాసం’ పదిలంగా వుంది. అస్సాం, మణిపూర్ వంటి ఏడు ఈశాన్య భారత రాష్ట్రాల్లోనే కాదు, మన రాష్ట్రాల్లోని గిరిజన గ్రామీణుల్లో కూడా వుందని ఈ రచయిత అనుభవంలోకి వచ్చింది.

## అభిచారవేదం ?

తినే ఆహారంలో, మంత్రించిన మరో ఆహార పదార్థాన్ని కలిపి తినిపిస్తే, ఆ తిన్నవ్యక్తి ‘వశీకరణ’కు లోనవుతాడన్న నమ్మకం అధర్వణవేదకాలంనుంచీ వుంది. ఆ వేదంలో వున్న కొన్ని మంత్రాలు ఇలాంటి అజ్ఞానపూరిత క్రియలకు మహత్తులు ఆపాదించాయి. మూడవకాండంలో ఇలాంటి మంత్రాలున్నాయి. 2వ కాండంలో శత్రునాశనానికి, 7వ కాండంలో శత్రుయజ్ఞ నాశనానికి, మంత్రాలున్నాయి. ఆనాడు

'చేతబడి' వంటి తాంత్రిక క్రియలను 10విధాలుగా విభజించారు. సపత్నబాధనం, వినాశనం, పీడనం, మారణం, వశీకరణం, విద్వేషణం, మోహనం, స్తంభనం, శాటనం, ఉచ్ఛాటనం- వీటినన్నింటినీ అభిచారికాహోమాలనేవారు. 'అభిచారిక విద్యయే అధర్వవేద ముఖ్యలక్షణం' అని మహామహోపాధ్యాయ కొమర్రాజు లక్ష్మణరావు లాంటివారు స్పష్టం చేసారు. వశీకరణం పేరుతో కొన్ని సంస్కృతమంత్రాలను కల్పించి, జనాన్ని నమ్మించి, వాటికి లేని మహత్తును ఆపాదించి భూతవైద్యానికి దారి చూపారు ఆనాటి వేదమంత్రద్రష్టలు. "బ్రాహ్మణ గౌరవమునకు గాని, రాజుల జయమునకు గాని, భార్యను సంపాదించుకొనుటకుగానీ, అభిచారము ఎట్లు ఉపయోగింపవలెనో సూత్రకారులు పద్ధతులేర్పర్చిరి. ఇట్లు క్రమక్రమముగ నీ మారణవిద్య (అవిద్య?) అజ్ఞానులలో పెరిగి యిప్పటి భూతవైద్యులకు తిండి బెట్టినది" (లక్ష్మణరాయ వ్యాసావళి, ద్వితీయసంపుటం పేజి: 266)

భూతవైద్యులు ఇప్పటికీ తమవృత్తిని వీడటం లేదు. పైగా, కాలంతోపాటు మారుతూ కంప్యూటర్ వినియోగంతో తమ మంత్రవిద్యను లాభసాటి వ్యాపారంగా చేసుకోగల్గుతున్నారు. పల్లెల నుంచి ఢిల్లీలాంటి మహానగరాలకు సైతం విస్తరించి కార్పొరేట్ సంస్థలస్థాయిలో ప్రచారం నిర్వహించుకోగల్గుతున్నారు. ప్రాచీన సంప్రదాయాలకు మళ్లీ 'స్వర్ణయుగం' కల్పిస్తున్న నేటి పాలకులు అందిస్తున్న ప్రోత్సాహంతో తమ వ్యాపారాన్ని రాణింపచేసుకుంటున్నారు.

ఈ మంత్రవిద్యావ్యాపారులకు వైజ్ఞానిక స్పృహలేని కోట్లాది జనులే వినియోగదారులు. హైందవసంస్కృతి వారికి రక్షాకవచం. మంత్రానికి ఆ సంస్కృతిలో పూజ్యభావన ఉంది. "మంత్రాధీనం జగత్సర్వం" అని ఇప్పటికీ ఆ సంస్కృతీ ప్రియులు నమ్ముతుంటారు. 'నిత్యజీవన సమస్యల పరిష్కారం మంత్రాల్లోనే ఉంది' అన్న నమ్మకం ఇంకా బలంగా వుండబట్టే, ఏటేటా దేశంలో ఆగమ పాఠశాలలు పెరుగుతున్నాయి. పురోహితులను తయారుచేసే 'ఆచార్యకులా'లను, 'గురుకులాశ్రమాల'ను దేశమంతటా ఏర్పరుస్తూ శాస్త్రసాంకేతిక విద్యలకు పోటీగా మంత్రవిద్యకు పెద్దపీట వేస్తున్నారు. పౌరోహిత్య కోర్సులను దేశంలో విశ్వవిద్యాలయాల్లో పెడుతున్నారు. **'ఎంతవారలయినా మంత్రదాసులే' అనే పరిస్థితిని దేశమంతటా కల్పించే వాతావరణం రాబోతున్న సూచనలు కన్పిస్తున్నాయి. వైజ్ఞానిక దృక్పథానికి భరతవాక్యమూ, వైదిక ఆలోచనారీతికి నాందీవాక్యమూ పలుకుతున్న హిందూత్వపాలనలో ఇప్పుడు మనమున్నాం.**

నేటి విద్యావ్యవస్థలో సామాజికస్పృహకు చోటు తగ్గిపోతున్నది. చదువు పరమార్థం సంపాదన అవుతున్నది. సినీమాయాజాలం యువతరాన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తూ 'ప్రేమ'కోసం తహతహలాడేలా చేస్తున్నది. నచ్చిన వారిని స్వంతం చేసుకొనే మార్గాలు తెలియనివారు, 'వశీకరణ' ప్రకటనలకు లోబడుతున్నారు. "ఒక సారి 'ట్రై' చేద్దాం. పోయేదేముంది?" అనుకొంటున్నారుగానీ, అవన్నీ మోసాలనే నిశ్చయానికి రావటం లేదు. ఇంగిత జ్ఞానం ఇసుమంతైన వుండడంలేదు.

## "మంత్రంకాదు మోసం"

రాజేష్ సరిగ్గా అలాంటి ప్రకటన చదివి ఎగిరి గంతేసాడు. తాను ప్రేమిస్తున్న 'సౌజన్య' తనకు దక్కాలి. ఆమె అందంతోపాటు, ఆస్తికూడా తన వశమైతే తన జీవితం రంగులమయమవుతుంది. ఆ ఉద్దేశంతోనే 'వశీకరణ మంత్రవేత్త'ని ఆన్‌లైన్‌లో సంప్రదించాడు. రూ. 5000/-లను పంపించాడు. మంత్రవేది చెప్పిన మంత్రాన్ని, చేయాల్సిన తంతును సాధన చేయటం మొదలెట్టాడు.

**"ఓం భగవతీ భగభాగ దాయినీ! సౌజన్యాం మమవశ్యం కురు, కురుస్వాహా!"**

ఇదీ మంత్రం. గురువారం రోజు చేతిలోకి చిటికెడు ఉప్పు తీసుకొని, పై మంత్రాన్ని నిష్టతో 7 సార్లు జపించి, అలా మంత్రపూతమైన ఆ ఉప్పును, సౌజన్య తినే తాగే ఏ పదార్థంలోనైనా కలిపితే చాలు. దాన్ని తిన్నా తాగినా వెంటనే సౌజన్య మారిపోతుంది. రాజేష్‌కు వశమై అతనిపట్ల ఆకర్షితురాలవుతుంది.

ఒక గురువారం సౌజన్యతో కలిసి రెస్టారెంట్‌కి వెళ్లాడు రాజేష్. సాంబార్ ఇడ్లీకి ఆర్డరిచ్చాడు. 'సెల్ఫ్‌సర్వీస్' బోర్డు చూపించి, తానే తెస్తానని కౌంటర్ దగ్గరకెళ్లి, సాంబారు గిన్నెలో తన 'మంత్రించిన' ఉప్పును కలిపి తెచ్చి, ఆమెతో యిడ్లీ తినిపించాడు. ఉప్పు ఎక్కువయిందని ఆమె అంటే, సర్దిచెప్పాడు. వారంరోజులు గడిచాయి. అయినా సౌజన్య తన వశం కాలేదు. తనతో ఎప్పట్లాగే స్నేహంగా వుంటోంది తప్ప, ప్రేమతో దగ్గర కాలేదు. నెలగడిచినా ఇదే పరిస్థితి. అప్పటికి గానీ, తాను మోసపోయిన విషయం ఆ సాఫ్ట్‌వేర్ రాజేష్‌కి అర్థం కాలేదు.

ఒక్క రాజేషే కాదు, అలాంటి వారెందరో వున్నారు. వశీకరణ మంత్రాలు, తాయెత్తులు, ఉంగరాలు, కడియాలు, లాకెట్లు, నుదుటి బొట్లు, పాపిటబొట్లు, గాజులు, రంగుదారాలు గురించి ప్రకటనల్లో చూసి అమాయకంగా వారు మోసపోతున్నారు. ఆ ప్రకటన యిచ్చేవారి ఫోన్ నెంబర్, ఇ-మెయిల్ తప్ప, ఆఫీస్ అడ్రస్‌గానీ, అమ్మే

సంస్థ/వ్యక్తి పేరుగానీ ప్రకటనలో కన్పించదు. 'అదే నేటి వ్యాపారరీతి' అని సరిపెట్టుకుంటున్నారు వినియోగదారులు. మోసపోయాక, ఆ సంస్థ/వ్యక్తి పై ఫిర్యాదు చేయటానికి కూడా తగిన ఆధారాలు దొరకని వ్యాపారరీతి అది.

అంతేకాదు, ఆ మంత్రాల మోసగాడు ఒకరికి చెప్పిన పద్ధతి మరొకడికి చెప్పడు. ముందే అనేక వశీకరణరీతుల్ని జాబితాగా కూర్చుకుని వుంటాడు. మరికొన్ని చూడండి-

1. ఎవరినైనా వశీకరణ చేసుకోవాలనుకుంటే, 5 లవంగాలను తీసుకో. ఆ లవంగాలకు 'తలలు' వుండాలి. వాటిని నీ చేతితోనే వేరుచేయి. అలా చేసేటపుడు ఫలానా మంత్రాన్ని 108 సార్లు జపించు. ఆ తర్వాత ఆ లవంగాలను నువ్వు వశపర్చుకోవాలన్న వ్యక్తితో తినిపించు. తప్పక వారు వశమవుతారు.

2. ఎత్తైన అరుగుమీద కూర్చుని ఫలానా మంత్రాన్ని 108 సార్లు జపించు. అలా జపించేటపుడే, ఒక ప్రమిదను వెల్గించి, దాని వత్తిని కాల్చి నుసి చేసి, కాటుకగా మార్చి, నచ్చిన పువ్వును ఒకదాన్ని తీసుకుని, ఆ కాటుకను పువ్వులోని ఒకదళానికి రాసి, ఆ పువ్వును ఎవరికివ్వాలో వారికివ్వు. వాసన చూడమని చెప్పు. అలా వాసన చూసిన వెంటనే, ఆ అమ్మాయి నీవెంటపడుతుంది. ఒకవేళ ఆ పువ్వును ఆమె తీసుకోకపోతే, కేవలం ఆమెకు చూపినా సరిపోతుంది. ఆమె చూసాక, ఆ పువ్వును తలక్రిందులుగా వుంచాలి. ఇది సాధ్యం కాకపోతే, మంత్రసహితంగా తయారుచేసిన కాటుకను ఆ అమ్మాయి తొడుక్కునే చీరకో, చున్నీకో అంటించినా ప్రయత్నం ఫలిస్తుంది.

ఇలా వందలాది చిట్కాలు మంత్రగాళ్ల వద్ద సిద్ధంగా వుంటాయి. అవన్నీ నేటితరం తేలిగ్గా ఆచరించే రీతిలో వుంటాయి.

పూర్వం ఈ 'వశీకరణ' అనేది చాలా క్లిష్టప్రక్రియగా వుండేది. బోలెడన్ని మంత్రాలు, పసుపుకుంకుమలు, మేకల, కోళ్లబలులు, ముగ్గులు, కపాలాలు, స్మశానాలు... మొదలయినవన్నీ ఆ ప్రక్రియలో భాగాలే. 'వశీకరణ'కోసం ఎవరైనా తాంత్రికుల్ని సంప్రదించవలసిందే. తంతు ముగిసాక, ఇచ్చే ప్రసాదాన్ని తిన్పించటమో, లేదా మంత్రవిద్యతో వశపర్చుకోవలసిన వ్యక్తిని ఆకర్షించవలసిందే. కాలక్రమంలో, రంగుదారాలు, తాయెత్తులు, ఉంగరాలు వంటివి వచ్చాయి.

ఆధునికం అన్పించే 'హిప్నాటిజం' కూడా ఒక వశీకరణ విద్యే. ఇది పూర్వం నుంచీ ప్రపంచమంతటా వ్యాప్తిలో వుంది. మాటలు /మంత్రాలు ద్వారా లేదా నిశ్చల /

కేంద్రీకృతదృష్టి ద్వారా, వ్యక్తిని సమ్మోహపరచి, సూచనలిచ్చే వ్యక్తి తనవశంలోకి రప్పించటమే యిందులో వుంటుంది. మొన్నమొన్నటి వరకు, హిప్నాటిజాన్ని సైన్సు అనుకున్నారు. కానీ, అందులో మెజారిటీభాగం నేడు సూడోసైన్సుగా భావించబడుతోంది.

వశీకరణ, మంత్రవిద్యలను కూడా సైన్సుగా ప్రచారం చేసుకోవటం ఇపుడు మామూలైపోయింది. జ్యోతిష్యం, వాస్తు, న్యూమరాలజీ, హస్తసాముద్రికం... మొదలయినవాటిని కూడా, వాటితో వ్యాపారం చేసేవారు సైన్సు అనే పిలుస్తున్నారు. 'సైన్సు' అనే పదానికున్న మహత్తర నాణ్యతను వారు మలినపరుస్తున్నారు. అవన్నీ సూడోసైన్సు (కుహనాశాస్త్రాలే)లే. పరిశోధనకు నిలవలేని పొట్టకూటి విద్యలే. వీటన్నిటికీ నీడనిస్తోంది మత సంస్కృతే.

క్రైస్తవంలో కూడా ఒకప్పుడు ఇలాంటి కుహనా తంత్రవిద్యలు వుండేవనటానికి బైబిలు సాక్ష్యమిస్తోంది. అయితే, అవన్నీ సైతాను విద్యలు అని త్రోసిరాజన్నారు. ఇస్లాంలోనూ, కొన్ని 'సూరా'లను మంత్రాలుగా చేసి 'వశీకరణ' రంగులద్దారు. వాటితో వ్యాపారం చేస్తున్నవారూ వున్నారు. అయితే ఈ వ్యాపారం ఇండియాలోనే జరుగుతోంది. కొన్ని ఇస్లాంశాఖలు ఈ పరిస్థితిని ఖండిస్తున్నాయి కూడా.

## వశీకరణ వేరు, వ్యక్తిగత ఆకర్షణ వేరు

శ్రీశ్రీ కవిత్వం చదివి, చాలామంది అతనికి అభిమానులయ్యారు. ఒకప్పుడు గద్దర్ పాటలకీ అలాంటి అభిమానులు వేలల్లో వుండేవారు. ఆ ఆకర్షణ ఆయా కళారూపాలవరకే పరిమితం. శ్రీశ్రీ, గద్దర్‌లు ఏది చెపితే అది నమ్మటం, ఏది చేయమంటే దాన్ని గుడ్డిగా అనుసరించటం ఆ ఆకర్షణలో వుండదు. వశీకరణ అనేది ఒక మిథ్యా ప్రక్రియ. మంత్రాలకు మహత్తులుంటాయని చాటటానికి అది నిదర్శనంగా వుంది. మనిషిపై మంత్రం పెత్తనం చేయగలదని అది చాటుతుంది. వాస్తవానికి, వశీకరణ వస్తువులకుగానీ, తంతులకు గానీ అటువంటి శక్తి ఏదీ వుండదు.

ఇంటర్నెట్, సోషల్ మీడియా, ప్రింట్ మీడియా వంటి ప్రచార వాహికల ప్రకటనాడంబరాలకు లోబడి తనపై తనకు వుండాల్సిన విశ్వాసాన్ని, స్థైర్యాన్ని కోల్పోయి ఇలాంటి అశాస్త్రీయ విధానాలకు సాగిలబడటం అంటే మన అజ్ఞానాన్ని చాటుకోవటమే. ఇవి చేస్తున్న హానిని గుర్తించి సమాజాన్ని చైతన్యపరచటమే నేటితరం కర్తవ్యం.



# పాదపూజలు : మంచికా? చెడుకా?




"హాయ్! తాతయ్యా! ఎలా వున్నావ్!" అంటూ తుళ్ళుతూ వచ్చి చేయిపట్టుకుంది సునీత. వీపు మీద వున్న సంచిని దించుతున్న మనుమరాలిని చూస్తూ 'బాగానే వున్నానమ్మా!' అంటూ చిన్నగా నవ్వాడు కానీ, తాతయ్యకు మనుమరాలి పలకరింపు నచ్చలేదు. నాలుగైదేళ్ళ తర్వాత చూట్టానికి వచ్చినపుడు, పెద్దలనిలాగేనా గౌరవించేది? రోజూ చూసే స్నేహితుల్ని పలకరించినట్టు, పెద్దల్ని కూడా 'హాయ్!' అంటూ పలకరించటమేమిటి? చిన్నా పెద్దా తేడా తెలియకుండా పోతోంది ఈ తరానికి. తనవంటి పెద్దవాళ్ళను దర్శించుకునేటపుడు కనీసం వంగి, పాదాలకు నమస్కరించే సంస్కారం కన్పించడం లేదు. పెద్దలకు విలువివ్వాలని, వారు చెప్పినట్లు నడుచుకోవాలని, వారి అలవాట్లు సంప్రదాయాల్లోని ఘనతను గుర్తించాలని ఇప్పటి తరానికి చెప్పేవారేరీ?

మనుమరాలితో ముచ్చటించడం మరచి తాతయ్య ఇలా ఆలోచనల్లో పడిపోయాడు. ఇలాంటి తాతయ్యలు, తల్లిదండ్రులు ఇప్పటికీ చాలామంది మన ఇరుగూ పొరుగున కన్పిస్తుంటారు. పెద్దలుగా తమను గుర్తించాలని, అలా గుర్తించినట్లు, తెలిపే క్రియలను నేటి తరం ప్రదర్శించాలని వారు కోరుతుంటారు. అలా జరక్కపోతే, తాము కట్టుకున్న సంప్రదాయ సౌధాలన్నీ కూలిపోతున్నట్లు చాలా బాధపడుతూ, ఆ బాధను తమతరం వారి ముందు వెళ్ళబోసుకోవడం కూడా చూస్తుంటాం.

'పెద్దలను గౌరవింపుము' అని చెప్పడంలో తప్పులేదు. ఒక తరం మరో తరాన్ని ఉత్పత్తి చేయటం ప్రాకృతిక ధర్మం. కన్న సంతానాన్ని పెంచి పెద్దచేస్తూ, తెలియని వాటిని తెలుపుతూ, ప్రయోజకులుగా తీర్చిదిద్దుతూ, ఎన్నో కష్టాలకోర్చి తమ సుఖాలను త్యాగం చేస్తూ వుండే తల్లిదండ్రులు, పెద్దలు తప్పక గౌరవించదగినవారే. అలాగే, విద్యాబుద్ధులందించే గురువులు సైతం గౌరవనీయులే. అందుకే, ప్రపంచంలోని దేశాలన్నింటా, వారిని గౌరవించే కొన్ని పద్ధతులు ఏర్పడ్డాయి. కొందరు తలను మాత్రమే వంచి వినయాన్ని తెలిపితే, మరికొందరు నడుం వరకు వంగి సలాం చేస్తారు. కొందరు చేతులు జోడించి నమస్కరిస్తే, కొందరు ఒక చేతిని రొమ్ముపై వుంచి వంగి నమస్కరిస్తారు. రెండు చేతులతో, అవతలివారి, రెండు చేతులను పట్టుకునేవారు కొందరైతే,ఒక చేత్తోనే ఆ పనిచేస్తూ చేతిని ఆడించేవారు మరికొందరు. ఇలా ప్రాంతాన్ని బట్టి, సంస్కృతిని బట్టి, మతాచారాలను బట్టి, ప్రపంచమంతటా పలురీతుల్లో 'గౌరవింపు' వ్యక్తమవుతోంది. కానీ, 'పాదాభివందనం'గా చెప్పబడే కాళ్ళకు మొక్కే ఆచారం భారతదేశంలోని 'హైందవ సంప్రదాయం'లో మాత్రమే వేల సంవత్సరాల నుంచీ వుంది. ఆ సంప్రదాయం పరమ పవిత్రమైనదిగా, గౌరవింపుల్లో అత్యంత శ్రేష్టమైనదిగానే కాక, శుభకరమైనదిగా, మహిమాన్వితమైనదిగా ప్రశంసించబడుతూ వుంది. దానికెందుకింత ప్రాధాన్యత వచ్చింది, అలాంటి గౌరవింపు నిజంగా శ్రేష్టమైనదేనా, ఆ సంప్రదాయంపై నేటికీ జరుగుతున్న ప్రచారం వెనుక ఏ వాస్తవాలున్నాయ్, మొదలైన విషయాలు ఇప్పుడు చర్చనీయమే.

హైందవ సంప్రదాయాలన్నీ మౌలికంగా బ్రాహ్మణ సంప్రదాయాలే. ఒక బ్రాహ్మణుడు పుట్టిన దగ్గరనుండీ, మరణించే వరకు, ఏఏ వయసులో/సమయాల్లో ఏఏ పనులను ఎలా చేయ్యాలో చెప్పడానికి రెండు మూడు వేల సంవత్సరాల నాడే సాహిత్యం పుట్టింది. పలురకాల స్మృతులు, గృహ్య, ధర్మసూత్రాలు, శాస్త్రాలు ఆనాటి జనజీవనాన్ని తమకు ప్రయోజనకరమైన రీతిలో నిర్దేశించటానికి వాటి రచయితలు ప్రయత్నించారు. కొన్ని వాస్తవాలు కొందరికి మింగుడు పడకపోవచ్చుగాని, ఆ సాహిత్యకారులంతా, దాదాపు, ఒకే భావజాలాన్ని, అగ్రవర్ణ ప్రయోజనాల పరిపూర్తికి వీలుగా అక్షరీకరించారు. పైగా, ఆ భావజాలమంతా దైవప్రసాదితమని కూడా వక్కాణించి, మరెవరూ ప్రశ్నించవీలులేనిదిగా మార్చేసారు. ఎవరైనా ప్రశ్నిస్తే, వారిని దైవద్రోహులుగా, పాపచింతనులుగా, దుష్కర్ములుగా చిత్రించి, జనం చీదరించుకునేటట్లు ప్రచారంగావించారు. ఆ బ్రాహ్మణ భావజాల ఆధిపత్యమే నేటికీ భారతదేశంపై పెత్తనం చేస్తూ, దాన్ని మార్చాలనుకునేవారిని సైతం పలు కడగండ్లకు గురిచేస్తోంది.

ఇంత బలంగా పాతుకొని ఉన్న ఆ భావజాలానికి జన్మస్థలమేది? దానికి కారకులెవరు? వారాశించిన ప్రయోజనాలేమిటి? అనే సందేహాలకు జవాబులు దొరికితే, బ్రాహ్మణ సంప్రదాయాలపై ఒక అవగాహన ఏర్పడుతుంది.

ఆర్యులు విదేశీయులు కారు, అనే వాదన కంటే, మధ్యాసియా నుంచే వారు పశుపాలకులుగా, భారతదేశానికి వలస వచ్చారనే వాదనకి బలమైన రుజువులు దొరికాయి. అలా వలస వచ్చినవారు తమ పశుపాలక వృత్తి కోసం, జీవనం కోసం నదీతీరాల నివాసాలను ఏర్పరుచుకున్నారు. అక్కడ ఏ లోటు లేకుండా జీవించే దశలోనే, వారిలోని సాహిత్య సృజన బయల్పడి, శ్రుతులుగా, స్మృతులుగా, ఆరణ్యకాలుగా, బ్రాహ్మణాలుగా, చివరికి ఉపనిషత్తులుగా రూపుదాల్చింది. జీవన విధానానికి అవసరమైన విధులు, నియమాలు, ఆచారాలను నిర్దేశించే గృహ్య, కల్ప, ధర్మసూత్రాలు వచ్చాయి. వాటిని అమల్లోకి తెచ్చి, ఆచరించే ప్రాంతాన్నే ప్రపంచంలో అత్యుత్తమ దేశంగా కీర్తించుకున్నారు. మనుస్మృతి ఏమంటుందో చూడండి –

**"సరస్వతి దృషద్వత్యోర్దేవ నద్యోర్య దంతరమ్**
**తం దేవ నిర్మితం దేశం బ్రహ్మావర్తం ప్రచక్షతే" (2–17)**

సరస్వతీ, దృషద్వతీ (చేతాంగ్) నదుల మధ్య ఏర్పడిన సస్యశ్యామల దేశమే బ్రహ్మావర్తం.

**తస్మిన్ దేశే య ఆచారః పారంపర్య క్రమాగతః**
**వర్ణానాం సాంతరాళానాం స సదాచార ఉచ్యతే (2–18)**

ఆ బ్రహ్మావర్త దేశంలో బ్రహ్మణాది అగ్రవర్ణాలకు, సంకీర్ణజాతులుగా వున్న ఇతరులకు ఏ ఆచారం వంశపారంపర్యంగా వస్తుందో అదే 'సదాచారం' అనబడుతుంది.

**కురుక్షేత్రం చ మత్స్యాశ్చ పంచాలాశ్శూరసేనకాః**
**ఏష బ్రహ్మర్షి దేశోవై బ్రహ్మావర్తాదనంతరః (2–19)**

పైన చెప్పిన బ్రహ్మావర్త దేశానికి ఆనుకొని వుండే, కురుక్షేత్రం, మత్స్యదేశం, పంచాలం, శూరసేనకం అనే దేశాలన్నింటిని కలిపి బ్రహ్మర్షి దేశమంటారు.

**ఏతద్దేశ ప్రసూతస్య సకాశాదగ్రజన్మనః**
**స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః**

ఈ దేశంలో (బ్రహ్మర్షి దేశంలో) పుట్టిన బ్రాహ్మణుల ద్వారా భూమ్మీద మానవులంతా తమ తమ ఆచారాలను నేర్చుకోవాలి.

మనుస్మృతి కారుడు చాలా స్పష్టంగా చెప్పాడు - బ్రహ్మావర్త, బ్రహ్మర్షి దేశాల బ్రాహ్మణులు ఏఏ ఆచారాలను పాటిస్తున్నారో, వాటిని ఇతర మానవులంతా నేర్చుకొని పాటించవలసి వుంటుంది. వాటినే సదాచారాలనాలి. అంతేగాదు, బ్రాహ్మ ణులు ఎక్కడ పుట్టినా ఈ దేశాలకు చేరుకుని జీవించాలి (2-24), ఇది పవిత్ర భూమి, యజ్ఞభూమి, శూద్రులు మాత్రం తమ ఉపాధి కోసం ఎక్కడికైనా వెళ్ళవచ్చునని కూడా మనుస్మృతి చెప్పింది. అలాంటి 'పవిత్రభూమి' లో ఏర్పడిన ఒక 'సదాచారం' పాదపూజ.




పాదాలకు మొక్కడం అనేది మొదట గురుకులాల్లో మొదలై వుంటుంది. ఎందుకంటే, ఆ 'బ్రహ్మ'దేశాల్లో ఆనాడు గురువుకే ప్రథమ స్థానం వుండేది. ఆ తర్వాతే తల్లిదండ్రులు. బ్రహ్మ అంటే అక్కడ జనపదానికి పెద్ద. అతడే అందరికీ పూజ్యుడు, మార్గదర్శి, సర్వజ్ఞాని, జ్ఞానదాత, గురువు. ఆ గురువే బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు. అతడు నిర్దేశించిన ఆచారాలనే అనుసరించాలి. వాటినే అతని శిష్యులు వల్లెవేసి మరికొందరికి వినిపించేవారు. బ్రహ్మను అనుసరించే బ్రాహ్మణులు వుండాలి. ఋగ్వేదానంతరం సాహిత్యంలో 'బ్రహ్మ'కున్న అర్థంలో మార్పులు వచ్చినా, ఆచార సంప్రదాయాల్లో మాత్రం మరింత కఠినత విధింపబడింది. బ్రహ్మను (గురువులు) నిత్యమూ సేవించే శిష్యులనే బ్రహ్మచారులు అనేవారు. వారికి విధింపబడ్డ నియమాల్లో ప్రధానమైనది గురుపాద సేవ. అపస్తంభ ధర్మసూత్రాల్లో ఈ విషయం స్పష్టంగా వుంది.

**"సదా నిశయాం గురుగ్ం సవేశయేత్తస్య పాదౌ ప్రక్షాళ్య సంవాహ్య" (6-1)**

ప్రతిరాత్రి ఆచార్యుని పాదాలను కడిగి, వాటిని ఒత్తుతూ నిద్రపుచ్చాలట! అంతేకాదు - **"దక్షిణేన పాణినా దక్షిణం పాదమధస్తాదభ్యధిమృశ్య సకుష్టిక ముప సంగృహ్ణీయాత్"(5-21)**

శిష్యుడు తన కుడిచేతితో ఆచార్యుని కుడిపాదాన్ని తీసుకుని, పిక్కల వరకూ ఒత్తుతూ సేవచేయాలి. అలా చేయడం వల్ల "స్వర్గమాయుశ్చేప్సన్"(5-15) స్వర్గం వస్తుంది, ఆయువూ పెరుగుతుందట! ఒక్కరోజు కాదు, ప్రతిరోజూ సూర్యోదయం కాగానే వేదాధ్యయనం కోసం గురువు దగ్గరకు వెళ్ళి ఉపసంగ్రహణం చేయాలి.

"ఉదిత్వేత్యాదిత్య ఆచార్యేణ సమేత్యోపసంగ్రహణమ్"(5-18) ఉపసంగ్రహణం అంటే, ఎడమచేతితో ఎడమకాలిని, కుడిచేత్తో కుడికాలిని తాకుతూ చేసే వందనం. మనుస్మృతి కూడా గురుపాద శుశ్రూష గురించి ఇలా అంది -

"బ్రహ్మారంభే వసానేచ పాదౌగ్రాహ్యౌ గురోస్సదా" (2-71) అధ్యయన ఆరంభంలోనూ, అధ్యయన ముగింపు సమయాన కూడా గురుపాదాలను పట్టుకోవాలి.

పాదాభివందనం, పాదసేవ, పాదపూజలు వగైరాలన్నీ ధర్మాలపేరుతో బ్రాహ్మణీయ సంస్కృతిలో భాగమై, ఆ తర్వాత తల్లిదండ్రులకు, ఇతర పెద్దలకు కూడా విస్తరించాయి. మనుస్మృతి తదితర ధర్మశాస్త్రాల్లో వీటిని మనం గమనించవచ్చు.

కాలం గడుస్తున్నకొద్దీ, గురువులు, పెద్దల పాదాలపైన భక్తి పెరిగింది. ఆ తర్వాత అది పాదరక్షలకు సైతం విస్తరించింది. పాదాలెంత పవిత్రమైనవో, వాటిని రక్షించే పాదరక్షలూ అంతే పవిత్రమైనవన్న భావన ప్రబలింది. ఇందుకు, ఆదికావ్యంగా చెప్పబడే రామాయణంలోని 'పాదుకా పట్టాభిషేకం' ఒక నిదర్శనం.

రాముడు అయోధ్యను విడిచి వనవాసానికి వెళ్ళడం భరతునికి నచ్చలేదు. తిరిగి అయోధ్యకు వచ్చి రాజ్యాన్ని పాలించమని, రాముని కోరతాడు. రాముడు సమ్మతించకపోవడంతో, కనీసం, రాముని పాదుకలనైనా ఇమ్మంటాడు. వాటిని సింహాసనంపై వుంచి పాలిస్తానంటాడు.

**"అధిరోహార్య! పాదాభ్యాం పాదుకే హేమభూషితే**
**ఏతే హి సర్వలోకస్య యోగక్షేమం విధాస్యతః"** (అయోధ్యకాండ, 112వ సర్గ, 21 శ్లోకం)

రాముడు ధరించిన పాదుకలు లోకుల యోగ క్షేమాలను చూడగలవట! చెప్పులకెంత మహత్తునాపాదించారో చూడండి. భరతుని కోరిక మేరకు రాముడు ఆ చెప్పులను తొడిగి విడుస్తాడు. ఆ తర్వాత -

**"స పాదుకే చ భరతః ప్రతాపవాన్**
**స్వలంకృతే సంపరిపూజ్య ధర్మవిత్**
**ప్రదక్షిణం చైవ చకార రాఘవం**
**చకార తే చోత్తమ నాగమూర్ధని" (112 సర్గ - 29 శ్లో)**

"ఈ పాదుకలు మా అన్నగారి పాదాలుగా గౌరవించదగినవి. వీటికి ఛత్రము (గొడుగు) పట్టండి. వింజామరలతో వీచండి. ఈ పాదుకలతోనే రాజ్యంలో ధర్మం

సుస్థిరంగా వుంటుంది". అని తన చుట్టూ వున్న మంత్రులతో, పౌరులతో అంటాడు. పెద్దల పాదాల మీదే గాదు, చెప్పుల మీద కూడా ఇంతటి భక్తి ప్రపత్తులు ప్రదర్శించిన ఘట్టాన్ని బహుశా రామాయణంలోనే మొదటగా చూస్తాం. పాదాలకు, పాదుకలకు ఇంతటి మహత్తు నాపాదించడం కూడా చూస్తాం. రామాయణ కథతో పాటే,




ఇలాంటి భక్తి ప్రపత్తులు కూడా జనంలోకి వ్యాపించడం వల్లనే నాటి నుంచి, ఏటి వరకు మనది 'భరతులు' ఎక్కువగా వుండే (భారత)దేశమయింది . రామపాదం రాతిని నాతిగా (స్త్రీగా) మర్చిందన్న కథ పాదపూజలకు దారితీసింది. 'రామపాదం' అనేది వ్యక్తుల పేరుగా కూడా ప్రసిద్ధిలోకి వచ్చింది. రాను రాను పలువురు కవులు తమ కావ్యాల అశ్వాసాంత గద్యాలలో ఇష్టదైవాలకంటే ఆ దైవాల పాదాలకే ఎక్కువ విలువిచ్చారు. మచ్చుకు కొన్ని చూడండి –

తెలుగు సాహిత్యంలో దాదాపు నన్నయ సమకాలికునిగా చెప్పబడే (11-12 శతాబ్ది మధ్యకాలం) నన్నెచోడుడు తన 'కుమార సంభవం' కావ్యంలో అశ్వాసాంతాల్లో ఇలా చెప్పుకున్నాడు –

**"ఇది శ్రీ మజ్జంగమ మల్లికార్జునదేవ దివ్యశ్రీ పాదపంకజ భ్రమరాయమాణ కవిరాజ శిఖామణి నన్నెచోడ దేవప్రణీతంబయిన"**

మల్లికార్జునస్వామి పాదపద్మాల చుట్టూ తిరుగుతూ వుండే కవిరాజ శిఖామణి అట ఆయన!

భారతాన్ని తెలుగులో చెప్పిన కవిత్రయంలో ఒకరైన ఎఱ్ఱాప్రగడ తన 'హరివంశం' కావ్యాంతంలో **"ఇది శ్రీ శంకరస్వామి సంయమీశ్వర చరణ సరోరుహ ధ్యానానంద సౌందర్యధుర్య"**నని చెప్పుకొన్నాడు. అంటే శంకరస్వామి అనే ఒక సన్యాసి పాదపద్మాలనే ధ్యానించటంలో ఆనంద సౌందర్యాన్ని పొందగల్గినవాడట! అలాగే ఆంధ్రకవితాపితామహుడైన అల్లసాని పెద్దన **"పంకజాక్ష పాదాంబుజాధీన మానసేందిందిరుడ"**నని చెప్పుకొన్నాడు. అంటే, విష్ణు పాదాలపై మనస్సు నిలిపిన

వాడన్నమాట! ఇలాంటివి ఇంకా ఎన్నో చెప్పవచ్చు. కాలం గడుస్తున్నకొద్దీ ఈ ఇష్టదైవాల, గురువుల, పెద్దలపై వుండాల్సిన గౌరవస్థాయి మూఢభక్తిగా మారుతూ వచ్చి, వారి పాదాలపైన, పాదులకపైన, పాదధూళి రేణువులపైన కూడా ప్రపత్తిగా విస్తరించింది. అలా పెరుగుతూ వచ్చిన క్రమంలో, కాళ్ళమీద పడి సాష్టాంగ నమస్కారాలు, పంచాంగ నమస్కారాలు మొదలయినవి పుట్టుకొచ్చాయి. ఎదుటివ్యక్తి పాదాలను తన తలమీద పెట్టుకోవడం అంటే, తన పాపాలను పరిమార్చుకోవటమేనన్న స్థాయికి పిచ్చి ముదరింది. గుడిలో దైవదర్శనానికి వెళ్ళి, శఠగోపం పేర పూజారితో "పాదముద్ర"లున్న డిప్పను తన తలపై పెట్టించుకొని, తన తప్పులను క్షమించమని కోరుతూ లెంపలేసుకొని, పళ్లెంలో 'లంచం'గా కానుకలు పెట్టే ఆచారానికి అది చేరింది. కాళ్ళకు మొక్కితే అవతలివాడు కరుణిస్తాడు గనుక, "నీ కాల్మొక్కుతా బాంచన్" అనటం అవమానంగా తోచలేదు.

అవును. "కాళ్ళకు మొక్కడం" అనేది ఆదినుంచీ బానిసత్వ చిహ్నమైన ఆచారమే. అది ఏర్పడిన తొలిరోజుల్లో 'గౌరవం' పేరుతో అది వన్నెకెక్కినా, ఆ గౌరవం మాటున వున్నది 'లొంగుబాటు' తత్వమే. పాదాలు శరీరంలో క్రింది భాగాన వుండే అవయవాలు. ఒకవ్యక్తి వంగి మరొకరి కాళ్ళనంటుతున్నాడంటే, 'నేను నీకు లోబడుతున్నాను' అని చెప్పడమే. ఆ పని జరిగేటపుడు, కాళ్ళకు మొక్కించుకునే వ్యక్తి మనసులో 'ఆధిక్యతా' భావన వికసిస్తుంది. ఈ ఇరువురి మధ్య అప్పుడు ఏర్పడేది హెచ్చుతగ్గుల సంబంధమే. ఆధిక్యత గల వ్యక్తి అభిప్రాయానికి మొక్కినవ్యక్తి విలువ ఇవ్వదగినట్లు ఈ సంబంధం చెప్పకనే చెబుతుంది. యజమాని–బానిస సంబంధాల్లో ఇది ఒక ముఖ్యాంశం.

ఈ మాటంటే కొందరికి రుచించదు. గొప్పవార్ని, పెద్దల్ని గౌరవించే రీతిని 'బానిసత్వం'గా చెప్పటం తప్పు అని వారు చాలా గట్టిగా మాట్లాడుతారు. ప్రతిదాన్నీ ఇలా నిరసన దృష్టితో చూడడం సరికాదని వాదిస్తారు. కాళ్ళకు మొక్కడం అనేది స్వాభిమానాన్ని కోల్పోవడం అంటే వారు ఒప్పరు. పైగా, ఇటీవల దాన్ని 'సైన్సు'తో ముడిపెట్టే మేధావుల సంఖ్య కూడా పెరుగుతోంది. వారేమంటారంటే –

"మన శరీరమంతా శక్తిమయం. నాడీమండలం ద్వారా ప్రసరిస్తూ వుంటుంది. అలాగే ఖగోళమంతటా వ్యాపించి వున్న విశ్వశక్తి (కాస్మిక్ ఎనర్జీ)ని ఈ నాడీవ్యవస్థ గ్రహించి స్పందిస్తూ వుంటుంది. ఒక శిష్యుడు వంగి, గురువు పాదాలకు నమస్కరిస్తున్నపుడు అతని చేతివేళ్ళ కొనల దగ్గరుండే నాడీకణాల ద్వారా శక్తి బయల్వెడలి, గురువు పాదాల వేళ్ళ చివరవుండే నాడీకణాలను తాకి గురువు శరీరంలోకి వెళుతుంది. గురువు మెదడులో వుండే విశేష మేధస్సు, బుద్ధికుశలత వల్ల ఆ శక్తి నిర్మలమై, తిరిగి గురువు చేతివేళ్ళ కొనలకు చేరుతుంది, కాళ్ళకు మొక్కుతున్న శిష్యుని,

గురువు లేపేటపుడు, ఆ నిర్మల శక్తి శిష్యుని శరీరంలోకి ప్రవేశించి, ఆ శిష్యుని మేధస్సును, బుద్ధిని తేజోవంతం చేస్తుంది. పాదాభివందనంలో విశిష్టత ఇది. పెద్దలకు నమస్కరించినపుడూ ఇదే జరుగుతుంది. కనుకనే ప్రాచీన రుషులు, ఆచార్యులు దీనిని అనుమతించారు".




పాదపూజల్ని, కాళ్ళ మొక్కుల్ని ఇంకా కొనసాగించడానికే, ఆధునిక సైన్సు పరిభాషను వినియోగిస్తూ చెపుతున్న తప్పుడు మాటలివి. గురుత్వాకర్షణ, రేడియేషన్ లాంటి భౌతికశక్తుల ప్రభావం జీవుల శరీరాలపై ప్రభావం చూపడం నిజమే. కానీ, కాస్మిక్ ఎనర్జీ ప్రభావం జీవులపై ఎంత స్థాయిలో వుంటుందన్నది వైజ్ఞానికంగా నిరూపితం కాలేదు. ఆధునిక భౌతికశాస్త్రం అతిసూక్ష్మస్థాయిలో వుండే శక్తిని కొలిచే సాధనాలను సైతం వినియోగిస్తున్నది. అవేవీ కాస్మిక్ ఎనర్జీని ఇంతవరకు నిరూపించలేదు. ఒకవేళ, అది వుందనుకున్నా, దాని ప్రభావం శరీరమంతటిపైనా వుంటుంది. చేతుల్ని, ఇతర అవయవాల్ని కలుపుకున్నా శక్తి ప్రసరణ జరుగుతుంది. కనుక ఆ కారణం చెప్పి, కాళ్ళమొక్కుల్ని 'పవిత్రం' చేయాల్సిన అవసరం లేదు. **ఈనాడు 'సైన్సు'కున్న తిరుగులేని ప్రామాణికత వల్ల ప్రాచీన మూఢాచారాలకు, గుడ్డినమ్మకాలకు సైన్సు పరిభాషను జోడించి, వాటికి లేని ప్రామాణికతను, ప్రాధాన్యతను ఆపాదించడం అన్ని మతాల వారికి ఒక ఫ్యాషనైంది. ఉనికిని కాపాడుకోవడానికి సైన్సు ముసుగుని ధరించడం ఒక తప్పనిసరి అవసరమైంది. మతంపై సైన్సు సాధిస్తున్న విజయానికి ఇదొక మచ్చుతునక.**

భారతదేశమంతటా గుట్టలపైన, కొండలపైన 'పాదముద్రిక'లు కన్పిస్తుంటాయి. వాటిని రాముని పాదాలనో, హనుమంతుని పాదాలనో పేరు పెట్టి పూజిస్తూ వుండటం మనకు తెలిసిందే. బలిచక్రవర్తిని దానమడిగి, పుచ్చుకొని, ఏ మాత్రం కృతజ్ఞత లేకుండా, తనపాదంతో తొక్కి బలిని పాతాళం పాల్జేసిన విష్ణుపాదం గురించి మనకు తెలుసు. దేవుళ్ల పాదాలకు అంతటి శక్తి వుందని, మహత్తువుందని ఇలాంటి కథలెన్నో వినపడుతుంటాయి. అంతశక్తీ, మహత్తుగల భగవంతుని పాదాల నుంచే శూద్రులు జన్మించారని ('పద్భ్యాం శూద్రో అజాయత') ఋగ్వేదం దగ్గర నుంచి పలు హైందవ

మతగ్రంథాలు ఘోషిస్తున్నాయి. మరి శూద్రులెందుకు పవిత్రులు కాలేకపోయారు? అధమవర్ణాలుగా తమపై వర్ణాల వారికి సేవచేయటానికి మాత్రమే పుట్టిన వారిగా, విద్యా, అధికారం, ధనం అనే వాటికి దూరమైన వారిగా వేలాది సంవత్సరాల నుంచి ఎందుకు దీనంగా వున్నారు? వారిని పుట్టించిన ఆ భగవంతుని పాదాలు అంతహీనమా? లేక, ఆ భగవంతుని కూడా సృష్టించిన అగ్రవర్ణ కుటిల పన్నాగాలు కారణమా? సమాధానం కావాలి.

పరిశీలనగా ఆలోచిస్తే, కాళ్ళు పట్టించుకోవడం, పాదపూజలు చేయించుకోవటం, పాదుకలకు మహత్తు కల్పించటం, భగవంతుని కాళ్ల నుండి శూద్రులు పుట్టారనటం... ఇవన్నీ ఆధిపత్య భావజాలంలోంచి పుట్టుకొచ్చినవేనని స్పష్టమవుతుంది. దేవతలను కల్పించి, వారి వత్తాసుతో ఈ దురాచారానికి విశ్వాసపాత్రతను తెచ్చిన 'భూదేవతలు', మిగిలిన వర్ణాలవారిని తమ అదుపులో వుంచుకోవటానికి ఇలాంటి కల్పనలు బాగా తోడ్పడుతున్నాయని మనం గుర్తించాలి. గతంలో ఈ వాస్తవాన్ని గుర్తించినవారు 'పాదాభివందన' ఆచారాన్ని గర్హించారు.

ఆధునికయుగంలో అంబేద్కర్ లాంటి మేధావులు పలుమార్లు ఈ సంప్రదాయాన్ని ఖండించారు. "అంబేద్కర్ ఆత్మగౌరవానికి ఎంతో ప్రాధాన్యత యిచ్చాడు. ఎవరైనా తనకు పాదాభివందనం చేయటంగాని, కాళ్లు పట్టుకోవటం గాని ఆయనకు నచ్చదు. ఎవరైనా అలా చేస్తే చాలాకోపం వచ్చేది. 'అమ్మా! అలా చేయకు. నాకిలాంటివి యిష్టం వుండవు. నా కాళ్ళు ముట్టుకోకు' అని వారించేవాడు."– (బాబాసాహెబ్ అంబేద్కర్, రచన:బోయి విజయభారతి, పేజి:244)

అంబేద్కరే కాదు, ఆత్మగౌరవం విలువ తెలిసిన వారెవరూ కాళ్లమీదపడి మొక్కటాన్ని యిష్టపడరు. అది లుప్తమైనవారే, ఎదుటివారిని ప్రసన్నం చేసుకోవటానికి దాన్ని ప్రయోగిస్తుంటారు.

ఆధునిక వైజ్ఞానిక ఫలితాలను అనుభవిస్తూ కూడా, ప్రాచీన బ్రాహ్మణీయ విలువల్ని కొనసాగించటం చాలా విచిత్రం! ప్రజాస్వామిక సమాజం ఏర్పడవలసిన కాలంలో ఆధిపత్య భావజాలాన్ని ఆదరించటం విడ్డూరం. పాదపూజలు, పాదుక పూజలు అంతరించనివ్వకుండా ఇప్పటికీ వాటి మహత్తును టీవీ సీరియళ్లలో, సినిమాలలో ప్రశంసించటం పాతవిలువల్ని పాతర్లలోంచి వెలికితీయటమే. కొన్ని హిందూసంస్థలయితే, గురుపూర్ణిమలాంటి ఉత్సవాలనడ్డం పెట్టి ఆచార్యులకు, తల్లిదండ్రులకు వారి శిష్యులతో, పిల్లలతో 'పాదపూజోత్సవాలు జరుపుతున్నాయి ప్రతి ఏటా. సాష్టాంగదండ ప్రణామాలను ప్రోత్సహిస్తున్నాయి. సాయిబాబా, సాయిమా లాంటి

పలువురు స్వామీజీలు తమతమ పాదుకలను వెండి, బంగారాలతో చేయించి పూజింపచేస్తున్నారు. పాదపూజ ప్రాశస్త్యం గురించి పురాణ పండితులు భక్తిఛానెల్స్‌లో ప్రవచనాలు వల్లిస్తున్నారు. కొందరు మాతాజీల, స్వామీజీల కాళ్లుకడుక్కున్న నీటిని పవిత్రంగా భావించి తాగుతున్న వారు, నెత్తి మీద చల్లుకునే భక్తజనం నేటికీ వున్నారు. అలా చేస్తే తమ పాపాలు నశించి, అనారోగ్యాలు తొలగుతాయని మెండుగా విశ్వసిస్తున్నారు.

పెద్దల్ని, గురువుల్ని తప్పక గౌరవించాల్సిందే. వినయం, గౌరవంలాంటి భావనలన్నీ మాటకు, మనసుకు సంబంధించినవి. వాటిని క్రియారూపంలోనూ వెల్లడించవచ్చు. అయితే 'ఆత్మగౌరవాన్ని', స్వాభిమానాన్ని తాకట్టుపెట్టే రీతిలో వుండకూడదు. ఆ రెంటినీ కోల్పోయిన వ్యక్తి బానిసతో సమానం. కనుక, పాదాభివందనాలు, పాదాల, పాదుకల పూజలు వంటివాటిని పిల్లలకు నేర్పటం, వాటిని ఆచరించిన వారినే వినయశీలురుగా, గౌరవించినవారిగా భావించటం కాలం చెల్లిన ఆలోచనలకు సంకేతం. ఎటువంటి గురువులను గౌరవించాలో, ఎందుకు గౌరవించాలో, ఎలా గౌరవించాలో పిల్లలకు నేర్పకపోతే, గురువువేషంలో వుండే మోసగాళ్ళు లావైపోతారు. సమాజానికి చీడపురుగులవుతారు. ఎటువంటి పెద్దల్ని గౌరవించాలో, ఎవర్ని గౌరవించకూడదో చెప్పకపోతే, పెద్దల వేషంలో వుండే గద్దల బారినపడి అమాయకంగా నష్టపోయే ప్రమాదమున్న కాలమిది. కనుక, వినయం, విధేయత, గౌరవం అనే వాటికి ఆధ్యాత్మిక రంగులద్దకుండా, స్వాభిమానాన్ని, ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకునే వ్యక్తిత్వ విలువలుగా వాటిని నేటి తరానికి అందించటం మేలు.



# ఈ 'నల్లని రాళ్ళ'లో ఏ నిజములు దాగెనో!



తెలుగులో తెనాలి రామకృష్ణ కవి 'పాండురంగ మహత్త్యం' అనే ఒక భక్తి ప్రచార కావ్యాన్ని రాసాడు. అందులో తృతీయాశ్వాసంలో, 'నిగమశర్మోపాఖ్యానం' ఒక ఉపకథ. బ్రాహ్మణ కులంలో పుట్టిన నిగమశర్మ, కులాచారాలను విడిచి, సమస్త దురలవాట్లకు మరగి, దుష్టుడవుతాడు. ఒకరోజు, అతని అక్క అతని ఇంటికి వచ్చి మంచి బుద్ధులు చెబుతూ, 'నీలాంటి వాడు పుణ్యకార్యాలు వదిలి తిరిగితే ఎలా?' అంటూ **"సాలగ్రామ ఖనిన్ జనించునె కదా! జాత్యల్ప పాషాణముల్"** అంటుంది.

అంటే "సాలగ్రామాలకు నిలయమైన చోట చిన్న చిన్న గులకరాళ్ళు సైతం పుడుతుంటాయి కదా!" అని.

వాళ్ల కుటుంబం సాలగ్రామాలకు గని వంటి పవిత్రమైనది. నిగమశర్మ అందులో ఒక గులకరాయిలా పుట్టాడన్నమాట.

'సాలగ్రామం' కూడా ఒక రాయే. అయితే హిందువులకు పూజనీయమైన రాయి. శ్రీ వైష్ణవులకు మహావిష్ణువుతో సమానమైన రాయి. శివలింగం శైవులకెలాగో, సాలగ్రామం వైష్ణవులకూ అంతే.

'సాలగ్రామ'రాళ్ళు హిమాలయాల్లో ప్రవహించే గండకీనదీ తీరంలో దొరుకుతాయి. ఆప్రాంతం భౌగోళికంగా నేపాలీయులది. 'ధవళగిరి-అన్నపూర్ణ' పేర్లు కల కొండల

మధ్యలో ప్రవహించే గండకీ నదీతీరాన వుండే జనపదాల్లో 'సాలగ్రామం' ఊరొకటి వుంది. ఒకప్పుడు అది పులస్త్యుని ఆశ్రమమని అంటారు. అక్కడ ఎక్కువ 'సాల' వృక్షాలు పెరుగుతాయి కనుక ఆ పూరికి 'సాల్‌గావ్' అనే పేరు వచ్చింది. దాన్ని సంస్కృతీకరిస్తే శాలగ్రామం లేదా సాలగ్రామం అయింది. దాన్నే ఆధ్యాత్మిక పవిత్ర భాషలో 'చక్రతీర్థ'మనీ అంటున్నారు. సాలగ్రామానికి 24కి.మీ.పరిధిలో వుండే ప్రాంతమంతా చక్రతీర్థం. అక్కడ 'చక్ర' అనే ఒక చిన్న నది ఒకటి గండకిలో కలుస్తూ వుంటుంది.

**"చక్రతీర్థావచ్ఛిన్నా, గండకీ నద్యుత్పన్నా, శిలాసు శాలిగ్రామ పదవాచ్యా"** అన్నారు. అంటే, చక్రతీర్థ పరిధిలో వుండే, గండకీ నదిలో పుట్టిన శిలల్ని మాత్రమే శాలిగ్రామాలు అనాలి.

దక్షిణభారతంలో కూడా చాలా మంది వైష్ణవుల ఇళ్ళల్లో. గుళ్ళల్లో, మఠాల్లో, ఆశ్రమాల్లో ఈ సాలగ్రామ శిలల్ని మనం చూడవచ్చు. ఇంటిలో దేవుళ్ళ పటాల దగ్గర వీటిని వుంచుతారు. రకరకాల సైజుల్లో, రంగుల్లో ఇవి వుంటాయి. కుంకుడు విత్తంత ప్రమాణం మొదలుకొని, చేతిలో అమరే బాదంకాయంత సైజు వరకు వుండే వాటిని ఇళ్ళల్లో పూజిస్తారు. అంతకన్నా పెద్దవాటిని గుళ్ళల్లో, ఆరాధనాకేంద్రాల్లో పెడుతుంటారు. సాధారణంగా నల్లని రంగులో వుండేవే ఎక్కువ కనిపిస్తాయి. ఎందుకంటే, అవి సాక్షాత్తు విష్ణువుకు ప్రతిరూపాలు అని వాటిని నమ్మేవారనుకుంటారు. వాటిని నారాయణ శిలలంటారు. పచ్చరంగు వుంటే ప్రద్యుమ్న శిలలని, తెల్లనివైతే వాసుదేవ శిలలని, నీలపువైతే అనిరుద్ధ శిలలని అంటారు. ఈ రంగులే పవిత్రాలు, పూజనీయాలు. ఇంకా ఎరుపువి, మరికొన్ని రంగులవి వున్నా, అవి పైవాటంతట పవిత్రాలు కావట!

ఈ శిలల ఆకారాల్లోని తేడాలను బట్టి కూడా మహిమల స్థాయివుంటోంది. నున్నని రాళ్ళు ఉత్తమం. గరుకుగా వుండేవి పూజించే వారిలో ఆందోళనను, అనారోగ్యాన్ని పెంచుతాయి. ఆకృతిలో ఎగుడుదిగుళ్ళుంటే బతుకంతా అస్తవ్యస్తం, పేదరికంతో గడుస్తుంది. చదరంగా వుండేవాటిని పూజిస్తే ప్రమాదాలు, అకాల మరణాలు సైతం ఎదురుకావచ్చు.

నున్నని నేరేడుపండులా కనిపించే సాలగ్రామశిలలకు పైభాగాన ఒక చిన్న రంధ్రం వుంటుంది. అలాంటి వాటిని దారాలతో కట్టి మెడలో ధరించేవారుంటారు. నత్తగుల్లల వలె సుడులు తిరుగుతూ వున్న ఆకృతిగల శిలలు, వాటిమీద ఆ సుడులను విభజిస్తూ వుండే సన్ననిరేఖలు వుండే రాళ్ళు కూడా వుంటాయి. అలాంటి వాటిని

విష్ణుశంఖువులుగా భావిస్తారు. ఇంకా చక్రాకృతి, గదాకృతి, కౌస్తుభాకృతి, వనమాలాకృతిలో గీతలు కలిగిన శిలలు కూడా. అవన్నీ విష్ణు సంబంధిత వస్తువులు కనుక పవిత్రాలే. మరికొన్ని కప్పనోరు తెరిచినట్లు రంధ్రాలతో వుంటాయి. అవి నరసింహ శిలలు. అంటే, ఒక సాలగ్రామశిలకుండే ఆకారాన్ని ఏదోరకంగా విష్ణు అవతారాలకు, విష్ణువు వాడే పరికరాలకు, ఆభరణాలకు అన్వయించి, వాటికి పవిత్రతను ఆపాదించడం జరుగుతుంది.

సాలగ్రామశిలలకు వివిధ రంధ్రాలు, ఆకృతులు, చక్రాలు వంటివి ఎందుకు వచ్చాయి? అనే ప్రశ్న హిందూభక్తులను వెంటాడింది. దానికి సమాధానంగా ఒక పురాణకథను రాసిపడేసారు.

ఒక రాక్షసుడు (జలంధరుడు!) న్నాడు. అతని భార్య పేరు వృంద. అతని బాధలు భరించలేక దేవతలంతా శివుణ్ణి వేడుకుంటే, శివుడు ఆ రాక్షసుడితో యుద్ధానికి తలపడ్డాడు. ఎంతకాలమైనా రాక్షసుడు ఓడడం లేదు. కారణమేమిటి? అని తీవ్రంగా మథనపడుతూ వుంటే ఒక అశరీరవాణి అసలు నిజం(!) చెప్పింది. రాక్షసుని భార్య వృంద పవిత్రురాలు, శీలవతి. ఆమె పాతివ్రత్యాన్ని, శీలాన్ని భంగపరిస్తే తప్ప రాక్షసుడు ఓడిపోడు. అశరీరవాణి చెప్పినదాన్ని రాక్షసుడూ విన్నాడు, దేవతలూ విన్నారు. కానీ, దేవతలు వృంద శీలహరణానికి పూనుకోలేదు! రాక్షసుడు మాత్రం శివుని వేషంలో పార్వతిని చెరచడానికి వెళతాడు. ఆమెను చెరిస్తే శివుడు ఓడిపోతాడని ఆశించాడు. అయితే పార్వతి మహిమాన్వితురాలు గనుక, వచ్చినవాడు రాక్షసుడని గుర్తించి లొంగకుండా, తప్పించుకుంది. అంతేగాదు, అక్కడినుంచి వెళ్ళి మహావిష్ణువుని చేరి, రాక్షసుని రూపంలో వెళ్ళి వృందను చెరచమని కోరింది. విష్ణువు ఆ పని చేస్తాడు, వృంద సామాన్యురాలు కనుక విష్ణుమాయను గుర్తించక, తన భర్తే అనుకుని శీలాన్ని అర్పించింది. అయితే, ఆ తర్వాత నిజం గ్రహించి, 'రాయిగామారిపొమ్మని' విష్ణువుని శపించింది. విష్ణువు కూడా వృందను నదిగా మారిపొమ్మని శపిస్తాడు. ఆ రాయే సాలగ్రామం. ఆ నదే గండకి. ఆ తర్వాత విష్ణువు విశ్వకర్మను పిలిచి, ఒక వజ్రకీటకంగా మారి బంగారు రంగుతో మెరిసే వజ్రాల వంటి పండ్లతో రాళ్ళన్నిటికీ, తన వస్తువులకు, అవతారాలకు, ఆభరణాలకు సంబంధించిన ఆకృతులు వచ్చే విధంగా, రాళ్ళను కొరుకుతూ జీవించమంటాడు. ఆ కారణంగానే, సాలగ్రామ శిలలకు వివిధాకృతులు, రంగులు ఏర్పడ్డాయి. కొత్తగా ఒక వస్తువు కంటపడితే, దాని గురించి వాస్తవాలు తెలియకపోతే, భక్తితో ఇలాంటి పౌరాణిక గాధలను ప్రాచీనులు కల్పించుకుంటారనడానికి ఇదొక ఉదాహరణ. యుద్ధంలో గెలుపు ఓటములకు స్త్రీల శీలాన్ని కారణంగా చెప్పటమే కాదు, తమ శత్రువును జయించాలంటే ఆమె భార్యని చెరచాలన్న నీతిని

దేవుళ్ళే అనుసరించడం వల్ల జనానికి ఏ సందేశం వెళుతుంది? విశ్లేషిస్తూ పోతే, ఎన్నో ప్రశ్నలున్నాయి ఈ కథలో. అవేవీ వాస్తవాలు కావని తేలిగ్గా అర్థం చేసుకోవచ్చు.

సాలగ్రామశిలల గురించి, ఇలాంటి కథల గురించి, అనేక కల్పనల గురించి చాలా పురాణాలు ప్రస్తావించాయి. అగ్నిపురాణం, స్కాందపురాణం, పద్మ పురాణం, గరుడ పురాణం, నరసింహపురాణం, దేవీ భాగవతం, మహాభారతాల్లో వీటి ప్రసక్తి వుంది. అన్నింటి సారాంశం, ఆ రాళ్ళకు మహత్తును ఆపాదించి కీర్తించడమే. ఎవరైనా సాలగ్రామంలో చనిపోతే, అతడు కూడా విష్ణు సమానుడై, ఒక సాలగ్రామశిలగా అవతరిస్తాడన్నంతదాకా వెళ్ళాయి పురాణకథలు.

## మహిమల్ని అంటగట్టారు

సాలగ్రామశిలలను పూజిస్తే అన్ని సంపదలు సమకూరుతాయని వైష్ణవభక్తులు, హిందువులు నమ్ముతారు. విష్ణువు వాటిల్లో అంతర్నిహితంగా వుంటాడట! అలాగే లక్ష్మీదేవి 'తులసి' ఆకుల్లో వుంటుందట! ఆ రెంటిని నీళ్ళలో వుంచి, కొంత సమయం తర్వాత ఆ నీటిని తాగితే అన్ని రోగాలు మటుమాయమవుతాయట! ఆ నీటిని పొలాలకు వాడితే, నేలలో సత్తువ పెరిగి, ఏ పంట వేసినా లాభం చేకూరుతుందట! సాలగ్రామ శిలల చూర్ణంతో తయారైన ఔషధరసాన్ని మించిన రసాయనం ఆయుర్వేదంలో లేదని అంటారు. దాన్ని సేవిస్తే, ఎయిడ్స్, కేన్సర్ వంటి మొండిరోగాలు కూడా పలాయన మౌతాయని ప్రచారం వుంది. సాలగ్రామం వుంచిన నీటిని ప్రతిరోజూ తాగితే, ఆరోగ్యం, తెలివి, జ్ఞాపకశక్తి విపరీతంగా పెరుగుతాయని, సాత్వికగుణం, భగవద్భక్తి, అలవడ తాయని చెప్తున్నారు. నిద్రించేముందు ఆ రాతిని దిండు కింద పెట్టుకుంటే సుఖనిద్ర రావడం, నిద్రలేమి రోగం తగ్గడం, చెడుకలలు రాకుండడం జరుగుతాయని నమ్ముతారు. ఇలాంటి ఎన్నో పుకార్లు, హేతుదృష్టి లేని జనాన్ని, మరింత మూఢుల్ని చేస్తూ, ఆ సాలగ్రామశిలలను ఎంతధరకైనా కొని పూజించేందుకు ఉద్యుక్తుల్ని చేస్తున్నాయి. వాటి ధరలు మచ్చుకు కొన్ని చూడండి -

1. సాలగ్రామశాల పవిత్ర అద్వైత ధన్వంతరి శిల - రూ. 2,45,000
2. లక్ష్మీనారాయణ మహాగణపతి శిల - రూ. 55,000
3. బంగారులింగం గల శిల - రూ. 20,000
4. శ్రీ లక్ష్మీనారాయణ శిల - రూ. 9.800
5. సర్వోత్తమ కల్పవృక్ష, కామధేను శిల - రూ. 7,500
6. శ్రీధర సాలగ్రామశిల - రూ. 4,500

(అంతర్జాల పట్టిక ఆధారంగా)

ఇస్తూపోతే, ఇదొక పెద్ద జాబితా అవుతుంది. కనీసం రూ.500 దగ్గర నుండి రూ. 3లక్షల దాకా వీటి ధర వుందంటే, ఒక విశ్వాసం, ఒక రాయి కోసం ఎంత ఖర్చు పెట్టగలుగుతున్నదో తెలుస్తుంది. విదేశీయులకు డాలర్ల ధరలు ఇంతకంటే ఎక్కువగా వుండడం, షరామామూలే. ఎంతో డిమాండ్ వుంటే గానీ, అమ్మకం జరుగుతుంటే గానీ, ఈ చిన్ని శిలలకు ఇంతేసి ధరలు వుంచడం జరగదని మనం అర్థంచేసుకోవాలి.

## శిలల వెనుక దాగిన నిజాలేమిటి?

ఈ భూమ్మీద మనకు కనిపించే వింత వస్తువులెన్నో వుంటాయి. వస్తువుల్లోని వింతలను భక్తి, ఆధ్యాత్మిక భావనలతో చూస్తే, వాటికీ భగవంతునికీ ఏదో బంధం వున్నట్లు ఆధ్యాత్మికులకు అన్పిస్తుంది. అదే కవుల, కళాకారుల దృష్టిలో అనేక కల్పనా కథలు, కవితలు, కళాకృతులు పుట్టుకొస్తాయి. దాంతో వ్యాపారం మొదలై అదొక దోపిడీవిధానంగా మారుతుంది. కానీ, శాస్త్రవేత్తల దృష్టిలో పడితే ఆ వస్తువుల వింతల వెనుక దాగివున్న విజ్ఞానం, చరిత్ర, వాస్తవాలు బయటకు వస్తాయి. సాలగ్రామశిలల వెనుక దాగిన విజ్ఞానం చరిత్ర తెలిస్తే, జరిగే ఆధ్యాత్మిక ప్రచారాలన్నీ 'దబ్బర' అని తెలుస్తాయి. అవి తెలియడానికి మనం ప్రాచీన భూగోళ చరిత్రలోకి వెళ్ళాలి.

7 కోట్ల సంవత్సరాల క్రితం ఇపుడు హిమాలయాలకు ఉత్తరాన వున్న ఆసియా భూభాగం, భారత భూభాగం వేరుగా వుండేవి. రెండింటి మధ్య సముద్రం వుండేది. ఆ సముద్రాన్ని 'టెథిస్' అన్నారు భౌగోళికులు. ఆస్ట్రేలియా నుండి కదిలిన భారతీయ టెక్టానిక్‌ప్లేట్ (సముద్రపు అడుగునుండే భూభాగపుపొర) ఉత్తరంగా ప్రయాణిస్తూ ఆసియా టెక్టానిక్‌ప్లేట్‌ని తాకింది. ఇండియా ప్లేట్ దిగువగానూ, ఆసియా ప్లేట్ ఎత్తుగానూ వుండడంతో,ఈ రెండింటి కలయికతో ఆసియా భూభాగం పైకి వచ్చింది. ఇండియా కంటే టిబెట్ 78 కి.మీ. ఎత్తులో వుండడానికి కారణం అదే. ఈ ప్లేట్ల కలయికవల్ల సముద్రపు నీరు పైకి తన్నుకురావడం, భూమి అడుగునున్న ఉష్ణశిలాద్రవం ఒత్తిడితో భూభాగంపైకి ఉబకడం కారణంగా హిమాలయ(ముడతలుగా)పర్వతాలు ఏర్పడ్డాయి. ఈ రెండు ప్లేట్ల కలయిక ఇప్పటికీ చాలా నెమ్మదిగా కొనసాగుతూనే వుండడం వల్ల, నేటికీ ప్రతియేటా 1 సెం.మీ. ఎత్తుకు హిమాలయాలు పెరుగుతున్నాయని భౌగోళిక శాస్త్రవేత్తలంటున్నారు.

ఇలా రెండు ఖండాలప్లేట్లు కలిసిపోయినపుడు, సముద్రపు నీటిలో ఆనాటి జంతువులన్నీ నేలల అంచుల వద్దనున్న బురదలో చిక్కి మరణించి, క్రమంగా బురద గట్టిపడడంతో శిలాజాలు (ఫాసిల్స్)గా ఏర్పడ్డాయి. పెద్ద జంతువులు, చెట్లు, నీళ్ళల్లో

కుళ్ళి పెట్రోలియం (రాతినూనె)గా మారగా, చిన్న చిన్న చేపలు, నత్తలు వంటివి ఫాసిల్స్‌గా మారి, హిమాలయాల్లో రకరకాల శిలలుగా కనిపిస్తాయి. గండకీనదీ పరివాహక ప్రాంతంలో కూడా నత్తలు వంటి సముద్రపు సెఫలోపాడ్ జీవులు (తల ప్రధానంగా వుండి చిన్న చిన్న టెంటకిల్స్‌తో నడిచే ప్రాణులు) ఫాసిల్స్‌గా మారి, ఇపుడు సాలగ్రామశిలలగా బయటపడుతున్నాయని రుజువయింది.

సాలగ్రామ ప్రాంతంలో ఇప్పటికీ అక్కడక్కడ బిలాల్లోంచి వెలువడే వేడివాయువుల ఉనికిని మనం గుర్తించవచ్చు. ఆ వేడివాయువుల కారణంగా, అక్కడక్కడా నీరు వేడెక్కి ఉడుకుతూ కన్పిస్తాయి. హిమాచల్ ప్రదేశ్‌లో 'జ్వాలాముఖి' పుణ్యక్షేత్రం దగ్గర జరుగుతున్నదదే.

ఈ భౌగోళిక వాస్తవాన్ని తెలియక, 'భగవన్మహిమ'గా భావిస్తూ, ఆ ప్రదేశాన్ని శక్తిపీఠాలలో ఒకటిగా మార్చివేసారు.

సాలగ్రామశిలలన్నీ నత్తల వంటి సముద్రజీవుల శిలాజాలే. ఈ జీవులు కొన్ని వందల రకాల శరీర పరిణామాకృతులు కల్గివుంటాయి గనుక, ఫాసిల్స్ కూడా అలాగే, వివిధ ఆకృతుల్లో ఏర్పడ్డాయి. 1సెం.మీ. పరిమాణం నుంచి 2మీ. వ్యాసపరిమాణం వరకు గల ఫాసిల్స్ లభిస్తున్నాయి. మట్టిలో వుండే ధాతువులు, జీవుల శరీరాల్లో వుండే రంగుకణాల కారణంగా ఫాసిల్స్‌లో కూడా రంగులు ఏర్పడ్డాయి. జీవుల నోరు, దంతాలు, ఎముకలు, నేత్రాలు మొదలైనవి వుండేచోట, బురదలో, వాటి అచ్చులు నిలిచిపోయి, ఫాసిల్స్‌లో వింత ఆకృతులుగా మారాయి.



ఈ ఫాసిల్స్(శిలాజాలు) వేల సంవత్సరాల క్రితమే అక్కడి సంచార మానవుల్ని ఆకర్షించాయి. హిందువుల కంటే ముందుగా, వీటిని గుర్తించిన వారు బౌద్ధులు. వజ్రయాన బౌద్ధులుగా పేరుపడిన టిబెట్ బౌద్ధులు గండకీ నదీ ప్రాంతంలో ఆరామాలు ఏర్పరుచుకొని నివసించారు. ఇపుడు చక్రతీర్థంగా చెప్పబడుతున్న సాలగ్రామానికి

వారు "ఛుమిగ్‌గ్యాత్స"(నూరువసంతాల ప్రదేశం) అనే అందమైన పేరు పెట్టుకున్నారు. ఇప్పటికీ అక్కడ పద్మసంభవ, అవలోకితేశ్వర, వజ్రధర పేర్లుంచిన బౌద్ధవిగ్రహాలకు ఆరాధనలు జరుగుతున్నాయి. అయితే, వాళ్ళెవరూ సాలగ్రామశిలలకు పవిత్రతను, ఆధ్యాత్మికతను ఆపాదించకపోవడం గమనార్హం.

అయితే, హిందూమత ప్రచారకులు ఆ ప్రాంతాన్ని తెలుసుకున్నాక , ఆ వింత శిలాజాలకు, ఆధ్యాత్మిక రంగు, రుచి, వాసనలను జోడించారు. ముఖ్యంగా, విశిష్టాద్వైత ప్రచారకుడైన రామానుజాచార్యుని కాలం (క్రీ.శ.1017- 1137)లో సాలగ్రామాలకు దైవత్వం, పూజనీయత, ఆపాదింపబడింది. అప్పటికే శైవులు, నేపాల్‌లోని రుద్రాక్షలు శివుని ప్రతిరూపాలుగా చేసుకున్నారు. కనుక, శ్రీ వైష్ణవులకు అలాంటి ధారణాయోగ్యమైన, పూజనీయమైన విష్ణుప్రతిరూపం ఒకటి అవసరమైంది. ఈ 'గౌరవాన్ని' ఈ సాలగ్రామశిలలు అందుకున్నాయి. ఆ కాలంలో విష్ణుభక్తి ప్రచారం చేసిన పురాణాలన్నింటా (ఉదా: గరుడ, పద్మ, స్కాంద, నృసింహ పురాణాలు) సాలగ్రామశిలల మహత్వాన్ని ఆపాదిస్తూ కీర్తించే వర్ణనలు, కథలు, అధ్యాయాలు పుట్టుకొచ్చాయి. మహాభారతం వంటి అంతకు పూర్వమే వున్న గ్రంథాల్లోకి కూడా వాటి కథలు చొప్పించబడినాయి.

ఆధునికంగా సైన్సుకి పెరుగుతున్న ప్రాధాన్యత వల్ల, ప్రతిదానికి శాస్త్రీయకారణాలను తెలుసుకునే ఆసక్తి పెరగడాన్ని గమనించి, మతవాదులు తమ చిహ్నాలకు, వస్తువులకు, ఆచారాలకు కూడా 'శాస్త్రీయ'తను అతికించేందుకు నానాతంటాలు పడుతుంటారు. దాన్నే సైన్సు పరిభాషలో 'సూడోసైన్స్' అంటాం.

సాలగ్రామాలకు దాన్ని అంటించారు. అవి దైవస్వరూపాలని, వాటిలోంచి 'శక్తి' విడుదలవుతుండడం (రేడియేషన్) రుజువైందని, ఆ దివ్యశక్తి వల్ల అదృశ్యంగా వున్న దుష్టశక్తుల్ని, పీడల్ని తొలిగించగలదని వాదిస్తారు.

మనం వాడే అన్ని రకాల వస్తువుల నుంచి స్వల్పాతిస్థాయిలో రేడియేషన్ రావడం వాస్తవమే. అయితే దాని ప్రభావం మన శరీరం, లేదా బుద్ధి మీద ప్రభావం చూపదగిన స్థాయిలో వుండదు. అలాంటిదాన్ని దివ్యశక్తి అని, దుష్టశక్తుల్ని తొలిగిస్తుందని చెప్పడం అతిశయమే. ఆ సాలగ్రామ శిలాజాలను నానబెట్టిన నీళ్ళు తాగితే రోగాలు పోతాయని, తెలివి, జ్ఞానం పెరుగుతాయని, ఆ నీళ్ళతో పంటలు బాగా పండుతాయని, ఆ శిలలను దిండు కింద పెట్టుకుంటే నిద్రలేమి వుండదని, ఆ శిలాజాలతో తయారైన ఔషధం ఎయిడ్స్, కేన్సర్‌లను తగ్గిస్తుందని చెప్పడం నిరూపణ లేని బూటకపు ప్రచారమే, అమాయక భక్తులను వలలో వేసుకోవడానికే. అజ్ఞానానికి మరింత పౌరాణిక, ఆధ్యాత్మిక

అజ్ఞానాన్ని జోడించి, నమ్మకాల వలల్లో గుంజుకులాడుతూ, అజ్ఞానాన్ని వ్యాపారంగా మార్చుకుని ధనాన్ని కొల్లగొట్టే వ్యాపారులకు అమాయక వినియోగదారులవుతున్న దుస్థితి నుంచి, జనం బయటపడాలి.

మరో విషయం – రెండు టెక్టానిక్ ప్లేట్ల కలయిక వల్ల, సాలగ్రామ శిలాజాలు ఏర్పడడం హిమాలయాల్లో జరిగినట్లే, ఇతర ఖండాల్లో కూడా అలాంటి కలయికల కారణంగా కూడా శిలాజాలు వచ్చాయి(ఉదా: ఆల్ప్స్ పర్వతాలు). ఆ వింత వింత శిలాజాలను చూసి అక్కడ ఎవరూ ఇప్పుడు పూజించడం లేదు. ఒకప్పుడు అలా పూజించినా, ఇప్పుడు మాత్రం వాటిని ప్రాకృతిక వింతలుగానే భావించి, వాస్తవజ్ఞానంతో మురిసిపోతున్నారు. మరి మనమెందుకిలా వున్నాం? ఆరాధకులు ఆలోచించాలి.

మన ఇళ్ళల్లో రెండుమూడేళ్ళ వయసున్న చిన్నపిల్లల్ని గమనించండి. ఇంటి పరిసరాల్లో వుండే చిన్న చిన్న రాళ్ళను, మట్టిని తెచ్చి ఆడుతూ వుంటారు. వాటిని తెచ్చి ఇంట్లో అపురూపంగా దాచుకుంటారు. అప్పుడు పెద్దవాళ్ళు 'ఎందుకురా, ఇంటి నిండా ఈ రాళ్ళు, పారేయ్!' అంటారు. దానికి పిల్లలు బాధపడతారు. కొంతవయసు పెరిగాక, అలాంటి పనులు ఆ పిల్లలకే నచ్చవు. ఎందుకంటే చిన్న చిన్న రాళ్ళు ఎందుకున్నాయో, వాటిని ఇంట్లో ఎందుకు పోగు పెట్టరాదో అర్థమవుతుంది. రాళ్ళపై వాళ్ళకున్న జ్ఞానపరిధి విస్తృతమవుతుంది. ఇదొక సహజమైన జ్ఞానార్జన ప్రక్రియ. సాలగ్రామరాళ్ళ విషయంలో దాన్నెందుకు అమలు చేయం? ఎందుకంటే విశ్వాసం, దైవభక్తి/భీతి, ఆ ప్రక్రియను అడ్డుతున్నాయి కనుక. జ్ఞానపరిణామానికి, విస్తృతికి, స్వేచ్ఛాయోచనకు దైవవిశ్వాసం ఎన్నడూ దోహదపడదు. విశ్వాసులకు అర్థంపర్థం లేని అంశాలపై ఆశలు కల్పించి ఎండమావుల నీటి కోసం పరిగెత్తించడమే అని దాని పరమార్థం.



# నీటికి మహత్తులుంటాయా, మిత్రమా?




2016 ఆగస్టునెలలో కృష్ణా పుష్కరాలు వచ్చాయి. పెద్ద జాతరే జరిగింది. మళ్ళీ ఏడాదికి అంత్యపుష్కరాలు. ఏడాదంతా కృష్ణాజలంలో పుష్కరస్వామి కాపురముండి, మునిగే వారి పాపాలను కడిగేస్తుంటాడని శతాబ్దాల తరబడి జరుగుతున్న ప్రచారం. అలాంటి ప్రచారానికి మరింత వంతపాడుతూ 'మునగండి–పునీతులవ్వండి' అని ప్రజలను నిలువునా ముంచుతున్నారు తెలుగు రాష్ట్రాల పాలకులు. నీళ్ళల్లో పుష్కరుడుండటమేమిటి? సంవత్సరం పాటు ఎలా వుంటాడు? ఎవరు గమనించారు? వుంటే, గింటే పాపాలను ఎలా తొలిగిస్తాడు?

మొదలైన ప్రశ్నలన్నిటికీ సరైన జవాబులు ఎవరినుంచీ రావు. "అది మా నమ్మకం" అనే ఒకే ఒక మాటతో అడిగేవారి నోరుమూయించాలని చూస్తారు.

నీళ్ళకు పవిత్రతను ఆపాదించడం, మహిమలనంటగట్టడం ఇప్పటి విషయం కాదు, కొన్ని వేల సంవత్సరాల నుంచీ వుంది. ఆ మాటకొస్తే, ప్రకృతిలోని పంచభూతాలకూ పవిత్రత, మహిమలు జోడించి వున్నాయి. నింగి, నేల, నీరు, నిప్పు, గాలి – ఈ ఐదూ ఆదిమ మానవుని ఊహకందని అద్భుతవింతలనందించేవి. అందుకే వాటి పట్ల భయంతో కూడిన, భక్తి మొదలై, ఆరాధనకు దారి తీసింది. నింగి నుంచి వచ్చే వాన, నేల మీద పారుతూ ఎక్కడికి పోతుందో? నింగి నుంచి ఎవరు దానిని

నేలపైకి పంపుతున్నారో? తెలియదు. కానీ ఆ నీటి వల్లనే దాహం తీరుతుంది, మొక్క మొలుస్తుంది, పంట పండుతుంది, కడుపు నిండుతుంది. కనుక, నీరు ప్రాణాధారం. ఈ ఆలోచనే నీటిపై 'గౌరవం' ఏర్పడడానికి మూలం. వానలు 'దేవుళ్ళ' వల్ల వస్తున్నాయనుకున్నాక, నీటి మీద 'పవిత్ర'భావనా ఏర్పడింది. ప్రకృతిశక్తుల ఆరాధన కోసం స్వర, రాగ సంహితమైన మంత్రాలు వచ్చాక, నీటిని కూడా 'మంత్రజలం'గా మార్చారు. ఆ జలానికి మహిమలనాపాదించారు. రకరకాల ఆరాధనారీతులు, పలు మతాలుగా పరిణమించాక, ఆ రీతులకు తగ్గట్లు, ఆరాధనల్లో వాడే నీటికీ మహత్తులనంటగట్టారు. ప్రతిమతంలోనూ దాదాపు, ఏదో ఒక రీతిలో 'మహిమ గల నీళ్ళు'న్నాయి.

అతి ప్రాచీనమైనదిగా చెప్పబడే వైదిక/హిందూ మతారాధానలనే తీసుకోండి. వారి ఆదిదేవుడు నారాయణుడు (నార+ఆయనుడు). నీటినే నివాసంగా చేసుకున్నవాడు. ఆ వేదపురుషుడు **'అభ్ద్యస్సంభూతః పృథివ్యైరసాచ్చ'** నీటి నుంచి పుట్టాడు. ఆ నీటి నుంచే భూమి పుట్టింది అంటోంది పురుషసూక్తం. ఈ ప్రపంచంలో లోపలా బయటా, ఏది విన్నా, ఎక్కడ చూసినా, అంతటా నారాయణుడేనంటోంది.

**"యో ఉ పామాయతనం వేద! ఆయతనవాన్ భవతి"** (మంత్రపుష్పం)

ఎవరైతే నీటిని నివాసంగా వున్న వానిని తెలుసుకుంటాడో అతడే నివాసాన్ని పొందగల్గినవాడవుతాడు. చంద్రుడు, అగ్ని, వాయు, సూర్యుడు, నక్షత్రాలు, మేఘాలు, సంవత్సరాలు మొదలగువాటన్నిటికీ నీటికీ పరస్పర సంబంధాన్ని వైదిక పురుషులు ఊహించుకున్నారు. వారి నివాసప్రాంతంలో వుండే జలప్రవాహాలను, నదులను దేవతలుగా, మహిమాన్వితులుగా కవితల్లో అభివర్ణించారు. కాలక్రమంలో కల్పించుకున్న శివుడు, బ్రహ్మ, ఇంద్రుడు, లక్ష్మి, సరస్వతి మొదలైన దేవతలందరికీ నీటితో సంబంధమేర్పర్చారు.

గంగ, యమున, సరస్వతి లాంటి నదులను దైవీకరించి, ఎన్నో మహత్తులను ఆ నదీ జలాలకు అంటగట్టారు. పాత్రల్లో ఆ జలాలను నింపుకుని తెచ్చి, పవిత్ర జలాలుగా ఎంచి, ఆ నీటిపై భక్తిని పెంచారు జనంలో, భోజనారంభ సమయంలో ఆచమనం పేర, గుడిలో 'తీర్థం' పేర, మరణానంతరం 'శ్రాద్ధం' పేర, సంధ్యావందన సమయంలో అర్ఘ్యంపేర, కోపం వస్తే శాపం పేర నీటికి స్వతహాగా లేని ఘనతను, మహిమను కల్పించారు. పుష్కరాలు, కుంభమేళాలు అలాంటి మహిమల కల్పనలకు నిలువుటద్దాలు.

ప్రాచీన గ్రీకు మతంలోనూ ఇలాగే జరిగింది. దేవుని ముందుంచిన నీటిని హిందువులు 'తీర్థం' అంటే వాళ్ళు 'చెర్నిప్స్' అన్నారు. దైవవిగ్రహం నుంచి వెలువడిన కృపాకిరణాలు ఆ నీటిని తాకి, అవి పవిత్రజలంగా మారతాయని, వాటిని తాగితే పవిత్రులవుతారని, ఏ ప్రదేశంపై వాటిని చల్లినా, ఆ స్థలం పునీతమవుతుందని గ్రీకులు నమ్మారు.

క్రైస్తవం ఏర్పడ్డ తొలిరోజుల నుంచీ నేటి వరకు మతకార్యాల్లో నీటికి ఎంతో పవిత్రతనాపాదించి వున్నారు. 'బాప్తిస్మం' ఒక వ్యక్తిని క్రైస్తవునిగా మార్చేందుకు జరిపే ఆచారం. ఆ సమయంలో పవిత్రజలాలతో ఆ వ్యక్తిని అభిషేకించాలి. అలా అభిషిక్తుడు (క్రీస్తు) కావడం ఆ మతప్రవేశానికి తొలిమెట్టు. అలాగే, దయ్యాలను, సైతాను పీడలను వదిలించడంలోనూ 'పవిత్రజలాన్ని'వాడతారు. పాతనిబంధనలోని సంఖ్యాకాండం (5వ అధ్యాయం)లో, ఇశ్రాయేలీలకు చెప్పమని కోరుతూ యోహెూవా, మోషేకు ప్రబోధించిన విషయం ఒకటుంది. ఒక స్త్రీకి శీలపరీక్ష చేయవలసి వచ్చినపుడు పూజారి ఆమెను యెహెూవా సన్నిధిలో నిలబెట్టి, నీళ్ళను మట్టిని కలిపి చేదునీళ్ళు తాగించారట. ఆమె తప్పు చేస్తే, ఆ నీళ్ళతో ఆమెకడుపుబ్బి నడుము పడిపోతుందని, తప్పు చేయకపోతే, గర్భవతి అవుతుందని యోహెూవా చెపుతాడు.

యూరప్‌లోని కొన్ని దేశాల్లో ఉన్న లూథరన్ చర్చీల బయట 'పవిత్రజలం' ఇచ్చే కుళాయిల ఏర్పాటు వుంది. చర్చిల్లోకి వెళ్ళేముందు ఆ నీటిని తలపై చల్లుకుంటారు విశ్వాసులు. దేవుని ముందు వుంచిన ఆ నీటిని అలా చల్లుకుంటే తాము పరిశుద్ధులమైనట్లే వారు భావిస్తారు. ఫ్రాన్స్‌లోని సెయింట్ లార్డెస్ చర్చిలో 18,19 శతాబ్దాల్లో పవిత్రజలం కోసం జనం బారులు తీరేవారు. ఆ నీళ్ళు తాగితే అన్ని రోగాలు నయమవుతాయని, పాపాలు పరిహరింపబడతాయని బలంగా నమ్మేవారు. అయితే, ఆ నీటిలో ఏ మహత్తూ లేదని, అందులో రసాయనాలు హానికరమని ప్రయోగశాల్లో రుజువయ్యాక, భక్తులు పలుచబడ్డారు. అయితే, ఇప్పటికీ ఉక్రెయిన్‌లో వున్న 'పోబెల్ లావ్రా' అనే పట్టణంలో ఒక చర్చిలోనూ, కాన్‌స్టాంట్ నోపిల్‌లోని ఒక ప్రవాహంలోను 'మహిమలజలం' వుందన్న ప్రచారం సాగుతోంది. ఆంధ్రప్రదేశ్‌లోని ఒకటి రెండు చోట్ల ముఖ్యంగా గుంటూరుజిల్లా కాకాని దగ్గర్లో వున్న ఒక క్రైస్తవ కేంద్రంలో ఇప్పటికీ పవిత్రజల పంపిణీ జోరుగా సాగుతోంది. అవి తాగితే పిల్లలు పుడతారని, పీడలు పోతాయని, అదృష్టం లభిస్తుందని, వ్యాపారం లాభిస్తుందని, రోగాలు తగ్గుతాయని... ఇలా ఎన్నో ఆకర్షణీయ ప్రచారాలు ఆ చర్చి పేరుతో జరుగుతూ, ప్రతివారం వందలాది అమాయక జనాన్ని వంచిస్తున్నాయి.

మనదేశంలో అన్ని మతాల కంటే ఆలస్యంగా ఏర్పడిన సిక్కుమతంలో కూడా 'బాప్తిస్మం' లాంటి తంతువుంది. నిజానికి, గురునానక్, మిగిలిన ప్రవక్తల కంటే, కొన్ని అంశాల్లో ఆధునికునిగా, సంస్కరణశీలిగా, కన్పిస్తాడు. సిక్కుగా మారడానికి ఆయన ఎటువంటి క్రతువూ ఏర్పర్చినట్లు కన్పించదు. కానీ, 1699లో 'ఖల్సా'ను స్థాపించిన సిక్కుగురువు గోవింద్‌సింగ్ 'అమృత సంచార్' అనే ఆచారాన్ని ప్రారంభించాడు. 'ఖల్సా'(సిక్కు పరివారం)లో సభ్యులు కాగోరే వారు దాన్ని పాటించాలి. పవిత్రజలంతో వారు పునీతులు కావాలి. అప్పటినుంచే పురుషులు 'సింగ్'లుగా, స్త్రీలు 'కౌర్'లుగా పేర్ల చివర ఉపనామాలుంచుకోగల్గుతారు.

ఇలాంటి 'పవిత్రజల' వినియోగం బౌద్ధశాఖల్లోనూ కన్పిస్తోంది. మహాయానులు పాత్రల్లో నీళ్ళుంచి 'అవలోకితేశ్వరు'నికి సంబంధించిన మంత్రాలు చదివాక, ఆ నీటిని తాగడానికి, లేదా ఇళ్ళ చుట్టూ చల్లుకోవడానికి వినియోగిస్తారు – వజ్రయానులు 'బంప' అని పిలవబడే పూర్ణకుంభంలాంటి పాత్రలో నీటిని వుంచి పూజించాక తాగితే జ్ఞానం, ఆయుష్షు పెరుగుతాయని నమ్ముతారు.

ఇస్లాంలోని ప్రధానశాఖల్లోనూ 'మహిమలుండే నీళ్ళు' వాడటం వుంది. ఇస్లాం మతస్థులకు పరమ పవిత్రక్షేత్రమైన 'మక్కా'నగరంలో, ముస్లింలు ఆరాధించే 'కాబా'కు 20 మీటర్ల దూరంలో 'జామ్‌జామ్' బావి వుంది. అందులోని నీరు దైవప్రసాదితమని భక్తుల విశ్వాసం. ఇబ్రహీం రెండో భార్య కుమారుడైన ఇస్మాయిల్ పసిబాలునిగా వుండి దప్పికతో వున్నప్పుడు, దేవదూత గాబ్రియేల్ వచ్చి, రెండు కొండల మధ్య ఆ బాలుడున్న ప్రాంతంలో నేలను కాలితో గట్టిగా తాకగానే, నీళ్ళు ఉబికి వచ్చాయని ఒక కథనం వుంది. అదెలా వున్నా, ప్రస్తుతం అక్కడ బావి వుంది. 30 మీటర్ల లోతు. ఆ బావి నీటిని ఇప్పుడు వడపోతకు గురిచేసి భక్తులకు అందిస్తున్నారు. ఆ నీళ్ళు కొండరాళ్ళ మధ్య నుంచి ధారగా పడుతుంటాయని, అవి చాలకపోవడంతో, భూగర్భం నుంచి కూడా తీస్తూ సరఫరా చేస్తున్నారని సౌదీ ప్రభుత్వం వివరిస్తోంది. కింగ్‌సౌద్ విశ్వవిద్యాలయ పరిశోధకుల నివేదిక ప్రకారం, ఆ నీటిలో సోడియం, కాల్షియం, క్లోరైడ్, ఫ్లోరైడ్, నైట్రేట్, సల్ఫేట్, లవణాలు ఎక్కువగా వున్నాయని తేలింది. అక్టోబర్ 2005లో బ్రిటీష్ ఆహార ప్రమాణాల సంస్థవారు, ఆ దేశంలో అమ్ముడవుతున్న 'జామ్‌జామ్' నీటిని పరిశోధించి, అందులో ఆర్సెనిక్ విషం అధికమోతాదులో వుందని వెల్లడించింది. అయితే, అవి నకిలీ నీళ్ళని, 'జామ్‌జామ్' నీటిని ఎగుమతిని సౌదీ ప్రభుత్వం నిషేధించిందని ఆ దేశపు ప్రభుత్వం ప్రకటించింది.

మక్కాకు వెళ్ళిన హజ్ యాత్రికులు తప్పక ఆ నీటిని దైవప్రసాదంగా భావించి తాగుతారు. దాని వల్ల ప్రవక్త మహమ్మదే స్వయంగా, ఆ నీటికి రోగాలు నయం చేసే శక్తి వుందని చెప్పినట్లు భక్తులు నమ్ముతారు. హదీసులలోనూ ఈ విషయం వుందంటారు. ఆ నమ్మకంతోనే ప్రతియేటా కోట్లాది ముస్లింలు తాగుతున్నారు. మహమ్మద్ మీద వున్న నమ్మకాన్ని నీటిమీదకు కూడా మళ్ళించి దానిని పవిత్రమని తాగటం ఇంత సముచితం? తాతలు తవ్వించిన బావి కదా అని ఉప్పు నీటిని తాగుతామా?

ముస్లింలోని షియాశాఖకు కూడా ఇలాంటి విశ్వాసం వుంది. వారి పవిత్రస్థలం ఇరాక్‌లోని 'కర్బాలా'. మహమ్మద్ ప్రవక్త మనుమడు, అతని కుటుంబమూ ప్రాణత్యాగం చేసిన ప్రదేశం గనుక, అది పరమ పవిత్ర స్థలమని దేవదూత గాబ్రియేల్ చెప్పాడట! అందుకే అక్కడ నేలమీద మట్టిని నీళ్ళల్లో కలుపుకుని తాగుతారు. ఈ నీరు రోగాలను తగ్గిస్తుందని, శారీరక, మానసిక రోగాలను తగ్గిస్తుందని వారి విశ్వాసం. అలాగే, మరో ముస్లిం శాఖగా ఉన్న 'ఇస్మాయిలీ'లు తమ 'ఇమాం' (మతగురువు) ఇచ్చిన నీటిని పవిత్రంగా భావించి తాగుతూ వుంటారు.

ఇలా చెప్పుకుంటూ పోతే, ప్రపంచవ్యాప్తంగా ఉన్న, దాదాపు అన్ని మతశాఖల అనుయాయుల్లోను, ఆచారాల్లోను నీటికి మహిమలను, పవిత్రతను ఆపాదించి, భక్తితో ఆస్వాదించడం కన్పిస్తుంది. ఎన్నో వందల, వేల ఏళ్ళ నుంచీ ఈ విశ్వాసం ఒక సంప్రదాయంగా మారి, మతంలో ఒక అంశంగా ఎంచబడి జనం మనసుల్లో నాటుకుని వుంది. ఆ విశ్వాసాన్ని బలపరుస్తూ ఎప్పటికప్పుడు కథలు, కల్పనలూ తయారవుతున్నాయి. ఆ విశ్వాసంలో శాస్త్రీయత లేదని, ప్రయోగాల ద్వారా నిరూపణ అవుతున్నా, ఆ ప్రయోగాలను అవహేళన చేస్తూ, ప్రతీఘాతుక సాహిత్యసృష్టి జరుగుతోంది. ఆ సాహిత్యం పన్నే వలల్లో పాలకులు సైతం చిక్కుకుని అటువంటి విశ్వాసాలను కట్టుదిట్టంగా కాపాడే చర్యలకు పూనుకుంటున్నారు. పుష్కరాల నీటిని సీసాల్లో నింపి పోస్టుద్వారా అమ్మటం కంటే మించిన నిదర్శనం, ఏముంటుంది దీనికి? గంగాజలాన్ని పాకెట్లలో నింపి, ఆన్‌లైన్ ద్వారా వ్యాపారం చేస్తుంటే, ఎగబడి కొంటున్న జనానికి, ఆ నీటిలో ఉన్న కల్మషం గురించి పట్టటం లేదు కదా!

'నీరే ప్రాణాధారము' అన్న సుమతీ శతకకర్త మాటలు అక్షరసత్యాలు. భూమ్మీద 70% నేల నీటితో నిండివుంది. ఆ నీరే ఆవిరవుతూ, వానగా కురుస్తూ, ప్రాణుల అవసరాలను తీరుస్తోంది. కనుక నీటికి మించిన బంగారం లేదు. అటువంటి విలువైన నీటిని స్వచ్ఛంగా వుంచుకోవడం, తాగటం అవసరం. నీటి వనరులను నిర్మలంగా వుంచుకోవాలి. కుంటలు, చెరువులు, కాల్వలు, నదులు, బావులు మొదలయిన

నీటినెలవులను కాలుష్యం నుంచి కాపాడుకోవాలి. మతవిశ్వాసాలు, ఆచారాలకే ప్రాధాన్యమిచ్చి, విగ్రహ నిమజ్జనాలు, నీటి పూజలు, శ్రాద్ధకర్మలు వంటి క్రతువులతో కలుషితం చేస్తే జరిగే నష్టం మనకే. నిల్వవుండే, నీటిలో గుంపులుగా పవిత్రస్నానాలు చేస్తే చెడేది మన ఆరోగ్యమే.

వాస్తవానికి, ఏ నీటికీ మహిమలుండవు. ఏ మంత్రాలు, దైవాలు నీటిని పవిత్రంగా, మహిమాన్వితంగా మార్చలేవు. తానిచ్చే నీళ్ళు తాగితే సంతానం కలుగుతుందని, కడుపులోని కల్మషాలు నశిస్తాయని బొంకే నీళ్ళ స్వాములు దగాకోరులు మాత్రమే. **'మంత్రజలముకంటె మంగలిజలమెచ్చు'** అని వేమన ఆనాడే యదార్థాన్ని దండోరా వేసి చెప్పాడు. పరివాహక ప్రదేశాలను బట్టి నీటికి ఔషధ గుణాలు కొన్ని సంక్రమించవచ్చు. వాటిని అలాగే స్వీకరించాలి తప్ప, మహత్తులుగా ప్రకటించి, మతంరంగు పులమకూడదు. అలా చేయడం వల్ల ఆ నీళ్ళే కాదు, మన మెదళ్ళు కూడా కలుషితమవుతాయి.

"మా నమ్మకం, మా ఇష్టం" అనే మాటలతో మంచిని తిరస్కరించడం అంటే, తమ అభివృద్ధిని నిరాకరించడమే. "వినదగునెవ్వరు చెప్పిన". విన్న దాన్లో వున్న నిజాన్ని స్వీకరించినవాడే వివేకి. గతంలోవున్న ఎన్నో నమ్మకాలు కాలప్రవాహంలో కొట్టుకుపోయాయి. కనుక, వికసిస్తున్న విజ్ఞానాన్ని స్వీకరిస్తూ, నమ్మకాల నిగ్గుతేల్చగలవాడే నేటి వివేకి. 'తమసోమా జ్యోతిర్గమయ' అన్న మాటలకు అతడే నిదర్శనం.



# విగ్రహాలకు ప్రాణప్రతిష్ఠ!

## మన వివేకానికి అప్రతిష్ఠ




1965 సం॥ 'దేవత' అనే సినిమా వచ్చింది. అందులోని ఒక పాట ఇప్పటికీ పలువుర్ని ఆకర్షిస్తూ వుంటుంది– "బొమ్మను చేసీ... ప్రాణము పోసీ... ఆడేవు నీకిది వేడుకా / గారడి చేసీ... గుండెను కోసీ... నవ్వేవు ఈ వింతచాలిక" పరిష్కారం తెలియని జీవన సమస్యలతో సతమతవుతున్న చిత్రకథానాయకుడు, తనను సృష్టించిన దేవుని ఉద్దేశించి పాడిన సందర్భమది. ఆ సందర్భాన్ని వదిలేసి, ఆ పాటలోని పదాలకున్న అర్థాన్నే తీసుకుంటే దానిభావం విగ్రహపూజకు కారకులయిన వారందరికీ వర్తిస్తుంది. పురోహిత వర్గానికీ వర్తిస్తుంది. మట్టితోనో, కట్టెతోనో, రాతితోనో, మరోలోహంతోనో బొమ్మల్ని చేసి, వాటికి ప్రాణప్రతిష్టగావించి, పలురకాల అర్చనల పేర అమాయకభక్తుల్ని ఆకర్షిస్తూ, వారి అజ్ఞానంతో ఆడుకుంటూ, వినోదంగా విలాసంగా జీవితాన్ని ఆస్వాదిస్తున్న దేవాలయ నిర్వహణా వ్యవస్థకంతటికీ వర్తిస్తుంది.

దేవాలయం, మందిరం, గుడి, కోవెల, దేవళం, దేవస్థానం... పేరేదైనా, అది హిందూమత జీవనసంస్కృతిలో ఒక ప్రధానస్థలం. తమకీ జీవితాన్ని యిచ్చిన భగవంతు డొకడున్నాడని, అతడు ఎక్కడున్నాడో తెలియక పోయినా, ఒక విగ్రహరూపు కల్పించుకొని ఆరాధించుకుంటే తమ కృతజ్ఞతలు చెల్లించుకున్నట్లవుతుందని

హైందవభక్తుల విశ్వాసం. దానికోసమే కొందరు, యింట్లో దేవుని చిత్రపటాలు, విగ్రహాలు పెట్టి, వాటికోసం ప్రత్యేకంగా పూజాగదిని ఏర్పర్చి, నిత్య దీపారాధన చేస్తుంటారు. ఊళ్ళో వున్న గుడికి వారానికొక సారైనా వెళ్లిమొక్కులు సమర్పిస్తుంటారు. దేశమంతటావున్న ప్రముఖ దేవస్థలాలకు వెళ్లి పూజలు సమర్పించి వస్తుంటారు. దైవప్రసన్నతకోసం పలురకాల మొక్కులు, పూజలు, ముడుపులు, దీక్షలు, వ్రతాలు, యాత్రలు, కొలుపులు, కళ్యాణాలు, బ్రహ్మోత్సవాలు... ఇంకా ఎన్నెన్నో పాట్లు పడుతుంటారు. 'గుళ్ళకు వెళ్ళి ఈ పాట్లెందుకు పడటం?' అని అడిగితే, 'తప్పు, అలా అనకూడదు, కళ్లుపోతాయ్' అని హెచ్చరిస్తారు. "గుళ్లో వున్నది ఒక బొమ్మేకదా" అంటే ఒప్పరు. ఆ బొమ్మకెంతో శక్తివుందని, ఆ శక్తికున్న మహత్తు వర్ణింపనలవి కాదని కథలు కథలుగా చెపుతుంటారు. "బొమ్మకు అంతటి శక్తి ఎలావస్తుంది" అంటే, దానిని గుడిలో ప్రతిష్టించినపుడే ఆవాహన అవుతుందని ఆగమశాస్త్రాలను సాక్ష్యాలుగా చూపుతారు.

హిందూ దేవాలయ వ్యవస్థకు మూలాధారం ఆగమాలు. ఇవి చాలా వున్నాయి. తమిళ, సంస్కృత భాషల్లో అవి వున్నాయి. గుడినిర్మాణం, విగ్రహాల తయారీ, పూజా పద్ధతులు, వాటికి సంబంధించిన తాత్విక వివరాలు వాటిల్లో వుంటాయి. ప్రతి ఆగమంలో 4 భాగాలుంటాయి– క్రియాపాదం, చర్యాపాదం, యోగపాదం, జ్ఞానపాదం. నిర్మాణం, శిల్పవిధానం, విగ్రహ ప్రతిష్ట, అర్చనల వల్ల ప్రయోజనాలు మొదలయిన వాటిని అవి వివరిస్తాయి. గుడిలో మూలవిరాట్టునెక్కడ వుంచాలి అన్న స్థల ఎంపిక దగ్గరనుంచి, ప్రతి చిన్న అంశమూ ఆగమాల్లో వుంటుంది. 'ఆగమవాస్తు' ఒక ప్రత్యేక విభాగం. ఏ విగ్రహం ఏ ఆకృతిలో వుండాలో ఎక్కడ దానిని వుంచాలో కూడా ఆ శాస్త్రం చెపుతుంది. ఆ శాస్త్రప్రకారం గుడివుంటేనే, అందులో దైవశక్తి నిండి వుంటుందని, లేదంటే, ఆ దైవానికైనా ముప్పు తప్పదని హెచ్చరిస్తుంది.

దైవం బూచిని చూపించి, పురోహితవర్గం, 'రాజుల సొమ్మును రాళ్లపాలు' గావించింది. ప్రజల నుంచి పీడించి వసూలు చేసిన పన్నుల్లో అధికభాగాన్ని దేవాలయాలకే వినియోగించటం చరిత్ర అంతటా మనకు కన్పిస్తుంది. ఒక గుడిని నిర్మించటానికి ఏళ్లు గడిచేవి. కోట్లు ఖర్చయ్యేవి. అలా నిర్మించిన గుడిలో మూలవిరాట్టును స్థాపించటానికి జరిగేతంతుకు అంతకుమించి ఖర్చయ్యేది. రాజు తలచుకుంటే దెబ్బలకే కాదు డబ్బులకూ కొదవ వుండదు గదా!

## 'ప్రాణప్రతిష్ఠ' అంటే?

గుడిలో మూలవిగ్రహాన్ని నిలిపి, దానికి 'ప్రాణం పోసేందుకు'(?) జరిపే పురోహితుల తంతునే 'ప్రాణప్రతిష్ఠ' అంటారు. ఇది అయిదురోజులపాటు జరిగే ఒక భారీతతంగం. 90 విధివిధానాలను అనుసరించవలసి వుంటుంది. 'మంగళా చరణం' దగ్గర నుంచి 'శాంతికళ్యాణం' వరకూ వుండే ఆ విధుల్లో ఎన్నో పదార్థాలు, సామాగ్రి అవసరమని పురోహితులు చేంతాడంత జాబితా చెపుతారు. పసుపు కుంకుమల దగ్గరనుంచి, మూలవిగ్రహం కింద వుంచాల్సిన నవరత్నాలు, పంచధాతువులు (బంగారం, వెండి, రాగి, కంచు, తగరం) లతో సహా అన్నీ సమకూర్చవలసిందే. 16 స్తంభాలయాగశాల ఏర్పర్చి, అయిదురోజులపాటు అందులో రుత్విక్కులతో (వేదమంత్ర పాఠకులు) పలుయాగాలు చేయించాలి. 5వ రోజున "ప్రాణప్రతిష్ఠ" వుంటుంది.

**"అస్యశ్రీ ప్రాణప్రతిష్ఠ మంత్రస్య బ్రహ్మవిష్ణు మహేశ్వరం ఋషయః,**
**ఋగ్వజుస్సామాధర్వాని ఛందాంసి,**
**సకల జగత్ సృష్టిస్థితి సంహారకారిణి శక్తిః పరదేవతా"**

అనే మంత్రంతో ఆ తంతు మొదలవుతుంది. ఓం, హ్రీం, క్రోం, అనే బీజాక్షరాలనే మార్చిమార్చి చదువుతూ విగ్రహంలోని ప్రతి అవయవంలోనూ ప్రాణాన్ని ప్రతిష్ఠ చేస్తున్నట్లు మంత్రాలు చదువుతారు.

**"సర్వేంద్రియాణి, వాఙ్మనస్త్వక్ చక్షుఃశ్రోతృ జిహ్వాఘ్రాణ పాణిపాద పాయూపస్థాని**
**ఇహైరాగత్య సుఖ:చిరన్ తిష్ఠంతు స్వాహ"**

అంటే, 'వాక్కు, మనస్సు, చర్మం, నేత్రం, చెవి, నాలుక, ముక్కు, చేతులు, కాళ్లు, గుదము, ఉపస్థ, .... ఈ అవయవాలన్నింటా ప్రాణం చిరకాలమూ వుండునుగాక!'

**"రక్తాంబోధిస్తపానోల్లస దరుణ సరోజాధిరూఢాకరాబ్జైః**
**పాశంకోదండ మిక్షూద్భవ మణిగణమప్యంకుశం పంచబాణాన్**
**బిభ్రాణాస్రుక్కపాలం త్రినయన విలసత్పీన వక్షోరుహాఢ్యా**
**దేవీబాలార్క వర్ణాభవతు సుఖకరీ ప్రాణశక్తిః పరా నః"**

అనే ఈ ఒక్క శ్లోకాన్నే 15 సార్లు చదవాలిట! ఎందుకంటే, మూలవిరాట్టులోకి ప్రవేశించే 'ప్రాణశక్తి' దేవతాకృతి ఎలావుంటుందో ఈ శ్లోకం వర్ణించింది. 'ఆ దేవత తామర పూవుమీద కూర్చొనివుంది. రక్తసముద్రం నుంచి ఉదయించే సూర్యకిరణాల తాకిడివల్ల వికసించిన ఎర్రని పూవు అది. ఒకచేతిలో, తాడు , విల్లు, అంకుశం, చెరకుగడ

నుంచి పుట్టిన మణిగణాలు మరోచేతిలో రక్తపు పుర్రె వున్నాయి. ఆ దేవత ముక్కంటి. లావుగా వున్న వక్షసంపద కూడా వుంది. లేత సూర్యుని రంగుతో మెరసిపోయే పరదేవత అయిన ప్రాణశక్తి మా అందరికీ సౌఖ్యాలను ఇచ్చుగాక'.

ప్రాణశక్తి అంటే అదేదో వెలుగో, వాయువో, కంటికి గోచరంగాని మరోటో కాదని ఈ శ్లోకం చెపుతోంది. అదికూడా, కాళికవంటి భయానకాకృతి గల దేవతే. అలాంటి ఆకృతి మరోవిగ్రహంలోకి ఎలా వెళుతుందో! వాళ్ళే చెప్పాలి.

శరీరం 96 తత్వాలతో కూడి వుంటుందని ప్రాచీనుల ఊహ. పంచభూతాలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు... వగైరాలందులో వన్నాయి. అవన్నీ దేవుని విగ్రహాలకూ వున్నాయని, ప్రతి దాన్నీ ప్రతిష్ఠించటానికి ఒక్కొక్క మంత్రాన్ని కల్పించారు. ఆ మంత్రాలవల్ల విగ్రహాలకు ప్రాణం వస్తుందట. అప్పటి వరకు విగ్రహం కళ్లకు వుంచిన మైనాన్ని తొలగించి కొత్తబట్టలతో అలంకరించి, మొదటగా "క్షీరాన్నాన్ని" నివేదించాలట! ఆ తర్వాత, అప్పటి వరకు ఎవర్నీ చూడనివ్వ కుండా అడ్డుగా వుంచిన తెరను తొలగించి, ఎదురుగా వుంచిన అన్నరాశిని, దీపాన్ని, నీటికలశాన్ని, ఆవు పృష్ఠభాగాన్ని, అద్దాన్ని, భర్తమరణించని / కన్యకాస్త్రీలను 'స్వామికి' చూపించాలట! ఆ తర్వాతనే మొదటి పూజను, మంత్రపుష్పాన్ని సమర్పించాలని 'ప్రాణప్రతిస్థావిధి' తెలియజేస్తోంది.

ఈ శ్లోకాలు, మంత్రాలు, పూజలు, ఒక ప్రాణంలేని బొమ్మకు ప్రాణం పోస్తాయని ఎలా నమ్మటం? అని మనం ప్రశ్నించామనుకోండి. వెంటనే వాళ్ళు మరోశ్లోకం చదువుతారు.

"దైవాధీనం జగత్సర్వం, మంత్రాధీనంతు దైవతం"

ఈ ప్రపంచమంతా దైవాధీనంలో వుంది. ఆ దేవుడు మంత్రాలకు అధీనుడు. కనుక 'మంత్రశక్తి'తో విగ్రహాలకు, బొమ్మలకు ప్రాణంపోస్తాం అంటారు వాళ్లు. ఎవరా 'వాళ్ళు'? ఇంకెవరు–ఆ మంత్రాలన్నీ తమ అధీనంలోనే వున్నాయని చెప్పిన పూజారులు/ పురోహితులు. తాము కల్పించిన మంత్రాలను వల్లించి, విగ్రహాలకు ఊపిరి తెచ్చామని, వాటిని పూజించటం వల్ల సకలసుఖాలు లభిస్తాయని కథలు, గాథలు కల్పించి జనంమీదకి వదలటం వల్లనే గుళ్లు, దేవుళ్లు పెరిగి పోయాయి. ఈ ప్రాణప్రతిష్ఠా కార్యక్రమం తర్వాత, బ్రాహ్మణులందరికి దశదానాలు చేయాలి. గోవులు, భూమి, తిలలు, బంగారం, నేయి, బట్టలు, ధాన్యం, బెల్లం, వెండి, ఉప్పు–అనేవి పంచితేనే చేసిన ప్రతిష్ఠకు సార్థకత, సంపూర్ణత అని వారే చెప్పారు.

## మిధ్యావాదనలు - మృషాచారాలు

ప్రాణప్రతిష్ఠ కోసం చదివిన మంత్రాలవల్ల ఒక మూలవిగ్రహానికే కాదు, ఆ గుడి అంతటా కూడా ప్రాణశక్తి ఒక 'ఆవరణ'గా ఏర్పడుతుందని ఆధునిక పురోహితులు వ్యాఖ్యానిస్తున్నారు. దానికుండే అద్భుతం వల్ల అక్కడికి వెళ్ళిన ప్రతి ఒక్కరికీ ఆరోగ్యం కుదురుతుందని, పీడలు తొలగుతాయని డంబాలాడుతున్నారు.

హైందవ ఆధ్యాత్మికులు జనాన్ని దేవాలయాలకు తరలించటానికి ఎన్నో ఆకర్షణలు కల్పిస్తుంటారు. మహత్యాలు ఆపాదిస్తుంటారు. స్థల పురాణాలు, దేవీదేవతా మహత్కార్యాలు కల్పిస్తుంటారు. అవిగాక, ఆధునిక విజ్ఞానాన్ని కూడా మిళితం చేస్తూ విద్యావంతుల్ని సైతం గంగిరెద్దుల్ని చేయటానికి కొన్ని కారణాలను వల్లిస్తుంటారు. గుడికి వెళ్ళటం వల్ల మూడు ప్రయోజనాలున్నాయట-

1. దేవాలయాలన్నీ దైవికశక్తితో నిండివుంటాయి. అవి ఖగోళంలోని గ్రహాల, రాశులతో సంబంధించి వుంటాయి. కనుక ఇంట్లో జరిపే పూజకంటే, గుళ్లో జరిపే పూజవల్ల ఫలితం ఎక్కువ సిద్ధిస్తుంది.

2. గుళ్లకు వెళితే దోషాలన్నీ పోతాయి. ప్రతి వ్యక్తిమీద ప్రకృతిలోని దుష్టశక్తుల ప్రభావం ఆకాశం నుంచి దుష్టగ్రహాల, రాశుల ప్రభావం పడుతూ వుంటుంది. వాటన్నింటిని తొలగించి, పవిత్రపరిచే శక్తి గుడిలోనే వుంటుంది.

3. గుడికి వెళితే, పారలౌకిక ఆనందమూ లభిస్తుంది. గుడిలో శిల్పాల నిర్మాణం, అక్కడ విన్పించే కీర్తనలు, మంత్రాలు, ధూపదీపాల వాసనలు, చిహ్నాలు, ఆచారాలు మొదలయినవన్నీ భక్తుల్లో పారవశ్యాన్ని పెంచుతాయి. దాంతో మనసులోని బాధలన్నీ తొలగిపోతాయి.

పై మూడింటివల్లే దైవవిశ్వాసులు గుళ్లకు బారులు కడుతుంటారని పరిశీలకులంటున్నారు. ప్రవచనాలు వల్లించే వారు, కాషాయవేషధారణతో వేదాంత బోధలు చేసేవారు, దైవదర్శన లాభాలను గూర్చి గంటలకొద్దీ చెప్పే ఉపన్యాసాల సారంలో ఇవే వుంటాయి. అంతేకాదు, **18వ శతాబ్ది ముందు వరకు సైన్సు గురించి వీళ్లకి తెలియదు. సైన్సు ఫలితాలే ప్రమాణాలని జనం విశ్వసిస్తున్నారు గనుక, తమభక్తి ప్రవచనాలకు, దైవమహత్తుకు, దేవాలయ దర్శనాలకు సైన్సు చెప్పిన అంశాలను జోడించి సమర్ధించటం, తద్వారా జనంలో భక్తిని తగ్గకుండా చేయటం ముఖ్యకర్తవ్యంగా చేసుకున్నారు.**

## బట్టతలకీ మోకాలికీ ముడి

శక్తి (Energy) గురించి 17వ శతాబ్దిలో భౌతికంగా ఆలోచించిన వ్యక్తి లీబ్నిజ్. తర్వాత వందేళ్ళకు, దానిపై మరికొన్ని వాస్తవాలు వెల్లడయ్యాక, శక్తి రూపాంతరం చెందుతుందని, దానిని ఎవరూ పుట్టించలేరు, నాశనం చెయ్యలేరన్న న్యూటన్ సిద్ధాంతం వచ్చింది. 'ఒక పదార్థానికి వుండే పని సామర్థ్య ప్రమాణమే శక్తి'గా నిర్వచింపబడింది. అది భౌతికమే కాని, అభౌతికం కాదని రూఢి అయింది. 19, 20 శతాబ్దాల్లో శక్తిరూపాంతరాలయిన, చలనశక్తి, గురుత్వశక్తి, రసాయనశక్తి, ఉష్ణశక్తి, రేడియంట్ శక్తి, ఎలాస్టిక్ శక్తి అనేవాటిపై పరిశోధనలు పెరిగి, భౌతికశాస్త్ర పరిధి విస్తరించింది. ప్రపంచంలో ప్రతిదీ పదార్థం, శక్తిలతో కూడివుందని తెలియవచ్చింది. ఈ శాస్త్రీయ ప్రచారాల వ్యాప్తి దేవుని ఉనికిని కూడా తాకింది. దేవుడంటూ వుంటే, భౌతికశక్తులకతీతంగా వుండటం సాధ్యంకాదని సైన్సు ప్రపంచం భావించసాగింది.

ఈ పరిస్థితిలో, దైవం వునికిని ఎలాగైనా పట్టివుంచాలని భావించినవారు తెచ్చిన పదమే 'ప్రాణశక్తి' (Life force). 20వ శతాబ్దిలో ఈ పదం వ్యాప్తిలోకి వచ్చి, అనేక అశాస్త్రీయ విధానాలకు ఆలంబనగా నిలిచింది. రేకి, ప్రాణిక్ హీలింగ్, ఆక్యుపంక్చర్, ఎలక్ట్రోథెరపీ వంటి వైద్య విధానాలకు అదే మూలం. 'న్యూయేజ్' పేరుతో పలుతలతిక్క ప్రచారాలు రావటానికి అదే కారణం. శాస్త్రరంగంలో వున్న కొందరు, శాస్త్రీయస్పృహను కోల్పోయి, అభౌతికశక్తుల ఉనికిని సమర్థించటానికి, నిరూపించటానికి పూనుకొని, సైన్సును అవమానించారు. ఆ తర్వాత అభాసుపాలయ్యారు. ఈ 'ప్రాణశక్తి' అనేది "ప్రత్యేక జ్ఞానంవున్న కొద్దిమందికే అవగాహన" అవుతుందని, ప్రయోగశాలలకు అందదని ప్రచారం చేసారు ఆ కుహనా శాస్త్రవేత్తలు. తమవాదానికి 'Esotericism' అనిపేరు పెట్టారు.

ఇటువంటి వాతావరణంలో, దేవుని విగ్రహాల్లోనూ అటువంటి ప్రాణశక్తి వుంటుందని, దైవాలయాలన్నీ అలాంటి కాస్మిక్ ఎనర్జీతో నిండివుంటాయన్న ప్రచారం ఆధ్యాత్మికరంగం మొదలు పెట్టింది. అందుకు ఒకరిద్దరు భౌతికశాస్త్రవేత్తలు కూడా తోడ్పడ్డారు. వారిలో ముఖ్యుడు 'విలియం టిల్లర్'.

విలియం టిల్లర్ ఇంజనీరింగ్ ఫిజిక్స్‌లో పట్టభద్రుడు. కెనడాలో చదివాడు. 34 ఏళ్లు ప్రొఫెసర్‌గా పనిచేశాడు. ప్రసిద్ధమైన స్టాన్‌ఫర్డ్ యూనివర్సిటీలో మెటీరియల్ సైన్సు విభాగ అధిపతిగా కూడా చేసాడు. 1998లో ఆయన ఉద్యోగ విరమణ పొందాక Esoteric (సైన్సుకు అందనిది) భావనలవైపుకి మళ్లి "సైకో ఎనర్జిటిక్స్" అనే ఒక కొత్తపదబంధంతో 'కొత్త సైన్సు విభాగాన్ని' తెస్తున్నానని చెప్పుకున్నాడు.

## అదేం చెపుతుంది?

పేరును బట్టే చెప్పవచ్చు- మానసిక శక్తుల ప్రభావాన్ని చెప్పే శాస్త్రమని, దృఢమైన మనోభావనల ద్వారా భౌతికపదార్థాల్లోని చర్యాప్రతిచర్యల్లో మార్పు తేవచ్చునని, రసాయనిక మార్పులూ సాధ్యమేనని ఆ విభాగం చెపుతుంది. దీనిని నిరూపించటానికి టిల్లర్ కొన్ని ప్రయోగాలను చేసానని చెప్పుకున్నాడు. టిబెట్‌లోని బౌద్ధసన్యాసుల ధ్యానంపై పరిశోధనలు జరిపితే, ఒక యంత్రంలోని అణువుల స్థాయిలో మార్పులను నియంత్రించగలిగినట్లు కనుగొన్నానన్నాడు. వాటిని కొలవటానికి ఆయన "Intention Host Devices" అనే పరికరాలను తయారు చేసాడు. అవి 'రిమోట్'లాగా వుండి, ఏకాగ్రతలో వుండే వ్యక్తుల మనోభావాలను రికార్డు చేసి, సమీపంలో వున్న వస్తువులలో భౌతికరసాయన మార్పులకు దోహద పడతాయట! అందుకు, ఆయన ఒక ఉదాహరణ గొప్పగా చెప్పుకునేవాడు.

"మనం ఒక పాత్రలోనికి నీళ్లు తీసుకొని, అందులోవున్న Ph స్థాయిని మార్చాలని పదేపదే మనసులో అనుకుంటే, తప్పనిసరిగా, ఆ నీటిలోని ఆమ్లగుణంగానీ, క్షారగుణంగానీ పెరగటమో తరగటమో జరుగుతుంది. ప్రయోగశాలలో అయితే, రసాయనాల ద్వారా మాత్రమే ఇది సాధ్యం. కానీ, సైకో ఎనర్జిటిక్స్ ప్రకారం ఏ రసాయనాలూ లేకుండా ఆ పని చేయవచ్చు" అంటాడాయన. ఇది చాలా పేలవమైన ప్రయోగమని టిల్లర్‌ని ఖండిస్తూ పలువురు నిరూపించారు. నీరు వుంచిన గది, వాతావరణ ఉష్ణోగ్రతల ప్రభావం వల్లకూడా నీటిలో ఆ మార్పు సాధ్యమేనన్నారు.

బ్రియాన్ డన్నింగ్ లాంటి శాస్త్రవేత్తలు టిల్లర్ ప్రచారాలన్నీ అబద్ధాలని నిరూపించారు. ఆయన చెప్పే సైకోఎనర్జిటిక్ అశాస్త్రీయమన్నారు. శక్తి అనేది "కొలవదగిన పనిసామర్థ్యం". కాగా, దాన్ని ఒక నామవాచకంగా మార్చి, ప్రతి వస్తువుకీ శక్తిక్షేత్రాలుంటాయని, అవి అద్భుతాలను, అభౌతికక్రియలను చేయగలవని చెప్పటం అవాస్తవమన్నాడు. ఆధ్యాత్మిక శక్తి క్షేత్రాలకు (Spiritual Energy Fields) ఏ శాస్త్రీయ ఆధారమూ లేకపోయినా, కొంత మంది రచయితలూ, ప్రచారకులూ దానిని బాగా ప్రచారంలోకి తెచ్చి కుహనాశాస్త్రం ఏర్పర్చారని మరికొందరు అభిప్రాయపడ్డారు.

మంత్రాలు కూడా అటువంటి కుహనా శాస్త్రమయ్యాయి. Mantrik Science అని కొందరు పిలుస్తున్నారు కూడా. దాన్ని విశ్వవిద్యాలయాల్లో కోర్సులుగా పెట్టి డిగ్రీలివ్వటానికి మనదేశంలో 2000 సం॥లో కేంద్ర మానవ వనరులశాఖ ప్రయత్నించింది. విలియం టిల్లర్‌కున్న ప్రఖ్యాతి, ఇలాంటి కుహనాశాస్త్రాలకు ఆలంబన.

మంత్రాలను ఉచ్ఛరించటం వల్ల, విగ్రహానికి ప్రాణం ప్రతిష్ఠింపబడాలని గట్టిగా భావించటం వల్ల ఆయాదేవతా మూర్తులకు 'శక్తి' ఉత్పన్నమవుతుందని, ఐదురోజులపాటు ఇదే ప్రక్రియ దేవాలయప్రాంగణంలో జరుగుతుంది గనుక, ప్రాణశక్తి ఆ ప్రాంగణమంతటా నిండి, శాశ్వతమవుతుందని సమర్థించటం మొదలు పెట్టారు ఆధ్యాత్మిక బోధకులు. ఈ 'సైన్సు' మన ప్రాచీన రుషులకీ, మంత్రవేత్తలకీ తెలుగు గనుకనే 'మంత్రాధీనం జగత్సర్వం' అని చాటారని కూడా అంటారు. విగ్రహాలకు "ప్రాణ ప్రతిష్ఠ" ప్రక్రియ పూర్తిగా శాస్త్రీయం అని వాదిస్తారు.

"ప్రాణప్రతిష్ఠ అనేది ఒక జీవవిధానం. మట్టిని అన్నంగా మార్చితే, దాన్ని వ్యవసాయం అంటాం. అన్నాన్ని శరీరమాంసంగా, ఎముకలుగా మార్చి 'జీర్ణక్రియ' అంటాం. తిరిగి ఆ మాంసాన్నే (చనిపోయాక) మట్టిగా మార్చటాన్ని పూడ్చిపెట్టటం అంటాం. అలాగే, ఒక రాతినో, ఒక శూన్యప్రదేశాన్నో దైవంగా మార్చితే అదే ప్రాణప్రతిష్ఠ. ఒకేవిధమైన శక్తి వేలాది విభిన్నరూపాలుగా మారుతుందని, ఆధునిక విజ్ఞానం కూడా చెప్తోంది గదా!॥

*(జగ్గీవాసుదేవ్, డిశంబర్ 20, 2011)*

మంత్రాలు కేవలం మాటలు కాదని, వాటికి అతీతశక్తులుంటాయని, కోపంతో ఉచ్చరిస్తే అవి శాపాలుగా మారి పీడిస్తాయని, చేతబడులుగా మారి జనాన్ని చంపుతాయన్న నమ్మకం వేదకాలం నుంచి వుంది. అలాగే, సంతోషంతో చెప్పే మాటలు శుభాన్నిస్తాయని అందుకు 'పెళ్లిమంత్రాలు' సాక్ష్యమంటారు. ఇలా 'మంత్రం' మీదున్న బలమైన నమ్మకం మన మెదళ్లలో తిష్టవేసి వుంది గనుకనే ఇప్పటికీ జనం వాటికి తలవంచుతున్నారు.

## విగ్రహాలకే ప్రాణం వుంటే...

గుడిలో దేవతకు ప్రాణప్రతిష్ఠ జరిగిన వెంటనే, మనిషికి చేసినట్లే అన్నీ చేస్తారు. బట్టలు తొడుగుతారు, దీపం వెలిగిస్తారు. అన్నం, నీళ్ళు, నైవేద్యంగా పెడతారు. భక్తులను పరిచయం చేస్తారు. అంటే, ప్రాణంగల వ్యక్తిలాగానే దేవునికీ అన్ని సపర్యలు జరగాలి. జీవులకుండే అన్ని సహజలక్షణాలు వస్తాయని గదా ఉద్దేశం. ఆ వుద్దేశంతోనే గదా, గుళ్లల్లో ఉదయం సుప్రభాతం దగ్గర నుంచి, రాత్రి పవళింపుచేసే వరకు నిత్యసేవలు జరుగుతాయి. ఆ వుద్దేశ్యంతోనే గదా, కళ్యాణాలు, బ్రహ్మోత్సవాలు ఊరేగింపులు! నిజంగా విగ్రహాలకు ప్రాణం వుంటే, ప్రాణులకుండే సహజలక్షణాలు- పెరుగుదల, కదలిక, స్పందించేగుణం, భావనలు మొదలయినవన్నీ వుండాలి. కానీ అవి వున్న దాఖలాలేవీ?

1. గుళ్లలో ఎన్నోమార్లు దొంగలు ప్రవేశించి దోచుకున్నారు. వాటిల్లో పనిచేసే వారుకూడా కొన్నిమార్లు దొంగతనాలకు పాల్పడ్డారు. కానీ, ఏనాడూ ఏ దేవుడూ దొంగల్ని ఆపలేదు, ఎదరించలేదు.

2. 'రాళ్ల దేవులయిన రాశులు మింగవా?" అన్న వేమన మాట ఈనాటికీ అబద్ధమని రుజువు కాలేదు. ఏ దేవుడూ తనముందుంచిన నైవేద్యాన్ని తిన్న రుజువులు లేవు.

3. ఎందరో పరరాజులు మనదేశంలోని గుళ్లపై దాడిచేసి మూలవిరాట్టులను ధ్వంసం చేసారు. వాటిని ఎత్తుకెళ్లి తమ యిళ్ళముందు మెట్లుగా వాడుకున్నారు. అయినా, ఏ దేవుని స్పందనా వ్యక్తం కాలేదు.

4. హైందవులయిన పాలకులు సైతం చరిత్రలో ఎన్నో గుళ్లను కూల్చారు. మొన్న గుజరాత్‌లోనూ, నిన్న విజయవాడలోనూ ముఖ్యమంత్రులుగా వున్న హిందూపాలకులు కొన్నిడజన్ల ఆలయాలను కూల్చివేశారు. ఏ దేవుని ఆగ్రహమూ వ్యక్తం కాలేదు.

5. ఏ దేవుని విగ్రహమూ, నైవేద్యాలు ఆరగించి ఎన్ని సంవత్సరాలు గడిచినా, అంగుళం మేర అయినా ఎత్తు పెరిగిన దాఖలా లేదు.

ఇలా మరికొన్ని జీవలక్షణాల గురించి కూడా చర్చించవచ్చు. కానీ దేనికీ రుజువు లుండవు. ఎందుకంటే, బొమ్మలకు ప్రాణం ఉండదు గనుక.

ఈమాట, నాస్తికులో, మానవవాదులో, మరోభౌతికవాదులో అన్నదికాదు. సాక్షాత్తూ గరుడపురాణమే చెప్పింది.

**"నకాష్టేవిద్యతే దేవో, న పాషాణే, నమృణ్మయే**
**భావే హి విద్యతే దేవః తస్మాద్ భావో హి కారణమ్ (30–13)**

'దేవుడు కొయ్యలోనో, రాతిలోనో, మట్టిబొమ్మలోనో లేడు. మన భావనలో వున్నాడు. కనుక ఉన్నాడన్న భావనే అతని ఉనికికి కారణం' అంటోంది ఆ పురాణం.

అందుకే, దైవంపట్ల విశ్వాసమున్న హిందువులు కూడా కొందరు విగ్రహాలను పూజించడం తప్పన్నారు. విగ్రహారాధనను వ్యతిరేకించారు. వారి దృష్టిలో ప్రాణప్రతిష్ఠ ఒక నిరర్థక క్రియ. 'రాయే దేవుడయితే, నేను ఒక కొండనే పూజిస్తాను' అని కబీరు అన్నది ఆ దృష్టితోనే. **"మనిషి చేసిన రాయిరప్పకు మహిమ గలదని సాగిమొక్కుతు,**

మనుషులంటే రాయిరప్పల కన్న కనిష్ఠంగాను చూస్తావేల బేలా?" అని మహాకవి గురజాడ అన్నదీ ఆ దృష్టితోనే.

## 'మూర్తిపూజ పోపుల వంచన'

విగ్రహాలకు ప్రాణప్రతిష్ఠ వల్ల ప్రాణం వస్తుందని, ఇది ఆర్షాచారమని, వేదకాలం నుంచి వుందని వాగాడంబరం ప్రదర్శించే వారికి ఆర్యసమాజ వ్యవస్థాపకుడు దయానంద సరస్వతి గట్టిగానే జవాబిచ్చాడు. "వేదమంత్రాలతో ఆవాహన చేయకపోతే దేవతలు రారు. ఆవాహన చేయగానే వస్తారు. విసర్జిస్తే వెళ్లిపోతారు గదా!" అన్న మాటకు ఆయనిచ్చిన జవాబు విగ్రహారాధనకు ఒక సమ్మెటపోటు. **"మంత్రములను చదివి ఆవాహన చేసినపుడు దేవత వచ్చునేని మూర్తి (విగ్రహం) చేతనమేలరాదు? విసర్జనము చేసినందువల్ల ఎందుకు వెళ్లిపోదు? దేవత, మూర్తిలోనికి ఎటనుండి వచ్చును? ఎక్కడకు బోవును? నాయనా, విను! పూర్ణుడైన పరమేశ్వరుడు రాడు, పోడు. మంత్రబలముతో పరమేశ్వరుని పిలవగలుగు నెడల, ఆ మంత్రముల బలముతోనే చనిపోయిన పుత్రుని శరీరము నందు జీవుని ఏల పిలవవు? శత్రువుల శరీరములనందుండు జీవులను మంత్రములు చదివి, విసర్జనము చేయరాదా? అమాయక సోదరులారా! వినుడు. ఈ పోపులు(పురోహితులు, పూజారులు) మిమ్ములను వంచించి తమ ప్రయోజనములను సిద్ధము చేసుకొనుచున్నారు. వేదములందు మూర్తిపూజకు గాని, దేవతను ఆహ్వానించుటకు, విసర్జించుటకు గానీ, యెక్కడ ఒక్క యక్షరము కూడా లేదు."**

**– (సత్యార్థ ప్రకాశము పేజి: 271)**

మంత్రాలతో విగ్రహాలకు ప్రాణం పోయటం ఒక వంచన అని దయానంద సరస్వతి చాలా స్పష్టంగా చెప్పాడు. అది పూజారుల, పురోహితుల స్వప్రయోజనాలకోసమేనన్నాడు. హిందువుల పవిత్రవేదాల్లో ఒక్క మంత్రం కూడా దీనికి సంబంధించి లేదన్నాడు. మరైతే, ఎప్పట్నుంచి ఈ తంతు మొదలయింది?

దానిక్కూడా ఆయనే సమాధానం చెప్పాడు.

**విగ్రహపూజ మొదట జైనుల్లో మొదలయిందని, వారి విగ్రహాలు శాంతంగా, ధ్యానస్థితిలో వుండేవని వాటివలే విగ్రహాలు నిర్మిస్తే, తమ హిందువులు కూడా జైనం వైపు ఆకర్షితులవుతారన్న భయంతోనే, స్త్రీపురుష విగ్రహాలను కలగలుపుతూ, శృంగార భంగిమలను జోడిస్తూ ఆకర్షణీయంగా హిందువులు మార్చారని దయానంద సరస్వతి**

**భావన. (సత్యార్థ ప్రకాశిక, పేజి: 267)**. అంతేకాక, వ్యాసాది మహర్షుల పేర్లతో తమయిష్టం వచ్చిన కథలుగల గ్రంథాలు రాసి వాటికి పురాణాలని పేరు పెట్టారనేది ఆయన పేర్కొన్నాడు.

భారతీయ తత్వశాస్త్రంలో 'విగ్రహారాధన వ్యతిరేకత' కూడా ఒక ప్రధానాంశం. దానికి, ఎన్నో కావ్యాల్లోని, పురాణా ల్లోని, తాత్విక రచనలోలని కొటేషన్లను యివ్వవచ్చు. వారంతా విగ్రహాలను, ప్రాణప్రతిష్ఠను వ్యతిరేకించినవారే. ఇతర హైందవ మతాచారాలను అనుసరించినవారే. అంతదాకా ఎందుకు? మోహన్‌దాస్ కర్మచంద్ గాంధీ కూడా ఏనాడూ ఏ విగ్రహాన్నీ పూజించలేదు, ఏ గుడికీ వెళ్లలేదు. సత్యాన్ని ఆశ్రయించినవారు, గౌరవించినవారు విగ్రహాల ప్రాణప్రతిష్ఠ తంతును ఆమోదించలేరు.

"దున్నపోతు ఈనిందిరా అంటే, దూడను కట్టేయ్" అని చెప్పేకాలంలో యిపుడు మనం లేము. ప్రతిదానికీ రుజువులు, సాక్ష్యాలు సంపాదించి, న్యాయాన్యాయాలను, యుక్తాయుక్తాలను నిర్ణయించుకొంటున్నాం. అలాంటి వివేచనాశక్తి పిల్లల్లో పెరగాలనీ కోరుతున్నాం. ఇలాంటి దశలో బొమ్మలకు ప్రాణంపోయవచ్చని, విగ్రహాలకు శక్తులు, మహత్తులుంటాయని, అవి మన బాధల్ని, పీడల్ని తొలగించు తాయని నమ్మటం మన వివేకానికి అప్రతిష్ఠ కాదా? సాంస్కృతికంగా మన సమాజం ఎదగటానికి ఇలాంటి ఆలోచనలు ప్రతిబంధకం కాదా? మీరే ఆలోచించండి.



# నమ్మండి, మోసపోండి!



ఒకాయన ఉదయాన్నేలేస్తాడు. సూర్యునికి దూరంగా కూర్చుని, రెండు కళ్లతో సూర్యుని చూస్తూ వుంటాడు. అలా ఎన్నిగంటలు కూర్చున్నా, తనకి ఆకలి దప్పులూ వుండవంటాడు. సౌరశక్తి వల్లనే నిద్ర, ఆహారం, నీరు తనలో ఉత్పత్తి అవుతాయని, తనవలె ఎవరు చేసినా, వాళ్ళకి నిద్రాహారాలు, నీరు అవసరం వుండవంటాడు. ఏ జబ్బులూ రావంటాడు.

మరొక డాక్టర్, ఈ జన్మలో వచ్చే రోగాలకు పూర్వజన్మలో చేసిన పాపాలు, తప్పులు కారణమంటాడు. తన దగ్గరకొచ్చే రోగులను హిప్నాటిక్ నిద్రలోకి పంపి, వారి పూర్వజన్మ జ్ఞాపకాలను వెలికితెచ్చి, ఈ జన్మలో వాటికి నివారణోపాయాలను చెప్పి, ఏ మందులూ చికిత్స లేకుండానే రోగాలు తగ్గించగలనంటాడు.

ఇంకొక మతపిచ్చగాడు, మన బాధలకు, పీడలకు మన పేగుల్లో, కడుపులో తయారైన 'మలినం' కారణమంటాడు. దాన్ని తొలగించటానికి ఏ కత్తికోతలు లేకుండానే కడుపుకోసి, ఏ నొప్పికల్గకుండా ఆపరేషన్ చేసి, ఆ మలినపదార్థాన్ని తీసి చూపించగలనంటాడు. ఆ 'సైకిక్ సర్జరీ' తనకు దైవదత్తమైన వరమని డంబాలు చెపుతాడు.

....ఇలాంటి కుహనా విద్యలతో, బూటకపు మాటలతో అవివేకుల్ని, అమాయకుల్ని మోసగించి, తమ పబ్బంగడుపుకునేందుకు ఎందరెందరో ఘరానా వంచకులు ఇప్పుడు పుట్టుకొస్తున్నారు. జనంలో వున్న ఆధ్యాత్మిక భావజాలం, దైవవిశ్వాసం వారి కూట విద్యలకు ప్రధాన పసరు. అవి ఎంతబలంగా వుంటే, జనాన్ని అంత తేలిగ్గా వారు వంచించగలరు. అలాంటి కూట విద్యల్లో ఒకటి పిరమిడ్ ధ్యానం. దాన్ని ప్రచారం చేస్తున్న కపటి సుభాష్ పత్రి.

2012, డిశంబర్ 21 నుండి 31 వరకు 11రోజులపాటు మహబూబ్‌నగర్ జిల్లా కడ్తాల్ గ్రామ సమీపాన 'ప్రపంచ ధ్యాన మహాసభలు' జరిగాయి. 180మీ. పొడవు, అంతే వెడల్పు గల నలుచదరపు నేలపై నిర్మించిన 'మహేశ్వర మహాపిరమిడ్'లో సుభాష్ పత్రి నిర్వహించిన ధ్యాన సభలకు 11రోజుల్లో 10 లక్షలమందికి పైగా జనం హాజరయినట్లు వారు ప్రకటించుకున్నారు. 'ధ్యానం సర్వరోగ నివారిణి' అంటూ ఆటలతో, పాటలతో, మురళీగానంతో, తానూగుతూ, జనాన్ని వూపుతూ మీడియాలో కన్పించిన 'బ్రహర్షి' సుభాష్ పత్రి, మరోకోణంలో కూడా ఎలావుంటాడో అదే మీడియా ద్వారా వెల్లడయింది. తెల్లగా మెరిసే బారెడు గడ్డం, జానెడు మీసం నున్నటి బట్టతల సాక్షిగా, ఆ 'బ్రహ్మర్షి' యువతుల పట్ల, మహిళల పట్ల ఎంత అశ్లీలంగా, అసభ్యంగా ప్రవర్తించగలడో తేటతెల్లమయింది. 'ప్రపంచశాంతి కోసం ధ్యానం' అని ఉపన్యాసాలు దంచే ఆ యోగి అశాంతితో ఒక మహిళను అందరూ చూస్తుండగానే దభీ దభీ బాది తన ఆగ్రహాన్ని ప్రదర్శించిన వైనం ప్రేక్షకులకు బహిర్గతమయింది. ఆడవాళ్లతో కాళు పిసికించుకోవడం. తొక్కించుకోవడం, వాళ్ల తొడలపై తన కాళ్లుంచటం వంటి అహంకార పూరిత చేష్టలన్నీ ఆయన బండారాన్ని బయట పెట్టాయి. 'పిరమిడ్ ధ్యానం'తో ఆయన సాగించిన ఈ అహంభావాన్ని, అశ్లీలధోరణిని, మద మాత్సర్య కామ క్రోధాదుల్ని టి.వి ఛానెళ్ళు వార్తాపత్రికలు ప్రముఖంగా ప్రచారం చేసాయి.



ఈ నేపథ్యంలో పిరమిడ్ ధ్యానం అంటే ఏమిటి? పిరమిడ్‌కున్న శక్తి వల్ల శారీరక, మానసిక మార్పులు, రోగనివారణ జరుగుతాయా? ధ్యానం వల్ల ఎటువంటి ప్రయోజనముంది? మొదలయిన అంశాలపట్ల జిజ్ఞాస జనంలో రేకెత్తటం సహజం. ఏ ప్రయోజనమూ లేకుండా, ఏ అనుభూతీ కలగకుండా లక్షలాది జనం ఎలా ఆకర్షితులవుతారనే సందేహమూ వస్తుంది.

## పిరమిడ్ చరిత్ర

పిరమిడ్ అనేది ఒక చతురస్రాకారపు నేలపై నాలుగు త్రిభుజాకారాలు పైకిపోయి ఒకే బిందువు వద్ద కలిసినపుడు ఏర్పడే కట్టడం. పూర్వకాలంలో ఇలాంటి కట్టడాలు ప్రాచీన నాగరికతలు విలసిల్లిన మెక్సికో, అమెరికా, ఈజిప్టు, సుమేరియా, చైనా లాంటి పలు ప్రాంతాల్లో కన్పిస్తాయి. అయినా, పిరమిడ్ పేరు వినగానే గుర్తొచ్చేది ఈజిప్టు. ఎందుకంటే ఆ దేశంలోని పిరమిడ్ నిర్మాణంలో కన్పించే నిర్మాణ నిపుణత మిగిలిన వాటిలో తక్కువగా వుండటం. ఈజిప్టు రాజధాని 'కైరో'కు 16 కిలోమీటర్ల దూరాన పడమటదిశగా వుండే 'కియోప్స్' పిరమిడ్ ప్రపంచంలోని ఏడు వింతల్లో ఒకటిగా పేరుపొందింది. గిజా ప్రాంతంలో వుండడం వల్ల దానికి 'గిజా పిరమిడ్' అని కూడా అంటుంటారు. దాని విస్తీర్ణం 13.1 ఎకరాలు. క్రీ.పూ 4000సం।।ప్రాంతంలో నిర్మింపబడినట్లు చెప్పే ఆ గిజాపిరమిడ్ కాక, మరో 30 పిరమిడ్లు ఆ దేశంలో వున్నాయి. గిజా పిరమిడ్ నిర్మాణానికి గ్రానైట్, సున్నపురాళ్ళు వాడారు. ఒక్కోరాయి బరువు 2,500 కిలోలు. అలాంటివి మొత్తం 2,50,000 రాళ్లతో ఆ పిరమిడ్ నిర్మాణమయింది. దాని నాలుగు అంచులు, మూలలు చక్కని ఆకృతితో, ఏ వంపులూలేని రేఖల్లా దాని అంచులు పైకి ఎగబాకుతుంటాయి. ఏ ప్రకృతి ప్రేమికునైనా యిట్టే ఆకర్షించి, అబ్బురపరిచే నిర్మాణ కౌశలం పిరమిడ్లది.

పిరమిడ్‌లు కట్టించిన వారు ఈజిప్టు రాజులే ననటంలో సందేహం లేదు. అయితే, మెక్సికో, ఆఫ్రికా, పెరూ చైనా లాంటి దేశాల్లోనూ పిరమిడ్లున్నాయి. వాటిని కూడా అక్కడి పాలకులే కట్టించివుండవచ్చును. ఈ కట్టడాల వెనుక, ఆయా కాలాల్లోని పాలకుల తాత్విక దృష్టి పాత్ర తప్పక వుంటుంది. వాటిని పాలకుల సమాధులుగా కొందరు చెపుతుంటే, నింగిలోని దేవతలతో మాట్లాడేందుకు మత పెద్దల కోసం నిర్మించి వుండవచ్చని కొందరంటున్నారు. ఏదేమైనా, పిరమిడ్ల మీద పరిశోధనలు యింకా జరుగుతూనే వున్నాయి గనుక, ఎవరు ఏ వుద్దేశంతో కట్టించారనే ప్రశ్నలకు జవాబులు రావల్సివుంది. పిరమిడ్లను చూసి, మొదటగా, ఆ కట్టడపు నిపుణతను కొనియాడిన



వ్యక్తి, గ్రీకు యాత్రికుడు హెరొడోటస్, క్రీ.పూ 440 సం॥లో ఆయన ఈజిప్టు వెళ్ళినపుడు వాటిని చూసాడు. వాటిని ఎలా కట్టారు? ఏ సాంకేతిక పరిజ్ఞానంతో కట్టారు? అనే విషయాలన్నీ ఆ నాటికే రాతరూపంలో వుండి వుంటాయి. కాని, క్రీ.శ 389లో థియోడిసియస్ అనే రాజు అలెగ్జాండ్రియాలోని అతిపెద్ద గ్రంథాలయంపై జరిపిన విధ్వసంలో అలాంటి గ్రంథాలన్నీ కాల్చివేయబడ్డాయని చరిత్రకారులంటున్నారు.

17వ శతాబ్ద చివరి భాగంలో, 18వ శతాబ్ది తొలి భాగంలో పురాతత్వ శాస్త్రవేత్తల దృష్టిని పిరమిడ్లు ఆకర్షించాయి. ఐరోపాలో 16-18 శతాబ్దాల మధ్య జరిగిన పునర్వికాస ఉద్యమ ఫలితంగా, నూతనావిష్కరణల వెల్లువలో భాగంగా, పిరమిడ్ల గురించి పరిశోధించేందుకు కొందరు ముందుకు వచ్చారు. వారిలో ముందుగా జాన్ టేలర్ గురించి చెప్పుకోవాలి. క్రైస్తవ బోధకుడయిన ఆయన వాటిని ఆశ్చర్యంతో తిలకించి, 'దేవుని ప్రేరణతోనే వాటి నిర్మాణం జరిగింద'నుకున్నాడు. బైబిలు దేవుడే ఆ పిరమిడ్‌ను నిర్మించమని 'నోవా'ను ఆజ్ఞాపించి వుండి వుంటాడని నమ్మాడు. అతని వుద్దేశంలో, పూర్వపు ఈజిప్టు వాసులకు అటువంటి నిర్మాణ కౌశలం, సాంకేతిక పరిజ్ఞానం, అసాధ్యం, టేలర్ తర్వాత, స్కాట్లండ్ దేశీయుడు ఛార్లెస్ పియాజి స్మిత్ అనే క్రైస్తవ ఖగోళవేత్త పిరమిడ్‌లను అధ్యయనం చేసాడు. క్రైస్తవ విశ్వాసం ప్రకారం, ప్రపంచాన్ని క్రీ.పూ.4004 సం॥లో దేవుడు సృష్టించాడు గనుక, ఆ తర్వాతనే పిరమిడ్‌లు నిర్మించబడ్డాయని భావించాడు. దానిపై "మహా పిరమిడ్‌లో మన వారసత్వం" అన్న పుస్తకాన్ని రాసాడు.

20వ శతాబ్దిలో పిరమిడ్లపై పలురచనలు, పరిశోధనలు వచ్చాయి. వాటిల్లో ముఖ్యమైనవన్నీ మత దృష్టి కోణం నుంచి వచ్చినవే. జాన్ మిషెల్ అనే రచయిత "The View over Atlantics" అన్న తన రచనలో "మనుషులను భౌతిక స్థితి నుంచి ఆధ్యాత్మకత వైపు మరల్చేందుకే, పవిత్రంగా, పిరమిడ్‌లను నిర్మించా"రన్నాడు. స్విస్ దేశీయుడయిన ఎరిక్ వాన్ డానికెన్ 'Chariots of the gods' (దేవుళ్లరథాలు) అన్న రచనలో ఛార్లెష్ పి.స్మిత్ చెప్పిన మతదృష్టిని మరింత విస్తరింపచేసాడు. అలాంటి

కట్టడాల నిర్మాణం మనుషులకు అసాధ్యం అని అవి గ్రహాంతర వాసుల నిర్మాణాలని గట్టిగా వాదించాడు. 1988లో డానికెన్ కలకత్తా వచ్చాడు. అక్కడ జరిగిన విలేకరుల సమావేశంలో మాట్లాడుతూ –

1. మనిషికి తెలివితేటలు అంతరిక్షం నుంచే దిగుమతి అయ్యాయి.
2. ఆదిమ నరుల, గ్రహాంతర వాసుల పరస్పర కలయికవల్ల ఆధునిక మానవులు పుట్టారు.
3. గ్రహాంతర వాసుల ఉనికి నిర్ధారించేందుకు పురాణాల్లో చాలా కథనాలున్నాయి.
4. పిరమిడ్ లాంటి అపూర్వ కట్టడాలను, అద్భుత సందేశాలుగా గ్రహాంతర వాసులు మనకు వదిలివెళ్లినవి అనేకంవున్నాయి.

అనే అంశాలను బలంగా చెప్పారు. ఆయన వుద్దేశంలో పిరమిడ్లు గ్రహాంతర వాసుల కట్టడాలే. ఇలాంటి కల్పనా కథలతో నింపటం వల్లనే అతని పుస్తకం 36 మిలియన్లు కాపీలు అమ్ముడయింది.

డానికెన్ పుస్తక ప్రభావంలో పిరమిడ్లపై పలు అద్భుత కల్పనలు, జనాన్ని నమ్మించేందుకు అశాస్త్రీయ ప్రయోగాల కథలు 1970 నుంచి ప్రపంచమంతటా ప్రచారమయ్యాయి. 'పిరమిడ్స్ అద్భుతాలను ప్రచారం చేసే తెగలు' పుట్టుకొచ్చాయి. ఎప్పుడో అయిదారు వేల ఏళ్ళనాడు, అలాంటి కట్టడాలను నిర్మించగలిగే శక్తీ, తెలివీ ఈజిప్టు వారికి లేవని, కనీసం అంత బరువైన రాళ్లను పైకి గుంజగలిగే తాళ్ళుగానీ, వాటిని పైకి రప్పించేందుకు వాలు తలంగా ఉపయోగపడే తాటిచెట్లు గానీ వారికి లేవని వాదించారు. అలాంటి రాళ్ళు కైరోకు 800 కి.మీ దూరంలో వుండే అశ్వన్ పర్వతాల్లో మాత్రమే వుంటాయి. అక్కడి నుంచి నైలునదీ మార్గంలో వాటిని తెచ్చినా, ఆ నది నుండి, ప్రస్తుత పిరమిడ్ నిర్మాణం స్థలానికి (16కి.మీ దూరం) వాటిని తీసుకువచ్చే యంత్రాలేవీ లేవని "పిరమిడ్ అద్భుతాల తెగ" వారు వాదించారు. ఇలాంటి వాదనలన్నీ వింటుంటే ఎలాంటి వారికైనా "ఔను కదా!" అనిపించకపోవు.

## వాస్తవాలేమిటి?

అయితే వాదనలను, కల్పనలను ఎండగడుతూ కొందరు పరిశోధకులు రంగంలోకి దిగారు. అమెరికా "అణుశక్తి కమీషన్" సభ్యులు కొందరు, కైరోలోని ఇయేన్ షామ్స్ విశ్వవిద్యాలయ శాస్త్రవేత్తలతో కలిసి పరిశోధనకు పూనుకున్నారు.

భౌతిక శాస్త్రంలో నోబెల్ బహుమతి పొందిన డా॥లూయిస్ అల్వారేజ్ అనే శాస్త్రవేత్త రూపొందించిన ఒక యంత్రాన్ని వారు తమ పరిశోధనలకు వినియోగించుకున్నారు. 'చెప్రాన్' అనే పిరమిడ్‌లోనికి ఏవైనా 'కాస్మిక్ కిరణాలు' ప్రవేశిస్తున్నాయా అన్నది దాని ద్వారా కొలిచే ప్రయత్నం చేసారు. అలాగే, ఆ పిరమిడ్‌లోకి ఏవైనా రహస్య రంధ్రాలున్నాయా లేదా అని X కిరణాల ద్వారా తెలుసుకొనేందుకు సమకట్టారు. 2 మిలియన్ కిరణ మార్గాలను విశ్లేషించారు. దానికి 'I.B.M.1130' మాదిరి కంప్యూటర్ వినియోగించారు. చివరికి వారు చెప్పిందేమంటే "పిరమిడ్‌లో ఏవో తెలియని శక్తులున్నాయని చెప్పటం శాస్త్రీయంగా రుజువుకాలేదు."

అంతేగాదు, పిరమిడ్ల నిర్మాణంలో వాడిన సాంకేతిక నైపుణ్యం ఆనాడు ఈజిప్టు కుందనేందుకు రుజువులు కూడా దొరికాయి. ఈజిప్టును పాలించిన 5వ రాజవంశపు చక్రవర్తులు నిర్మించిన కట్టడాలపై వాటి వివరాలు ప్రాచీనలిపిలో వున్నాయి. రాళ్లను లాగటానికి వినియోగించిన తాళ్లముక్కలు నేటికీ కైరో, తదితర నగరాల్లోని పురావస్తు ప్రదర్శన శాలల్లో భద్రంగా వున్నాయి. సఖారా అనే చోట పిరమిడ్ నిర్మాణానికి అవసరమైన వాలు తలం (Ramp) ఎలా నిర్మించాలో రాసివుంది. ఇంత కష్టపడి అంత పెద్ద కట్టడాలను నిర్మించటంలో గల ఆంతర్యం రాజవంశీకుల శవాలను 'మమ్మీ'లుగా భద్రపరచటానికే. చనిపోయిన రాజులతో పాటు, అతని భార్యలను, అతనికి అవసరమైన సేవకులను మమ్మీలుగా చేసి, వాడుకునే సామాగ్రిని కూడా అమర్చాలంటే అంతఃపురంలా విశాలంగా వుండే మందిరం అవసరం. అందులోకి, వేరెవరూ ప్రవేశించలేనంత దృఢంగా అది వుండాలి. 'మమ్మీ'లయిన మృతదేహాలు ఏనాటికైనా భగవంతుని కృపతో తిరిగి అదే రూపాన్ని తప్పక పొందుతాయి" ఈ తాత్విక భావనలే పిరమిడ్ నిర్మాణాలకు దారితీసాయి.

పిరమిడ్లు లాంటి పెద్ద కట్టడాలు రాకముందు కూడా, మృతులయిన రాజవంశీకుల కోసం 'ముస్తబా'లనే చతురస్రాకారపు సమాధులను నిర్మించారు అవి నేటికీ వున్నాయి, వాటిల్లో కూడా 'మమ్మీ'లున్నాయి ముస్తబాలను పెద్దయిటుకలతో నిర్మించారు వాటికి కొనసాగింపుగా, మరింత డాంబికంగా వుండే పిరమిడ్లు వచ్చాయి. కనుక, దానికెన్ గాని, అతని అనుచరులు గానీ చెపుతున్నట్లు, ఈజిప్టు వారు పిరమిడ్ నిర్మాణం పరిజ్ఞానం లేని ఆదిమ తెగల వారు కాదు, ఏ గ్రహాంతర వాసులో వచ్చి వాటిని నిర్మించలేదు. మానవులు సాధించిన వైజ్ఞానిక, సాంకేతిక మేధస్సును, లేని గ్రహాంతర వాసులకు ఆపాదించటం వారి మత మూఢత్వానికి నిదర్శనం.

## పిరమిడ్‌లకు 'అతీతశక్తులు'!

ఈ వాస్తవాలను గుర్తించలేనివారు, పిరమిడ్లకు అతీతశక్తుల్ని అంట గట్టటంలో వింత లేదు. ఫ్రాన్స్ దేశీయుడు మోన్సియర్ బొవిస్ అలాంటి వాడే. పిరమిడ్‌కు అభౌతిక శక్తులున్నాయన్నవాదనను అతడు తెరపైకి తెచ్చాడు. అందుకు కొన్ని ఉదాహరణలిచ్చాడు.

1. పిరమిడ్‌లోకి దూరి, అంతా కలయ తిరిగి, బయటకు రాలేక చనిపోయిన జంతువుల కళేబరాలు, క్షీణించకుండా అలాగే 'మమ్మీ'లుగా వున్నాయి.

2. తాను ఒక పిరమిడ్‌ను చూసానని, అందులో, చనిపోయిన ఒక పిల్లి మృతదేహం వుందని అది క్షీణించలేదని చెప్పాడు.

3. తాను గడ్డం గీసుకునేందుకు వాడిన రేజర్ బ్లేడులను, పదనుపోయాక, పిరమిడ్ కింద వుంచానని, వాటికి తిరిగి పదను రావటంతో మళ్లీ చాలా రోజులు వాడానని, పిరమిడ్ శక్తి వల్లనే అది సాధ్యమయిందని వాదించాడు.

బొవిస్ చెప్పిన ఇలాంటి కథనాలతో పిరమిడ్లపై యూరప్‌లో ఆసక్తి పెరిగింది. చిన్నా పెద్ద పరిమాణాల్లో పిరమిడ్లను కొనుగోలు చేయటం మొదలయింది. ఈ పరిణామాలన్నీ గమనించి, దాన్ని తనకు అనుకూలంగా మలచుకొన్నవాడు కారల్ దర్బల్.

బొవిస్ చేసిన వాటినే తాను చేసినట్లుగా చెప్పుకొని కారల్ దర్బల్ చెకోస్లోవేకియా ప్రభుత్వానికి పిరమిడ్లపై 'పేటెంట్' కోసం 1959లో అర్జీ పెట్టుకున్నాడు. రేడియో ఇంజనీర్ అయిన దర్బల్‌పై వున్న విశ్వాసంతో, ఏ ప్రయోగాలు, పరిశీలనలూ లేకుండానే ప్రభుత్వం అతనికి పేటెంట్ హక్కు నిచ్చింది. దాంతో పిరమిడ్ శక్తుల పట్ల నమ్మకం పెరిగి పిరమిడ్ల అమ్మకాలు జోరుగా సాగాయి.

అమెరికాలో కూడా పిరమిడ్ ప్రచారం ఊపందుకుంది. పలువురు సినిమా తారలు తమ ఉద్యానవనాల్లో పిరమిడ్లు నిర్మించి, వాటి అగ్రభాగాన స్ఫటికాలను (Crystal) ఉంచసాగారు. ఆ స్పటికాలు శక్తిని గ్రహించి పిరమిడ్ లోపల వుంచిన ఆహారపదార్థాలను, పళ్లను తాజాగా వుంచుతాయని గట్టిగా నమ్మారు.

పిరమిడ్ కుండే అతీతశక్తుల ప్రచారాన్ని ప్రయోగ పూర్వకంగా చూడాలని ఫ్రెంచి దేశంలో వుండే "కమిటీ ఫర్ సైంటిఫిక్ ఇన్వెస్టిగేషన్ ఆఫ్ పారానార్మల్ ఫినామినా" (CSIPP- అతీంద్రియ శక్తులపై శాస్త్రీయపరిశోధనా బృందం) 1986లో ఒక ప్రయోగం బహిరంగంగా చేపట్టింది. నవంబర్ నెలలో విల్లే అనే నగరంలో 'The Salon of

unusual' (అసాధారణ ప్రదర్శన) అనే పేర ఒక కార్యక్రమం ఏర్పరిచింది. ఆ బృంద సభ్యులు పిరమిడ్ తయారీ నిపుణుని రప్పించి, గిజాపిరమిడ్ లాంటి ఒక గాజు పిరమిడ్‌ను తయారు చేయించారు. రెండేళ్ల క్రితం తయారైన ద్రాక్షా సారాయిని 7 గ్లాసుల్లో నింపి పిరమిడ్ కింద వుంచారు. మరో 7 గ్లాసుల్లో అదే సారాయిని నింపి ఆ కార్యక్రమ అధ్యక్షుని కార్యాలయంలో వుంచారు. కార్యక్రమ ముగింపు రోజున, 'ద్రాక్షా సారాయిని తాగే వారి సంఘం' సభ్యులను పిలిపించి ఆ రెండు రకాల గ్లాసుల్లోని సారాయిని రుచి చూసి తేడా చెప్పమన్నారు. ఏ కొద్దిపాటి రుచి కూడా తేడాలేదని వారు చెప్పారు. పిరమిడ్ వాదుల కోరిక మేరకు మరో సారి అదే ప్రదర్శన జరిపినా, అలాంటి సర్వే లభించటంతో, వారు వాయి మూసుకోవాల్సి వచ్చింది. ఇలాంటి ప్రయోగాలు యూరప్, అమెరికా, లాంటి చోట్ల చాలా జరిగి, పిరమిడ్‌కి అతీతశక్తులు బూటకమని చాటాయి.

## మనదేశానికీ వ్యాపించింది!

పిరమిడ్ కాస్మిక్ కిరణాల్లోని శక్తిని ఆకర్షించి, తనలోవున్న పదార్థాలపైన, మనుషులపైన ప్రసరింపచేస్తాయన్న ప్రచారం మనదేశాన్నీ ఆవహించింది. ముంబైలోని సీమా మజుందార్ 'టైమ్స్ ఆఫ్ ఇండియా'లో ఒక వ్యాసం రాసాడు. ముంబైలోని కరీనా విశ్వవిద్యాలయానికి చెందిన ఒక భౌతిక శాస్త్ర అధ్యాపకుడొక నెల రోజులు ఒక గ్లాసుడు నీళ్లను పిరమిడ్ కింద వుంచాడని, దానిలో ఎటువంటి నాచు ఏర్పడలేదన్నాడు. పిరమిడ్ శక్తితో తానుంచిన పెరుగు ఏడు రోజులయినా తాజాదనం కోల్పోలేదన్నాడు. అలాగే రేజర్‌బ్లేడ్‌లు కూడా పదును ఎక్కాయన్నాడు. 61 ఏళ్ల వ్యక్తి పిరమిడ్ నీటిని తాగి మోకాళ్ల నొప్పిని పోగొట్టుకున్నాడని, 61 ఏళ్ల ఒక వ్యక్తి తన చత్వారాన్ని తొలగించుకుని, కళ్లజోడును వదిలేశాడని రాసాడు పంటి నొప్పి, కంటి నొప్పి, ఆందోళన, గాయాలు, కురుపులు, పిరమిడ్ శక్తితో తగ్గుతాయని సీమా మజుందార్ రాసిన వ్యాసంలో పేర్కొన్నాడు. దాంతో పిరమిడ్ తయారీ అమ్మకాలు అక్కడ ఊపందుకున్నాయి. ఢిల్లీలో వుండే చంద్రభాను సత్పథి అనే రిటైర్డ్ ఐ.పి.యస్. అఫీసర్ కూడా పిరమిడ్ ప్రచారంలో తన వంతు పాత్ర నిర్వహించాడు.

## ఎవరీ సుభాష్ పత్రి?

ఇలాంటి నేపథ్యంలో 'పిరమిడ్ శక్తి' ప్రచారాన్ని మనరాష్ట్రంలో తలకెత్తుకున్న వ్యక్తి సుభాష్ పత్రి. నిజామాబాద్ జిల్లా బోధన్ సమీపంలోని శంకర్‌పల్లి నివాసి అయిన సుభాష్ యంయస్సీ చదివాడు. హైదరాబాద్‌లోని వ్యవసాయ విద్యాలయంలో

కొంతకాలం ఉద్యోగం చేసాడు. చిన్నప్పటి నుండే మురళి వాయించడం తెలుసు. సంగీతంలో ప్రవేశం వుంది గనుక దానితో మిత్రుల్ని ఆకర్షించేవాడు. 1979 నుంచి ఆధ్యాత్మిక ప్రచారం వైపు మొగ్గు చూపాడు. వందలాది ఆధ్యాత్మిక పుస్తకాలను చదివానని, తనకు తెలియనిదేదీలేదని గొప్పలు చెప్పుకునే పత్రిజీ 'ధ్యానం' గురించి మొదటిగా తన మిత్రుడయిన రామచెన్నారెడ్డి నుండి తెలుసుకున్నానని చెపుతాడు.

రామచెన్నారెడ్డి వెన్ను నొప్పితో బాధపడుతూ ఒక రోజు బస్సు ప్రయాణం చేస్తుంటే, అతని మిత్రుడొకరు ధ్యానం చేస్తే తగ్గుతుందని సలహాయిచ్చాడట! అలా చేయడం వల్ల3 రోజులల్లో నొప్పి మాయమైందట! అప్పట్నుంచీ ధ్యానిగా మారిన రామచెన్నారెడ్డికి దివ్యదృష్టి కూడా చేకూరిందని, ధ్యానంలో వుండి ఎవరింట్లో ఏమి జరుగుతుందో చెప్పేవాడని, దాంతో తాను ధ్యాన మహిమను గుర్తించి దానివైపు దృష్టి మరల్చానని సుభాష్ పత్రి తన పూర్వ గాథను అప్పుడప్పుడూ విన్పిస్తుంటాడు. సదానంద యోగి అనే ఒక యోగి పుంగవుడు, కాలికి ఏదో పసరు పూనుకొని, మనుచరిత్రలోని ప్రవరాఖ్యుని మాదిరిగా అనుకున్న చోటికి వెళ్తూవుంటాడట! నూరేళ్ల వయసుపై బడినా నవయవ్వనునిగా దర్శనాలిచ్చే ఆ యోగి ఉపదేశంతో 1979 డిశంబర్ 29న ధ్యాన సాధనవైపు మళ్లాడట సుభాష్ పత్రి. ఇది వింటుంటే పురాణ కథా కాలక్షేపంగా లేదా!

ఒక టిబెట్ బౌద్ధ సన్యాసి రాసిన పుస్తకాలు చదవటంతో తనకు సంపూర్ణ జ్ఞానోదయమై 1992లో ఉద్యోగాన్ని వదిలి పూర్తిగా ధ్యాన ప్రచారంలోకి దిగాడట పత్రి. పిరమిడ్ 'శక్తి' గురించి అప్పటికే ఉత్తర భారతదేశంలో ప్రచారం బాగా వుంది. దక్షిణాదిన కూడా అక్కడక్కడా పిరమిడ్ల మహిమలు కథలుగా విన్పిస్తున్నాయి. 1982లోనే "The Secrets of Pyramid" అనే చిన్న పుస్తకాన్ని చదివి, మందపాటి కాగితంతో రెండు పిరమిడ్లు చేయించి ఒకదాని కింద వంకాయ, మరోదాని కింద టమాటా వుంచి, మరో వంకాయ, టమాటా బయట 3 రోజులు వుంచి, ప్రయోగం చేసాదట! పిరమిడ్ కింద వున్నది తాజాగా వుంటే బయటవున్నవి పాడైపోయి కన్పించాయట! దాంతో పిరమిడ్ శక్తిపై గురికుదిరిందట. అలాగే బ్లేడుల ప్రయోగం చేసాడట! ఆశ్చర్యం కలిగిందట! ఇవన్నీ పాత కథలే. పిరమిడ్ పుస్తకాల్లో వున్న కథలే, మరోవైపు అవన్నీ నిజాలు కావని తేలిన విషయాలే. అంతకంటే కొత్తవేవీ ఆయన అల్లలేక పోయాడు.

1990 నుండి పిరమిడ్ ధ్యాన ప్రచారకునిగా మారిన సుభాష్ పత్రి మొదటగా 1991లోని లక్ష్మీ జగన్నాథ గుట్ట దగ్గర ఒక పిరమిడ్‌ను కట్టించాడు. సర్వే నెం:35లో

10 ఎకరాల భూమిని కబ్జా చేసి (అక్కడి వారు మీడియాలో చెప్పినమాట)' శాకాహార గ్రామం' ఏర్పాటు చేసాడు! అంటే ఆ రోజు నుండి చాలా మంది బాబాలు, స్వాముల మాదిరే భూకబ్జాకు పాల్పడి పలు ప్రాంతాల్లో ఆయన సంస్థ చేసిన భూదందాలు, ఆర్థిక నేరాలు, అశ్లీల కార్యక్రమాలు, నయవంచకప్రచారాలు వరసగా యిప్పుడిప్పుడే వెలుగుచూస్తున్నాయి.

## ధ్యానంపై సుభాష్ వ్యాఖ్యానం

1960 దశకంలో మహేష్ యోగి అనే ధ్యాన ప్రచారకుడొకరు వెలుగులోకి వచ్చారు. ధ్యానం ద్వారా అతీతశక్తులను వశపర్చుకోవచ్చని, గాలిలో లేచి తిరుగాడవచ్చునని చెప్పేవాడు. తాను స్వయంగా గాలిలోకి లేవటం, గాల్లోనే ధ్యాన ముద్రతో వుండటం లాంటి గారడీలు చూపించేవాడు. ధ్యానకేంద్రాలు స్థాపించి, పలువిదేశాల్లో శిష్యులను ఆకర్షించాడు. భారతదేశంలో అతనికి చాలామంది శిష్యులేర్పడ్డారు. 3 దశాబ్ధాల పాటు మహేష్ యోగి ప్రభావం విస్తరించటానికి అతడు ప్రదర్శించిన గాల్లో తేలియాడటం, గాల్లో ధ్యానం చేస్తూ కన్పించడం అనే రెండు అంశాలు కారణాలు. అయితే ధ్యానం చేస్తూ వున్నప్పుడు పైన కప్పుకున్న దుప్పటి లోపల వుంచిన రెండు కర్రల సాయంతో అతడు నెమ్మదిగా పైకి లేవటం, అలాగే, ధ్యాన నిష్టతో కూర్చుని వున్నప్పుడు అతని మోచేతి కింద వుంచుకునే తపోదండంతో అనుసంధించబడిన యినప చట్రాన్ని తన పీటగా వినియోగించుకోవటం అనే రెండు మోసాలు బట్టబయలయ్యాక మహేష్ యోగి ప్రభావం క్రమంగా సన్నగిల్లి పోయింది. అతని 'భావాతీతధ్యానం' కపటమని తేలిపోయింది. అయినా, 1984 ప్రాంతంలో అప్పటి మన ముఖ్యమంత్రి యన్టీరామారావు 1100 ఎకరాల భూమిని 60 సంవత్సరాలపాటు ఎకరానికి కేవలం 10రూ॥కు మహేష్ యోగికి లీజు కివ్వటానికి ముందుకొచ్చాడు. అందులో ధ్యానంతోపాటు, వేద 'విజ్ఞాన' కేంద్రాన్ని కూడా నిర్మించుతానని మహేష్ యోగి అర్థించటంతో రాష్ట్ర ప్రభుత్వం అమాయికంగా ముందుకొచ్చింది. అయితే, ప్రజావ్యతిరేకత పెరగటంతో ఆ ప్రతిపాదన మొగ్గలోనే చితికిపోయింది.

మహేష్ యోగిలాగే సుభాష్‌పత్రి కూడా 'ధ్యానం సర్వరోగ నివారిణి' అంటున్నాడు. ఆ నినాదాన్ని ప్రచారం చేసిన మొన్నటి మహేష్ యోగి నుంచి, నేటి రాందేవ్‌బాబా గురువు వరకు అందరూ ఏదో ఒక రోగంతో మరణించిన వారే. వారి ధ్యానాలు, యోగాలు వారి కున్న రోగాలనే తగ్గించలేకపోయాయి. కాగా, అవి అన్ని రోగాల్ని తగ్గిస్తాయని తమ ప్రసంగాల్లో పెద్ద ఎత్తున ప్రచారం చేయడం వంచన

కాదా? పిరమిడ్ ధ్యానం మహోన్నతం, మహా మహిమాన్వితం అని డబ్బా వాయిస్తున్న సుభాష్ పత్రి సైతం తనను వేధిస్తున్న రోగాల నివారణకు అల్లోపతి వైద్యం ఎందుకు వాడుతున్నట్టు? చక్కెర వ్యాధి, రక్తపోటులతో సతమతమయ్యే తన భార్యతో అల్లోపతి మందుబిళ్లలెందుకు మింగిస్తున్నట్టు? (ఈ విషయాలను ప్రభాకర చౌదరి, అనంతపురం గారు 10.01.2013న ఎబిఎన్ ఛానెల్ నిర్వహించిన 'పిరమిడ్ ధ్యానంపై చర్చ'లో వెల్లడించారు. తాను సుభాష్‌పత్రికి దగ్గరి మిత్రుడనని తాను స్వయంగా చూసినవే చెపుతున్నానని అన్నారు)

### "ధ్యాసంతా శ్వాసమీదేనా, లేక..."

పిరమిడ్ ధ్యాన ప్రచార నినాదం – "ధ్యానం అంటే శ్వాస మీద ధ్యాస". సుభాష్‌పత్రి ఇచ్చే ధ్యానసంబంధమైన ఉపన్యాసాల్లో మూడు అంశాలు ముఖ్యంగా వుంటాయి. 1.ధ్యానం, 2. శాకాహారం, 3.న్యూ ఏజ్ వైద్య విధానాలు.



సైన్సు పదజాలాన్ని గుప్పిస్తూ, కుహనాసైన్సు ప్రయోగాల పేర జనాన్ని మభ్యపరుస్తూ, కపట వేషాలతో మోసాలతో తమ జేబులు నింపుకునేవి న్యూఏజ్ వైద్య విధానాలు. ఈ వ్యాసం మొదట్లో కూడా అటువంటి మూడు వైద్య విధానాలను పరిచయం చేయటం జరిగింది. అలాంటివి కొన్ని వందలున్నాయి. వాటిలో వుండే ఏకైక సామాన్య అంశం 'ఆధ్యాత్మికత'. ప్రతి మతంలోనూ ఆయా దేవుళ్లనో, ప్రవక్తలను కీర్తించేందుకు కొన్ని మహిమలు, వాటి చుట్టూ స్వర్గనరకాలు, పాపపుణ్యాలు, కర్మలు, జన్మలు వంటి అసత్యభావజాలం చిక్కంగా అల్లుకొనివుంటాయి. ఆ ఆధ్యాత్మిక భావజాలంలో కొట్టుమిట్టాడే కోట్లాది భావదాసులే న్యూ ఏజ్ విధానాల గాలాలకు చిక్కేచేపలు. అలాంటి చేపల్ని పట్టేందుకు విసిరిన గాలాల్లో ఒకటి 'పిరమిడ్ ధ్యానం'. తన న్యూ ఏజ్ 'జాలరి' వృత్తిని సమర్థించుకోవాలంటే, అలాంటి ఇతర 'జాలర్ల'ను, వాళ్ళు విసిరే గాలాలను మరింత గొప్పగా పొగడాల్సిందే కదా! కనుక సుభాష్‌పత్రి న్యూ ఏజ్ విధానాలన్నింటిని సమర్థిస్తూ వుపన్యసిస్తుంటారు. వాటిని ప్రోత్సహిస్తుంటాడు. 2002 సం॥లో హైదరాబాద్‌కి ఫిలిప్పైన్స్ నుండి "అలెక్స్ ఆర్బిటో" అనే న్యూ ఏజ్ వైద్యుడు వచ్చి, సైకిక్ సర్జరీ పేర కత్తికోత లేకుండా ఆపరేషన్‌లు

చేస్తానంటూ ఒక్కొక్క పేషెంట్ నుంచి రూ॥5000 నుండి 25000 వరకు పిండుకున్నాడు. ఆయన రావటం వెనుక సుభాష్‌పత్రి పాత్ర వుంది. మానవ వికాస వేదిక నాయకుడు, మహిమల బండారాన్ని బయటపెట్టే మెజీషియన్ అయిన ఎన్.విక్రమ్ ఆనాడు సైకిక్ సర్జరీ బండారాన్ని మీడియా ద్వారా బట్టబయలు చేయటంతో దిక్కుతోచక ఫిలిప్పైన్స్‌కి పారిపోయిన ఆ వంచకునితో, సుభాష్‌పత్రికి నేటికీ సత్సంబంధా లున్నాయట! 2012లో తన శిష్యులను అలెక్స్ నిర్వహించే శిక్షణాశిబిరాలకు పంపాడని ఎబిఎన్ న్యూస్ ఛానెల్ (10.01.2013) తెలియజేస్తోంది.

రోగులకు హిప్నాటిజం చేసి, వారి పూర్వజన్మలోని ఘటనలను గుర్తుకుతెచ్చే పేరుతో 'వైద్యం' చేస్తూ (Past Life Regression Therapy) డబ్బులు దండుకుంటూ 'డాక్టర్లు'గా బోర్డులు పెట్టుకొని నయవంచనకు పాల్పడుతున్న వారికి సుభాష్‌పత్రి మంచిమిత్రుడు. వారితో కలిసి, వారి వృత్తిని సమర్థిస్తూ ప్రసంగించిన సన్నివేశాలు ఇంటర్నెట్‌లో మనకు దొరుకుతున్నాయి. ఇలాంటి చెత్త చెత్త విధానాలకు వత్తాసు పలుకుతున్నందుకు వార్ధాలోని 'ఆరోగ్యధామ్' వారు ఆయనకు 'జీవిత సాఫల్య పురస్కారం' ఇచ్చారని తెగ మురిసిపోతుంటారు అతని వంది మాగధులు. 'ఆరోగ్యధామ్' కూడా న్యూ ఏజ్ విధానాలను ప్రోత్సాహించే, నిర్వహించే ఒక కేంద్రం. ఇటువంటి అశాస్త్రీయ వైద్యవిధానాలే ఆ కేంద్రంలో వుంటాయని వేరుగా చెప్పనవసరంలేదు.

## ఆహారం – ధ్యానం

సుభాష్‌పత్రి ప్రబోధించే రెండో అంశం శాకాహారం. ప్రకృతిలోని జీవరాశిలో శాకాహారులు, మాంసాహారులు, ఉభయాహారులున్నాయి. మానవుడు ఉభయాహారి. ఏది రుచిస్తే, ఏది అనువుగా లభిస్తే, ఏది ఆకలిని తీరిస్తే దాన్ని తినటానికి అలవాటు పడినవాడు. తన ఆదాయాన్ని, అవసరాన్ని, ఆరోగ్యాన్ని, దృష్టిలో వుంచుకొని ఆహారాన్ని తీసుకునే వివేచన మనిషికుంటుంది. కాగా, శాకాహారమే యోగ్యం, తక్కినది అయోగ్యం అని నిర్ణయించటం అవివేకం. మాంసాహారులు మూర్ఖులు, తెలివి లేనివారు, తామసులు, కోపాతాపాలు గలవారు అని నిర్ణయించటానికి ఏ శాస్త్రీయ ఆధారమూలేదు. రకరకాల మాంసాలు తిన్న వైదిక ఋషుల దగ్గర నుంచి, మహా మేధావులయిన అంబేద్కర్ లాంటి ఆధునిక మహానుభావులెందరో మాంసాహారులే. అహింసను ప్రబోధించిన బుద్ధుడు సైతం ఆహారంగా మాంసాన్ని తృణీకరించలేదు. తాను తిన్నాడు కూడా. కాగా ఇప్పుడు, తాను బ్రాహ్మణుడైనందున, శాకాహారి అయినందున సుభాష్‌పత్రి తన ఆహార అభిరుచినే అందరికీ ఆమోదయోగ్యం చేయాలనుకోవడం సముచితం

కాదు. తాను ప్రచురించే ధ్యానానికి అది ఏ రకంగానూ దోహదకారి కాదు. పిరమిడ్ ధ్యానం ఆయనకు తెలియక ముందే విదేశీయులు ప్రచారం చేసారు. వారెవరూ శాకాహారమే తినమని చెప్పలేదు. వారిలో మాంసాహారులూ వున్నారు. కనుక, ఆయన చేస్తున్న శాకాహార ప్రచారం జనాకర్షణ కొరకే. కృత్రిమ ఎరువులు వాడని ధాన్యాన్ని దినుసుల్ని కొనటం, పండ్లపై మక్కువ చూపటం విద్యావంతుల్లో, నగర వాసుల్లో ఒక వ్యామోహంగా మారిపోయింది. అవన్నీ ఆరోగ్యానికి తోడ్పడుతాయని వైద్యులు చెపుతున్నారు. అంతమాత్రాన, మాంసాహారాన్ని తెగనాడాల్సిన అవసరం ఏముంది? కొన్ని నియమాల్లాంటివి లేకపోతే, వ్రతాలకు ఆకర్షణ వుండదు. అందుకే పిరమిడ్ ధ్యానానికి శాకాహార ప్రచారాన్ని పత్రి జోడించి వుంటాడు. నిజానికి అందులో ఆయన ప్రత్యేకత ఏమీ లేదు.

## "ధ్యాన మహిమ' – ఎంతనిజం?

ఇక ధ్యాన విషయానికి వద్దాం. ఏదైనా ఒక లక్ష్యంపై మనసు నిలపటం ధ్యానం. సుభాష్ పత్రి చెప్పే ధ్యానంలో మూడు సోపానాలుంటాయి.

1. సాధారణ శ్వాసను కొనసాగిస్తే కొంతసేపటికి మనస్సు ఏ ఆలోచనా లేనిదవుతుంది.
2. ఆ దశలో "కాస్మిక్ ఎనర్జీ" (విశ్వశక్తి) మనసులోకి ప్రవేశిస్తుంది.
3. తగినంత శక్తితో మనసు నిండగానే మూడోకన్ను ఉత్తేజిత మవుతుంది.

ఈ మూడు దశలూ దాటాక ధ్యానించేవానికి అపూర్వశక్తులు స్వంతమవుతాయన్నది సారాంశం.

సుభాష్ పత్రి, ధ్యాన ప్రచార తొలిదశలో 'ఆనాపాన సతి' అనే పదబంధాన్ని వాడేవాడు. 'ఆన్ అంటే గాలి. 'ప్రాణ' (ప్ర+ఆన), 'ఆత్మ' అనే పదాలు కూడా 'ఆన్' అనే సంస్కృత ధాతువు నుంచే వచ్చాయి. 'ఆన' అంటే లోనికి పీల్చేగాలి, 'అపాన' అంటే బయటికి విడిచేది. ఆ రెండింటితో వుండేదే 'అనాపానసతి'. దాన్నే శ్వాసక్రియ అంటాం. బౌద్ధుల్లో ఈ పద వినియోగం వుంది. వాళ్ళు 'విపస్సన' అనే ధ్యాన ప్రక్రియను ప్రచారం చేసారు. అదెంతో గొప్పదని, దానివల్ల, మెదడులో నాడీకణాలు ఉత్తేజితమై ధ్యాన సాధకునికి అంతకు ముందులేని శక్తుల్ని కల్పిస్తాయని, ఆ అంశం అమెరికాలోనో, మరో దేశంలోనో శాస్త్రవేత్తల సమక్షంలో రుజువైందని కొందరు ఉట్టంకిస్తారు. దాన్ని గురించి తర్వాత చూద్దాం.

పత్రి చెప్పే ధ్యానంలో మొదటి సోపానం – శ్వాస మీద ధ్యాస వుంచి మెదడును ఖాళీ చేయించడం. అంటే మనస్సు చేసేపనిని, చేయకుండా ఆలోచనల్ని, నాడీ స్పందనల్ని నిరోధించటం. ఇదెంత వరకు సాధ్యం? ఒకవేళ సాధ్యమైతే జరిగే పరిణామం ఏమిటి? మెదడు సుమారు 100 బిలియన్ నాడీకణాల అల్లిబిల్లి కలయికతో నిర్మితమైన సున్నిత అవయవం. దానికి నీరు, నెత్తురు ద్వారా ఆహారం అందటం, ప్రాణవాయు ప్రసారం వుంటాయి. ఈ మూడింటిలో ఏది సరిగ్గా అందకపోయినా, దాని ప్రభావం శరీర మంతటా వుంటుంది. మెదడు చేసే పని విధానమే మనస్సు. మనసును ఖాళీ చేయించటమంటే మెదడు పనిని ఆపించటమే. ఈ పని అసాధ్యం. మనోవ్యాపారాన్ని నిరోధించే ప్రక్రియ మొదలవుతున్నప్పుడే, దాన్ని ఆమోదించక మెదడు ప్రతిఘటిస్తుంది. మెదడులో వుండే అమిగ్దలా, హిప్పోకేంపే, హైపోథాలమస్ అనే మూడు ముఖ్యమైన భాగాల నుంచి కొన్ని రసాయనాలు విడుదలవటం మొదలవుతాయి. వాటి ప్రభావంతో కొన్ని అనామత్తు దృశ్యాలు, అల్లకల్లోలమైన చిత్రాల అనుభూతులు తన్నుకొస్తుంటాయి. వీటన్నింటిని తొలగించుకోవాలని ధ్యాని తీవ్రంగా ప్రయత్నించవచ్చు. ఆ ప్రయత్నాన్ని కూడా అడ్డుకుంటూ అమిగ్దలా వంటి గ్రంథుల నుంచి జీవ సంబంధమైన మాదక రసాయన పదార్థాలు స్రవించి ధ్యాని ఆరాటాన్ని ఉపశమింపచేస్తాయి. మానసిక రక్షణ కోసం ప్రకృతి సిద్ధంగా ఏర్పాటయిన జీవరసాయనాల ప్రక్రియ ఇది. ఈ రసాయనాలు విడుదలయినప్పుడల్లా మనలో అనిర్వచనీయ ఆనందమూ, స్వేచ్ఛగా ఎగురుతున్న భావన, మిరుమిట్లు గొలిపే కాంతులూ, భ్రాంతుల్నే అలౌకికానందంగా, ఆత్మానందం లేదా బ్రహ్మానందంగా ధ్యానులు పిలుస్తుంటారు. పులకరిస్తుంటారు. నిద్రలో కలలు కనేటప్పుడు ఎల్.సి.డి వంటి మాదక ద్రవ్యాలు సేవించినప్పుడూ, ధ్యాన నిమగ్నస్థితిలోనూ ఈ ప్రక్రియలు తీవ్రమై మనసుపై ప్రభావం చూపుతాయి. బౌద్ధ సన్యాసుల ధ్యానాన్ని పరీక్షించిన నాడీశాస్త్రవేత్తలు ఈ విషయాలను నిర్ధారించారు. (వివరాలకు : మనుషులు చేసిన దేవుళ్లు పేజీ నెం : 135, రచయిత : డా॥ కొడవటిగంటి రోహిణీ ప్రసాద్, అణు శాస్త్రవేత్త)

## 'కాస్మిక్ ఎనర్జీ' ఎక్కడుంది?

కనుక మనసును ఆలోచనల్లేని 'ఖాళీగదిలా చేయటం అసాధ్యం. ఇక, దాన్లోకి కాస్మిక్ ఎనర్జీ ప్రవేశించడం ఎలా సాధ్యం? సుభాష్‌పత్రి చెప్పిన రెండో ధ్యాన సోపానం గురించి పరిశీలిద్దాం.

'కాస్మిక్ ఎనర్జీ' ని తెలుగులో ప్రాణశక్తి అని, విశ్వశక్తి అని, ఖగోళాన్ని ఆవరించిన అతీంద్రియ శక్తి అని ఆధ్యాత్మికులు పిలుస్తుంటారు. కానీ, ఏ వైజ్ఞానిక శాస్త్రమూ దీని ఉనికిని యింతవరకూ నిర్ధారించలేదు. ఏ భౌతిక శాస్త్రవేత్తా దీన్ని వివరించలేదు. వాస్తవంగా ఉంటే కదా? మరైతే, అది ఎలా ప్రచారంలోకి వచ్చింది?

భారతీయ తంత్రవాదంలో అనేక శాఖలున్నాయి. వాటిల్లో కాశ్మీరదేశపు 'శైవం' ఒకటి. ఆ తంత్రశాఖ మొదటగా ఈ 'శక్తి' గురించి చెప్పింది. దాన్ని గురించి చెప్పటం వల్లనే 'శాక్తేయం' అయింది. ఆ 'శక్తి' మహిమాన్వితమని అసాధ్యాలను సుసాధ్యం చేస్తుందని, అతీతశక్తులందిస్తుందని శాక్తేయ తాంత్రికులు ప్రచారం చేసారు. సర్ జాన్ వుడ్‌రోఫ్ అనే ఆంగ్లేయుడు ఈ 'శక్తి'నే మొట్టమొదటగా 'Cosmic Energy' అని ఆంగ్లీకరించాడు.

జాన్ జార్జివుడ్‌రోఫ్ (1865-1936) ఆంగ్లేయుడు, న్యాయశాస్త్రం చదివాడు. 1890లో కలకత్తాలో న్యాయవాదిగా పనిచేస్తూ, క్రమంగా 1915లో కలకత్తా హైకోర్టుకు ప్రధాన న్యాయమూర్తి అయ్యాడు. 1923 వరకు పనిచేసి, రిటైరై, ఇంగ్లాండ్ వెళ్లిపోయాడు. వుడ్‌రోఫ్ కలకత్తాలో వున్న కాలంలో సంస్కృత భాష నేర్చి, హిందూ తత్వశాస్త్రాన్ని, ముఖ్యంగా యోగ, తంత్ర విద్యలను అభ్యసించాడు. వాటిపై 'Garland of Letters', "The Serpent Power : The Secret of Trantric and Shaktic Yoga" అనే పుస్తకాలు రాసి ఆ విషయాలపై పలుమార్లు ఉపన్యసించారు.

ప్రాచీన యోగశాస్త్రం ప్రకారం, ప్రతిమనిషిలో వుండే జీవశక్తి 'కుండలినీ' చక్రంలో నిక్షిప్తమై, నిద్రాణస్థితిలో వుంటుంది. దానిని ధ్యానం ద్వారా మేల్కొల్పి, ప్రాణనాడుల ద్వారా ఆ జీవశక్తిని తలమధ్యలో వుండే సహస్రార చక్రం వరకు తేగలిగితే, విశ్వమంతటా ఆవరించిన విశ్వశక్తిని ఆకర్షించి ఆ జీవశక్తి విశ్వశక్తిలో సంలీనమవుతుంది. దానినే 'యోగసిద్ధి' అంటారు. ఆ రెండు శక్తుల కలయికే 'యోగం'. యోగం సిద్ధించిన వానికి అతీంద్రియ శక్తుల వశమవుతాయని, విశ్వదృష్టి, భవిష్యత్ దృష్టి, కొండనైనా కదల్చగల అద్భుతశక్తి, సమకూరుతాయని యోగ శాస్త్రం చెపుతుంది. ఇదంతా ఊహాజనిత అపూర్వకల్పన, ఏ యోగీ, ఏ కాలంలోనూ దీన్ని నిరూపించలేదు. ఇది సాధ్యమేనని బుకాయించే డాంబికులు సైతం ఏనాడూ నిరూపించలేదు. జీవశక్తినే ఆత్మ అని, విశ్వశక్తినే బ్రహ్మఅని, ఆ రెండూ ఐక్యమైతే మోక్షమని అద్వైతం, హిందూ వేదాంతం చెపుతుంటాయి.

విశ్వమంతటా వ్యాపించి వుందన్న ఆధ్యాత్మిక విశ్వశక్తి గురించి, ఖగోళ భౌతిక శాస్త్రం ఇంతవరకూ స్పష్టంగా నిర్ధారించలేదు. బిగ్‌బ్యాంగ్ విస్ఫోటనం తర్వాత వెలువడిన పదార్థం విశ్వమంతటా వ్యాపించి, గెలాక్సీలు, నక్షత్రాలు, గ్రహాలు, ఉపగ్రహాలు ఏర్పడ్డాయి. అలా ఏర్పడిన వాటికి, వాటిలో వున్న విద్యుదయస్కాంత శక్తి కారణంగా, గురుత్వాకర్షకాలు ఏర్పడి, ఒక పరిధి మేరకు వాటి ప్రభావం చూపుతున్నాయి. సూర్యకిరణాల ద్వారా అది కూడా భూమ్మీదికి చేరటం ఆ తర్వాత యోగుల, ధ్యానుల తలల్లోకి దూరి అతీంద్రియ శక్తుల్ని పుట్టించడం హాస్యాస్పదం. వేదాంతుల తలల్లో తిష్టవేసిన అజ్ఞానమే అతీంద్రియ శక్తుల్ని పుట్టించింది తప్ప విద్యుదయస్కాంతశక్తి కాదు.

కనుక, కాస్మిక్ ఎనర్జీ అని పిలచుకునే విశ్వశక్తి ఆధ్యాత్మిక భావన తప్ప భౌతిక వాస్తవం కాదు, లేదు. ధ్యానం ద్వారా ఎక్కడాలేని విశ్వశక్తిని మెదడులోకి నింపుకొని, తద్వారా మూడో కన్నును తెరిపించుకోవటం అనే భావన సుభాష్‌పత్రి లాంటి ఆధ్యాత్మికుల అజ్ఞాన జనిత కల్పన తప్ప నిజం కాదు. ఈ భావనవల్ల వాళ్ళకు తెరుచుకునే మూడోకన్ను–'అజ్ఞాననేత్రం', మూఢపుకన్ను. దాని ద్వారా స్వార్థంతో, ప్రపంచాన్ని వంచించడం చేయగలరు తప్ప వైజ్ఞానిక లోకాన్ని చూడలేరు.

సుభాష్‌పత్రికి తెరుచుకొన్న మూడోకన్ను ఆయనకెటువంటి జ్ఞానజాలాన్ని ప్రసాదించిందో ఆయన చేస్తున్న ప్రసంగాలను, వెల్లడిస్తున్న అభిప్రాయాలను తెలుసుకుంటే మనకు అవగతమవుతుంది. మచ్చుకు, క్రింది వాటిని చూడండి –

1. భారతీయులందరూ మూర్ఖులు. ఇది మూర్ఖదేశం, ఒక పురుషుడు, ఒక స్త్రీ కలిసి దంపతులై శృంగారం చేసుకోవాలని, అదే పవిత్రమని భావిస్తారు. పాశ్చాత్యదేశాల్లో ఇది లేదు. పరస్పర యిష్టంతో ఎవరు ఎవరితోనైనా శృంగారం చేయవచ్చు. వావివరసలు కూడా అవసరం లేదు. ఆ పరిస్థితి ఈ దేశంలో ఎప్పుడొస్తుందో!

2. శృంగారం ఒక అద్భుతకార్యం. దాన్ని తలుపులు మూసుకొని చేసుకోవటమెందుకు? ఇంట్లో పిల్లలకూ తెలియాలి. పిల్లల ముందు చేసుకుంటే తప్పేముంది? పాశ్చాత్యా దేశాల్లో ఇది వుంది. మనం ఇంకా మూర్ఖత్వాన్ని వదులుకోవటం లేదు.

3. సంభోగం గురించి సమాధి స్థితి పొందిన వారికి బాగా తెలుసు.

ధ్యానంలో మునిగితేలే సుభాష్‌పత్రి ఆలోచనలిలా వుంటాయి. (ఇవన్నీ ఇంటర్నెట్‌లో వున్న ఆయన ప్రసంగాల నుంచి తీసుకున్నవే-రచయిత). ఇదే ఆయన “మూడోకన్ను” ద్వారా గ్రహించిన జ్ఞానం. ఇప్పుడర్థమయిందా, ఆయన ప్రపంచ ధ్యానసభల్లో ఆడవాళ్లతో కాళ్లు ఎందుకు తొక్కించుకున్నాడో, ముద్దులెందుకు పెట్టుకున్నాడో, యువతులను, మహిళలను ఎందుకు వాటేసుకుంటున్నాడో, కూర్చున్నప్పుడు ఆడవాళ్ల తొడలపై కాళ్లెందుకుంచుతున్నాడో? బ్యాంకాంక్, తైవాన్ వంటి దేశాలకు వెళ్లినపుడు కూడా ఎక్కడి ఆడవారితో సాగించిన శృంగార చేష్టలను వీడియో కథనాలను బయటపెట్టాయి. పాపం, అమాయిక పిరమిడ్ ధ్యానులు మాత్రం అదంతా “సుభాష్ భగవంతుని” లీలలు అనుకుంటారు. ఆయన కాళ్లపై నిలబడి తొక్కితే, ఆయనలో వున్న కాస్మిక్ ఎనర్జీ (పాజిటివ్ ఎనర్జీ అని కూడా అంటారు) తమలోకి ప్రవేశించి తమలోని నెగిటివ్ ఎనర్జీని తొలగిస్తుందని అమాయకంగా నమ్ముతుంటారు. ఆయన కౌగిలింతలకు, ముద్దులకు, ఇదే ఆధ్యాత్మిక అర్థాన్ని చెప్పుకుంటారు. దీన్ని అమాయికత్వమనాలా, అజ్ఞానం అనాలా, మోసపోవటమనాలో, మీరే నిర్ణయించుకోండి. ఇలాంటి శృంగార పురుషుని కూడా ఒక ‘ఋషి’గా భావించి, ‘బ్రహ్మర్షి’ అని గొప్పగా పిలుస్తున్నారు. బ్రహ్మర్షి అంటే (బ్రహ్మ + ఋషి) బ్రహ్మజ్ఞానం పొందిన ఋషి. పురాణాల్లో వశిష్టుడు. విశ్వామిత్రుడు లాంటి శృంగార పురుషులకు కూడా ఆ పేరుంది. తమ గురువు అంతటి వాడే అనుకున్నరేమో! పిరమిడ్ ధ్యాన మాస్టర్లందరూ కలసి 1997లో తిరుపతిలో సభచేసి సుభాష్ పత్రిని ‘బ్రహ్మర్షి’ని చేసారు.

ఈ ‘బ్రహ్మర్షి’ శృంగార చేష్టలు, ఆలోచనలు ఇంకా చాలాచాలా ఈ రచయిత చెవినపడ్డాయి. అయితే వీటన్నింటికీ మౌఖిక ఆధారాలు తప్ప లిఖిత పూర్వక ఆధారాలు దొరకనందున, యిక్కడ యివ్వడంలేదు.

పురాణాల్లోని బ్రహ్మర్షులు ఎవరూ ఏ రాజకీయ పార్టీలూ పెట్టలేదు. కానీ, నేటి ఈ శిష్యప్రకటిత ‘బ్రహ్మర్షి’ మాత్రం ఒక రాజకీయ పార్టీనే స్థాపించాడు. 1998లో ‘పిరమిడ్ పార్టీ ఆఫ్ ఇండియా’ ను స్థాపించి ఎన్నికల కమీషన్ దగ్గర రిజిస్ట్రేషన్ చేయించి ఎన్నికల్లో అభ్యర్థులను నిలబెట్టాడు. ఒక్కరికీ డిపాజిట్లు రాలేదు. అదలావుంచితే, ధ్యానం, శాకాహార ప్రచారాలతో రాజకీయాలెలా మారుస్తాడు? అధికార రాజకీయంతో, ప్రజాపాలనలో వుండే స్వదేశీ, విదేశీయ సమస్యల్ని, ఆర్థిక, సాంఘిక సమస్యల్ని సంక్లిష్ట రాజ్యాంగ అంశాల్ని పిరమిడ్ ధ్యానం, ఎలా పరిష్కరిస్తుంది? అందుకే పోటీ చేసిన రెండు ఎన్నికల్లోనూ ఎవరూ ఆ పార్టీని పట్టించుకోలేదు. చివరికి అదొక ప్రహసనంలా, జోక్‌లా మిగిలిపోయింది.

మనరాష్ట్రంలో పుట్టిన ఈ పిరమిడ్ ధ్యాన పితామహుడైన సుభాష్‌పత్రి, వ్యక్తిగతం గాను, భావజాల పరంగాను విశిష్టుడు కాడు. 'న్యూ ఏజ్' విధానాల్లో ఒకటైన ఈ పిరమిడ్ ధ్యానం, ఇతర విధానాల మాదిరే ఏ మాత్రం విలువవైనదికాదు, శాస్త్రీయమైనది కాదు. ధ్యానానికున్న ప్రయోజనం చాలాపరిమితం. వివిధ ఆలోచనలతో గజిబిజిగా వున్న మనస్సును కొన్ని క్షణాలపాటు నిశ్చలంగా వుంచటం వల్ల ప్రశాంత స్థితి ఏర్పడడం నిజమే. కళ్ల మూసుకొని ఆ అనుభూతిని ఎవరైనా పొందవచ్చు. అయితే, గంటలకొద్దీ అదే పనిగా ధ్యానం సాగించడం వల్ల మానసిక వైకల్యం, భ్రమావిభ్రమలు పెరగటం తప్ప, మరో ప్రయోజనం వుండదు. ఈ విషయం సుభాష్‌పత్రికి బాగా తెలుసు. అయినా, పిరమిడ్‌లకు ఏవోశక్తులున్నాయని, బౌద్ధ సన్యాసుల ధ్యానంలో మహత్తులున్నాయని ఒక ప్రక్క చెపుతూ, మరో ప్రక్క ఆచార్య రజనీష్ ప్రబోధించిన విచ్చలవిడి శృంగార భావజాలాన్ని ప్రబోధించటంలోనే అతని విదూషకత్వం, వంచన బయట పడుతున్నాయి. తన సొంత ప్రయోజనాల సిద్ధి కోసమే తప్ప పిరమిడ్ ధ్యానం ప్రజలను ఉద్ధరించేందుకు కాదు. సాలెగూడులాంటి పిరమిడ్ ధ్యాన భావజాలంలో చిక్కి, అర్థం పర్థంలేని ఆధ్యాత్మిక చిలకపలుకులకు మురిసి, అందులోనే కొట్టుమిట్టాడుతూ, దాన్నే మహదానందంగా, సర్వసమస్యా పరిష్కార సాధనంగా, సమస్త రోగ నివారణా మార్గంగా భ్రమపడే వారికి చెప్పేదొకటే- బాబాల్ని, స్వాముల్ని, మాతల్ని, అవధూతల్ని, యోగుల్ని, ధ్యానుల్ని, దైవాన్ని, మరేదైనా అవాస్తవిక, ఆధ్యాత్మిక భావాల్ని ఆశ్రయించడం సైకాలజీ చెప్పే పరాజిత మనస్తత్వానికి ప్రతీక. విస్తరిస్తున్న ఆధునిక వైజ్ఞానిక, సాంకేతిక రంగాల అభివృద్ధిలోని సారాన్ని ఆహ్వానించి స్వీకరించలేని జీవన పరాజితులు, అలాంటి వాటిని ఆశ్రయించి అనర్థాలను కొని తెచ్చుకుంటారు. ఎప్పుడైనా జ్ఞానోదయమై, వాస్తవం యిదా! అని తెలిస్తే, అప్పుడు పశ్చాత్తాపంతో వ్యాకుల పడతారు. అలా కూడా బయటపడలేని వారు విలువైన జీవన సౌఖ్యాన్ని శాశ్వతంగా కోల్పోతారు.



# ప్రార్థనలతో స్వస్థతా! మరి ప్రాణాలకేదీ భద్రత?




అమెరికాలో ఒక బాబును దోమలు (Wasps) కుట్టాయి. వళ్ళంతా 430 దద్దుర్లు వచ్చి జ్వరంతో మంచమెక్కాడు. అతని తల్లిదండ్రులు క్రైస్తవులు. ఆ చిన్నారిని ఆస్పత్రికి తీసుకెళ్ళమని ఇరుగూ పొరుగు ఎంత చెప్పినా ససేమిరా అన్నారు. చర్చి పాస్టర్ చేసే "స్వస్థత ప్రార్థన"లు చాలనుకొని వెళ్లారు. ఏడుగంటల పాటు చర్చిలో వుంచారు, ప్రార్థించారు. ఏ ఫలితమూ లేదు, బాబు చనిపోయాడు. 1998 సెప్టెంబర్ లో ఇది జరిగింది.

ఈ పాపపేరు అమీ. అమెరికా లోని ఫ్లోరిడాలో క్రైస్తవ తల్లిదండ్రుల పెంపకంలో వుండేది. ఆమెకు మధుమేహం వుంది. ఒకసారి వరసగా నాలుగు వారాలపాటు అస్వస్థతకు గురై తేరుకోలేదు. వాళ్ళూ వీళ్ళూ చెప్పిన మాటలు విని, తల్లిదండ్రులు ఎట్టకేలకు స్వస్థత కూటములకు వెళ్ళి ప్రార్థనలు చేయించారు. కొద్దిరోజుల్లోనే ఆ పాప మరణించింది.

ఒక పన్నెండేళ్ల అమ్మాయి కూడా మధుమేహ బాధితురాలే. అయితే, మధుమేహం ఇంకా ప్రాథమికస్థాయిలోనే ఉండేది. దానికి తగిన మందులు వాడితే నియంత్రించ గలిగేవారు తల్లిదండ్రులు. కానీ మతంతలకెక్కిన ఆమె తల్లిదండ్రు లకి ప్రార్థన' మీదున్న

నమ్మకం వైద్యం మీద కలగలేదు. క్రమంగా మధుమేహం ముదిరిపోయింది. 2013 ఫిబ్రవరి 5న ఆ బాలిక మరణించింది.

ఇలాంటి ఉదాహరణలు ఎన్నైనా యివ్వవచ్చు. అమెరికాలోనే గాదు, మనదేశంలోనూ మన నివాస ప్రాంతాల్లోనూ ఇలాంటి ప్రార్థనా మరణాలు జరుగుతున్నాయి. అయినా అవన్నీ దైవం మాటున ఆధ్యాత్మిక ఆచారాల చాటున జరగటం వల్ల 'హత్యలు కాకుండా తప్పించుకుంటున్నాయి.

ప్రార్థనద్వారా, దైవవిశ్వాసుల వ్యాధులను తగ్గించే రకరకాల విధానాలు దాదాపు అన్నిమతాల్లోనూ వున్నాయి. కొన్ని బౌద్ధశాఖలు కూడా ఇందుకు అతీతం కాదు. అయితే, 'ప్రార్థనల ద్వారా స్వస్థత' అనే మాట వినగానే వెంటనే స్ఫురించేది క్రైస్తవమతం, స్వస్థత కూటములే. నిత్యమూ పేదరికంతో, వివిధ మనోవేదనలతో, నిరాశా నిస్పృహలతో, రోగాలతో కునారిల్లే జనానికి సాంత్వనమివ్వటంలో క్రైస్తవానికి మించినది లేదు. ఏశాఖవారైనా సరే, ఆ మత ప్రచారకుల ఏకైకసాధనం ప్రార్థన. దుఃఖంతో వున్నవారి చెంతకు చేరి, వారి బాధలు విని, సానుభూతి చూపుతూ, ప్రభువుకు నీ గురించి నివేదిస్తానని, ఆ ప్రభువు ఆశీర్వాదం, దయలవల్ల నీకంతా మంచి జరుగుతుందని, ఆ దుఃఖితుల పేర, వారి ఎదుటే బైబిల్ వాక్యాలను ప్రార్థనగా చదువుతూ, వారి మనసులకు దగ్గరవటం క్రైస్తవానికి అబ్బినంతగా, మరెవరికీ ఆ విద్య అలవడలేదు. ఒకసారి పరిచయమైనాక, వారిని ప్రార్థనపేర, ఆరాధన పేర, మరో ఆచారం పేర వారిని కట్టిపడేసి, క్రైస్తవునిగా మార్చేందాకా, వదలని 'మిషనరీ' కృషి ఆ మతానికే చెల్లింది. అందుకే వారి సంఖ్య పెరగటమే కాదు, ఆ సంఖ్య ఇండియాలో స్థిరంగా బలపడుతోంది. దేశమంతటా కొన్ని వందల క్రైస్తవశాఖలు, కొన్ని వేల చర్చీలు, కొన్ని లక్షల ప్రార్థనా కూటములు, కొన్ని కోట్లమంది క్రైస్తవులతో ఏటేటా జరుగుతూనే వున్నాయి. వాటన్నింటికీ బైబిల్ తప్ప మరో ఆధార గ్రంథం లేదు. ఎన్నిసార్లు చెప్పినా అందులో వాక్యాల్నే చెప్పాలి. చెప్పిన వాటినే మళ్లీ మళ్లీ కొత్తకొత్త మాటలతో మైకం తెప్పించటమే కాదు, పాటలతో సంగీతంతో మత్తెక్కిస్తూ, ప్రార్థనలతో ఓదార్పునివ్వటం ఆ మతప్రచారకులకు వెన్నతో పెట్టినవిద్య..

మహారాష్ట్రలో ఒకచోట 'స్వస్థతకూటమి' జరుగుతోంది. ప్రభువునందు విశ్వాసం గలవారు, ఆ ప్రభువు కృపవల్ల బాగుపడుదురు' అని ఆ కూటమిలో ప్రధాన బోధకుడు చాలా గట్టిగా చెపుతున్నాడు. 'మీలో ఎవరైనా ప్రభువు నుండి స్వస్థత కోరుచున్నారా?'

అని అడిగాడు. ఒకామె చెయ్యెత్తింది. ఆమె ఒక చక్రాల కుర్చీలో వుంది. వేదికపైకి రమ్మని బోధకుడు చెప్పగానే, ఆమెభర్త (ఆమెను పుష్ప అని పిలుద్దాం!) ఇద్దరు సహాయకులతో కలసి వేదికపైకి తెచ్చాడు. ఆమె నడుము సరిగా లేదని, కాళ్ళు నిలదొక్కుకోలేక, నడవలేక బాధపడుతోందన్నాడు బోధకుడు. ప్రభువును విశ్వసించు చున్నావా?" అని అడిగాడు పుష్పను. తలూపింది. అయితే లేచి నిలబడగలవు, లే...' అంటూ గట్టిగా అరిచాడు. వేలాదిమంది భక్తులు కళ్లు విప్పి, ఉత్సుకతతో చూస్తున్నారు. అదే మాటను పదేపదే అన్నాడు బోధకుడు. అతణ్ని అనుసరించి వుండే ఇద్దరు సహాయకులు, పుష్ప భర్త ఆమెను పట్టుకొని నిలబెట్టారు. బోధకుడు ఆమె నుదుటన తన కుడిబొటన వ్రేలును బెట్టి, ఏవేవో బైబిలు మాటలు వల్లించాడు. అంతే, పుష్పను ఏదో ఆవహించినట్టయింది. ఆమెను పట్టుకున్న ముగ్గురూ తుళ్లి వెనక్కి పడిపోయారు. మరో ఇద్దరు సహాయకులు పరుగున వచ్చి పట్టుకున్నారు. ప్రభువు నీయందున్నాడు. నీవు నడవగలవు. అడుగువెయ్, నడువ్' అంటూ బోధకుడు గట్టిగా స్ఫుటంగా వేదిక పై ఉత్సాహంగా తారట్లాడుతూ వాగాడంబరాన్ని ప్రదర్శిస్తున్నాడు. పుష్ప నెమ్మదిగా అడుగులు కదిపింది. అడుగులో అడుగేసింది. సహాయకులు ఆమెను వదిలారు. నడవసాగింది. "ప్రభువు నిన్ను కనికరించాడు. నీకు స్వస్థత చేకూరింది. పరుగెత్తు" అంటూ బోధకుడు ఉత్సాహపరిచాడు. పుష్ప పరుగెత్త సాగింది. ఆ అద్భుతాన్ని తిలకిస్తూ ఆ కూటమిలో వున్న వేలాది భక్తులు ఆనందంతో, భక్తి పారవశ్యంతో భజనలు చేస్తూ, చేతులెత్తి గెంతుతూ "హల్లెలూయా' అంటూ కేరింతలు కొట్టారు. బోధకుడు ఆ 'మత్తును' మరింత రెట్టింపు చేస్తూ, "ప్రభువు'ను కీర్తించాడు. స్వస్థత ప్రార్థనలు ఎక్కడ జరిగినా, దాదాపు ఇదే దృశ్యం ఆవిష్కృతమవుతుంటుంది. భక్తుల్ని బలంగా ప్రభావితం చేసే సన్నివేశాలీ స్వస్థత ప్రార్థనలు.

## స్వస్థత ప్రార్థనల చరిత్ర

చారిత్రకంగా పరిశీలించినపుడు, క్రీ.శ. 3-4 శతాబ్దాల మధ్యకాలంలో ఈనాడు మనకు వాడుకలో వున్న కొత్తనిబంధన బైబిలు సంకలితమైందని తెలుస్తోంది. అప్పటి నుండీ, అనారోగ్యాన్ని స్వస్థపరిచే పలువిధానాలను క్రైస్తవచర్చి అమల్లోకి తెచ్చింది. కొత్త నిబంధనలోని 1 కొరింథీయుల గ్రంథం 12వ అధ్యాయంలో ఆత్మ ప్రత్యక్షత గురించి వుంది. ఆత్మ వల్ల జరిగే 9 రకాల కార్యముల వివరణ వుంది. ఆత్మవల్లనే అవన్నీ సాధ్యమవుతాయట! అంతటి పూర్వ కాలంలోనే, స్వస్థత చేకూర్చటానికి క్రీస్తు వస్తువులను కొన్నింటిని ఎంచుకున్నారు.

1. ఏ శిలువపై క్రీస్తును శిక్షించారో, దాని శిధిలాలుగా చెప్పే చెక్కముక్కలు
2. హేరోదు చంపిన పిల్లల ఎముకలు
3. సెయింట్ స్టీఫెన్ కళేబరం/ అస్థి పంజరం
4. కన్యమేరీ పాలకూజాలు
5. యోహాను పని చెప్పే ఎముకలు, వాటి ముక్కలు
6. సున్తీ చేయబడిన యేసు శిశ్న చర్మాల తునకలు
7. మేరీ అస్థిపంజరం
8. 5000 మందికి పంచిన రొట్టెలపొడి, చేపల పొట్టు
9. చివరిరాత్రి భోజనంలో వాడిన రొట్టెల అవశేషాలు
10. క్రీస్తు గడ్డపు వెంట్రుక
11. క్రీస్తు కప్పుకున్న వస్త్రపు తునకలు

....ఇలా ఎన్నెన్నో వస్తువులకు క్రీస్తు పేరు తగిలించి వాటితో స్వస్థతకు పూనుకుంటున్నామని విశ్వాసులను నమ్మించేవారు. ఈ వస్తువులు మొత్తం 17000 వుండేవని Schloss Kirche అనే జర్మన్ దేశీయుడు వెల్లడించాడు. అలాంటి వాటితో రోగులను స్వస్థపరచమని బైబిల్ చెప్పినా చెప్పకపోయినా, స్వస్థత క్రియలను చేయవచ్చని బోధకులకు బైబిలు మార్గదర్శనం చేసింది. తన శిష్యులు పన్నెండుమందినుద్దేశించి యేసు"రోగులను స్వస్థపరచుడి, చనిపోయినవారిని లేపుడి, కుష్టురోగులను శుద్ధులుగా చేయుడి, దయ్యములను వెళ్లగొట్టుడి, ఉచితముగా పొందితిరి, ఉచితముగా ఇయ్యుడి" (మత్తయి సువార్త 10:8) అన్నట్లు వుంది. ఇలాంటి క్రియల ద్వారా పరలోక రాజ్యమును ప్రకటించమని శిష్యులకుపదేశిస్తాడాయన. అంతేకాదు, యేసు గలిలయ సముద్ర తీరాన వుండే జాలరుల దగ్గరకువెళ్లి, తానే స్వయంగా దేవుని సువార్తను ప్రకటించుచు, ప్రజలలోని ప్రతివ్యాధిని, రోగమును స్వస్థపరచుచు గలిలయ యందంతట సంచరించాడట (మత్తయి 4:23)! సాయంకాలమైనప్పుడు మాటలతో దయ్యములను వెళ్లగొట్టి రోగులనెల్ల స్వస్థపరచాడట (మత్తయి 8:16)! తన శిష్యులను పిలిచి, 'ప్రతివిధమైన రోగమును, ప్రతివిధమైన వ్యాధిని స్వస్థపరచుటకును వారికి అధికారమిచ్చాడట (మత్తయి 10:1).

గురువే గుడ్డిదారిలో పోతుంటే శిష్యులు అడ్డదారిలో పోరా? 'నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష' అంటూ అంధానుకరణచేయటం ఆ కాలంలో పరిపాటే గదా! యేసు దగ్గరుండి తన సువార్తీకులకు స్వస్థత ప్రార్థనలకు తర్ఫీదునిచ్చిన దాఖలాలు కూడా (మత్తయి 9:18, 23-25) వున్నాయి.




ఇవన్నీ ఆ కాలంలో యూరప్ ప్రాంతాలను పాలించే రాజులకు ఉపయోగపడ్డాయి. వీటితో ప్రజలను ఆకర్షించి, తమ పాలనకు వ్యతిరేకులుగా మారకుండా చేయటంలో వారు సఫలమయ్యారు. 'రాజు దైవాంశ సంభూతుడు' (నా విష్ణుః పృధివీపతిః) అన్న భావన యూరప్ లోనూ బలంగా వుండేది. అలాంటి దైవమే' స్వయంగా ఎదుట ప్రత్యక్షమై తమను తాకటం జనానికి ఒక 'దివ్యానుభూతి'గా వుండేది. ఈ బలహీనతను గుర్తించిన ఫ్రాన్స్ రాజు 'ఫిలిప్ ది ఫెయిర్' 1307లో 'స్పర్శ ద్వారా స్వస్థత' (Healing by touching) అనే విధానాన్ని ఆరంభించాడు. జనం ఎగబడేవారు. కొన్నాళ్ళకి ఇంగ్లీషు రాజులూ ఇలాగే చేయసాగారు. క్షయరోగుల్ని తాకేవారు. ముఖాన్ని, కళ్లను నిమిరేవారు. దాన్నే ఆ రోజుల్లో "Royal Touch" అన్నారు. అలా తాకటానికి వీలైన రోగాలను 'The Kings Evil' అన్నారు. ఇవన్నీ జనాన్ని 'స్వస్థత కూటములకు' రప్పించేందుకు దారులు పరచాయి.

19వ శతాబ్దిలో స్వస్థత ప్రార్థనల 'జాతర' అమెరికాకు చేరింది. 20వ శతాబ్ది తొలిభాగం నుంచీ అది ఊపందుకుంది. రెవరెండ్ విలియం బ్రెన్హామ్, జఫర్సన్ విల్లే లాంటి బోధకులు ఈ కూటములను పెద్ద ఎత్తున చేయసాగారు. ఆధునిక స్వస్థత కూటములకు బ్రెన్హామ్ ఆద్యుడని, 1940 నుంచి అతడి హవా సాగిందని పరిశీలకులంటారు. 1947లో ఆయన ఒక చెవిటివానికి చికిత్స చేసాడు. అయినా చెవుడు పోలేదు. 'పొగతాగరాదని ఎంత చెప్పినా పాటించలేదు. అందుకే అతని చెవుడు పోలేదు" అంటూ నెపం రోగిపై వేసాడు. చెవిటివానికి ఆ మాటలెలా వినపడతాయి? వినపడితే స్వస్థతకెందుకు వస్తాడు? 1965లో బ్రెన్హామ్ చనిపోయాడు. తిరిగి బతుకుతాడని శవాన్ని పూడ్చలేదు. నాలుగునెలల తర్వాత పూడ్చక తప్పలేదు. బ్రెన్హామ్ తర్వాత 'స్వస్థత' ప్రచారకులు పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చారు.

20వ శతాబ్ది మలిభాగంలో స్వస్థత ప్రార్థనలతో ప్రసిద్ధికెక్కిన వారు అమెరికాలో పలువురు వున్నారు. ఎ.ఎ. ఆలెన్, డబ్ల్యు.వి.గ్రాంట్, పీటర్ పాపాఫ్, ఓరల్ రాబర్ట్స్, పాట్ రాబర్ట్సన్, డేవిడ్ పాల్, మొదలయినవారు ఈ మోసంతో కోట్లాది డాలర్లు సంపాదించారు. అప్పటికే టెలివిజన్ విరివిగా వ్యాప్తిలోకి వచ్చింది. సైన్సువాదుల కంటే ముందుగా, మతవాదులే దాన్ని వినియోగంలోకి తెచ్చుకున్నారు. మనదేశంలో కూడా, 1980 నుంచి వినియోగం అందుబాటులోకి వచ్చింది. హిందూమతవాదులు, ఇతర మూఢనమ్మకాల వ్యాపారులేదాన్ని బలంగావాడుకున్నారు, వాడుకుంటున్నారు.

## టెలివాంజలిస్టులు

టెలివిజన్ ద్వారా మతబోధచేసేవారిని 'టెలివాంజలిస్టు లంటారు. అలాంటి వారిలో పీటర్ పాపాఫ్ అగ్రభాగాన వుంటాడు. ప్రముఖ నాస్తికవాది, మెజీషియన్, జేమ్స్ రాండీ ఇతని బూటకపు ప్రచారాన్ని బట్టబయలు చేసి 'స్వస్థత ప్రార్థనలన్నీ మోసాలే" అని ప్రపంచానికి చాటాడు. దాంతో అతని మోసపు వ్యాపారం దెబ్బతింది. 1986లో పాపాఫ్ తన యింటిని వేలం వేసి 8,00,000 డాలర్లకు అమ్ముకోవలసి వచ్చింది. అంతకు కొన్నిరెట్ల ఆస్తిని సంపాదించాడు. డబ్లు.వి.గ్రాంట్ నివాసగృహం ఖరీదు 10,00,000 డాలర్లు. ఓరల్ రాబర్ట్స్ ఆస్తి 50,00,00,000 (50 కోట్లు) డాలర్లు. ఇన్ని కోట్లాదిడాలర్లు ఆస్తి సంపాదనంతా కేవలం స్వస్థత ప్రార్థనల వల్లే వచ్చిందని, వీరందరి గుట్టును బయటకు లాగిన జేమ్స్ రాండీ తన 'ఫెయిత్ హీలర్స్' గ్రంథంలో వివరించాడు. వీరిలో ఉన్నత విద్యార్హతలు గలవారు కూడా లేరు. వీరు స్వస్థత కూటముల్లో ఎన్ని రకాలుగా మోసగించేవారో, భక్తులను కానుకలకోసం ఎలా పీడించేవారో కూడా రాసాడాయన.

పాపాఫ్ తన చెవిలో, చిన్న మైక్రో ఇయర్ ఫోన్ ను అమర్చుకునేవాడు. భక్తులలో అక్కడక్కడ సహాయకులను వుంచేవాడు. వాటి సహాయంతో, స్వస్థతకు వచ్చే వారిని పేరుపెట్టి పిలిచి, వారి వివరాలను స్వయంగా వెల్లడించే వాడు. అదంతా తనకు దైవకృప వల్ల సాధ్యమవుతున్నదని గొప్పలు చెప్పేవాడు. ఈ విషయంలో అతని భార్య ఎలిజబెత్ సహకరించేదని జేమ్స్ రాండీ వీడియో సాక్ష్యాలతో నిరూపించాడు. "గుడ్డివారికి చూపు తెప్పించటం' అనే అంశాన్ని ఎక్కువమంది బోధకులు చేస్తుంటారు. డబ్లు.వి. గ్రాంట్ అలాంటి ఒక స్వస్థత చేస్తూ, గుడ్డివాని ముందు నిలిచి తన వేళ్లు చూపి 'ఇవి ఎన్ని అని అడిగాడు. మైకును గుడ్డివానికి దగ్గరగా వుంచి, అతనికి వినపడేవిధంగా, ఎన్నని చెప్పాలో గుడ్డివానికి చెప్పేవాడు. ఆ సంఖ్యలో రోగి మైకులో చెప్పేవాడు. దాంతో, చూసారా గుడ్డివానికి చూపు వచ్చింది' అంటూ గ్రాంట్ చప్పట్లు కొట్టి

పంపేవాడు. రాండీ ఈ బండారాన్ని బయటకు లాగాడు.




నడవలేని వారు చక్రాల కుర్చీలో ప్రార్థనలకు వస్తుంటారు. అలాగైనా, తమకు స్వస్థత చేకూరుతుందన్న నమ్మకంతో. కాళ్లుండీ నడవలేని వారిని స్వస్థత పరచటానికి, స్వస్థత బోధకులు ఏంచేస్తారో రాండీ చెప్పాడు. కూటములకు బయట, బోధకులు కొన్ని చక్రాల కుర్చీలు వుంచుతారు. వారి సహాయకులు అక్కడేవుండి, వయోవృద్ధులను కొందరిని ఎంచి, ఆ కుర్చీలలో కూర్చుండ బెట్టి లోనికి పంపుతారు. స్వస్థతా బోధకుడు, రంగులను బట్టి కుర్చీలను గుర్తించి, ఆ కుర్చీలలో కూర్చున్న వారినే ఎంచి, వేదికపైకి రప్పించి, ప్రార్థన నటించి, వారిని నడిపించే నాటకమాడతాడు. ఈ వ్యాసంలో, పైన చెప్పిన మహారాష్ట్ర కేసు అలాంటిదే. ఇలాంటి ఎన్నో మోసాల్ని జేమ్స్ రాండీ ఆధారాలతో సహా రుజువు చేసాడు. స్వస్థత మోసాలలో ఇటీవల పిల్లలు, మహిళలు కూడా పాలుపంచుకుంటున్నారు. 'బాలవాక్కు బ్రహ్మవాక్కు, "పిల్లల్లో దేవుడుంటాడు' వంటి నమ్మకాలు జనంలో వున్నాయి. 'ఆడది ఆదిశక్తి', 'స్త్రీలు భగవదంశ సంభూతులు, సృష్టికి మూలం వారే" అన్న భావనలు ఇండియా లాంటి దేశాల్లో వ్యాప్తిలో వున్నాయి. అందుకే, కొందరు ఘరానా స్వస్థతా వంచకులు వారితో కూటములలో 'స్వస్థత కార్యములు' సాగిస్తున్నారు. అదొక ఆకర్షణగా మారి, భక్తులు గుంపులుగా వెళుతున్నారు. రెవరెండ్ పాల్ దాసన్ అనే వ్యక్తి 2015లో చెన్నైలో మూడేళ్లపాప 'కేటలిన్ క్రిస్టాబెల్' తో ఆ పనిచేయించాడు. యేసు ప్రభువు తన దివ్యశక్తిని ఆ పాపకు అందించాడని, ఊదరగొట్టాడు. భక్తులు ఆమె దగ్గరకు రాగానే 'నేను శక్తిని నీలోకి పంపుతున్నాను' అంటుందీ పాప. తన అరచేతితో వారి తలలను తాకుతుంది. దాంతో వారు, దానిని నిజమని భ్రమపడుతూ, హిప్నాటిక్ నిద్రలోకి వెళ్ళటమో, పూనకాలతో వూగటమో చేస్తారు. మరికొందరు తమకు స్వస్థత చేకూరిందని అక్కడికక్కడే ప్రకటిస్తారు. తెలుగునాట రమణానంద మహర్షి అనే కపటి 'శక్తిపాతం' పేరుతో చేసే మోసాన్నే ఈ పాపతో చేయిస్తున్నాడు దాసన్. పాపకు ముందుగా శిక్షణ ఇవ్వడం వల్లనే ఆమె అలా చేయగలిగింది.

ఒక్కదాసన్ మాత్రమే గాదు, ఇండియాలో గత యాభై అరవై ఏళ్ల నుంచీ ఈ స్వస్థత మోసాలు జరుగుతూనే వున్నాయి. ఈ ప్రక్రియ ప్రధానంగా అమెరికా నుంచే దిగుమతి అయింది. మహిమలు ప్రదర్శించకపోతే భక్తులకు కిక్కు ఉండదు. భారతీయుల్లో

95 శాతం మందికి మహిమలపై నమ్మకం ఎక్కువ. ప్రశ్నించే తత్వం, శాస్త్రీయదృక్పథం వారికి రుచించని/ అందరాని పండ్లు. ఈ బలహీనతను సొమ్ము చేసుకోవటానికి క్రైస్తవశాఖలన్నీ 1970వ దశకం నుంచీ స్వస్థత దోపిడీకోసం పోటీలు పడ్డాయి. పాల్ దినకరన్, కె.ఎ.పాల్, లాంటి వారు అట్టడుగు స్థాయి నుంచి అత్యున్నతస్థాయి వరకు ఆర్థికంగా ఎదగటానికి ఈ 'స్వస్థత దోపిడీ' తోడ్పడింది. దేశమంతటా ఇది నేటికీ నిర్నిరోధంగా కొనసాగుతూనే ఉంది.

ఈ వంచనకు అడ్డుకట్ట లేదా? చట్టమేమీ చేయలేదా? అనే సందేహాలు రావచ్చు. వుంటే, ఈ పరిస్థితులుండవు. అమెరికా రాజ్యాంగం మొదటి సవరణ 1791 డిసెంబర్ 15న జరిగింది. దాని ప్రకారం మతాలకు చట్టబద్ధంగా స్వేచ్ఛ లభించింది. ఎంత అవినీతికి పాల్పడినా ప్రభుత్వం ఏమీ చేయలేనిస్థితి. ఆర్థిక పారదర్శకతను ప్రభుత్వం అడగలేదు. చర్చీలు తమ జమాఖర్చుల లెక్కలను రహస్యంగా వుంచుకున్నా, అక్కడి ఆదాయపు పన్నుల విభాగం పట్టించుకోదు. పాస్టర్ డెన్నిస్ మెక్ కాలమ్ అన్నట్లు "దురదృష్టవశాత్తు ఉద్దేశపూర్వకంగా తయారు చేసిన ఈ చట్టం వల్ల, అమెరికాలోని చర్చి లెక్కలు అడగటానికి వీల్లేని సంస్థగా మారిపోయింది. నేరస్థులకు, మోసగాళ్లకు లాభార్జన కేంద్రమయింది. వారెవరూ లెక్కలు చెప్పపనిలేదు, ఆదాయపు పన్ను చెల్లించే పనిలేదు". కాబట్టే, అమెరికాలో స్వస్థతావంచనకు అడ్డుకట్ట పడలేదు. పైగా, ఆ దోపిడీ, ఇండియా వంటి పలుదేశాల్లోని బోధకులకు ఆశలు రేపింది. ఆ బాటలో పయనించటానికి వారికి తగిన ధైర్యమిచ్చింది.

భారత రాజ్యాంగంలోనూ దాదాపు ఇదే వుంది. ఆర్టికల్స్ 25, 26, 27లు మత స్వేచ్ఛ కల్పిస్తున్నాయి. మతసంస్థలను స్థాపించుకోవటానికి, వ్యవహారాలు నడుపు కోవటానికి, ఆస్తులు ఆర్జించటానికి వీలుంది. మత నిర్వహణకు అయ్యే ఖర్చులకోసం వచ్చే ఆదాయంపై పన్నులు కూడా వుండవు. కనుకనే, క్రైస్తవశాఖలు ఎన్ని వున్నా వాటి ఆదాయాలు, పన్నులు పారదర్శకంగా కన్పించవు. కూటముల్లో ఎంత వస్తుందో లెక్కలుండవు. కనుక, ప్రభుత్వం కూడా ఈ విషయంలో కట్టడి చేయలేని విధంగా వ్యవహరిస్తోంది.

ప్రార్థనల ద్వారా స్వస్థత చేకూరటం వైద్యశాస్త్రానికి విరుద్ధం. అది 'మేజిక్' ల లాంటిదే. మేజిక్ల ద్వారా రోగాలను కుదర్చటం చెల్లదనే చట్టం 1954లో మనదేశంలో వచ్చింది. "డ్రగ్స్ అండ్ మేజికల్ రెమిడీస్(అబ్జక్షనబుల్ అడ్వర్టైజ్ మెంట్) చట్టం-1954" అనబడే ఆ చట్టం ప్రకారం మేజిక్ క్రియల ద్వారా స్వస్థత చేకూర్చుతామని ప్రకటనలివ్వటం కూడా నేరమే. ఆ చట్టంలోని సెక్షన్ 3, 4,5 క్లాజులు అదే చెప్తున్నాయి.

దాన్ని ప్రచారంలోకి తెచ్చి అందరికీ తెలిసేలా చేస్తే స్వస్థతా వంచన తగ్గుతుంది. మన తెలుగు రాష్ట్రాల్లో 1980-90 దశాబ్దాల్లో నాస్తిక హేతువాద మిత్రులు ఈ చట్టంపై కరపత్రాలువేసి స్వస్థతా కూటముల వద్దపంచి రాష్ట్రం నలుమూలలా సవాళు విసురుతూ చేసిన ప్రచారం వల్ల ఈ వంచనకు కొంత మేరకు అడ్డుకట్టపడింది. ఈ కృషి ఇంకా కొనసాగవలసి వుంది.

'స్వస్థత' క్రియలవల్ల జరిగే ఆర్థిక వంచన, నయవంచనలపై సర్వేలు మనదేశంలో నిర్వహించిన దాఖలాలు లేవు. కానీ అమెరికాలో వున్నాయి. డాక్టర్ సేత్ అస్సెర్ అనే పిల్లల వైద్యుడు, రీటాశ్వాన్ అనే బాలల ఆరోగ్య పరిరక్షణ కార్యకర్త "20 ఏళ్ళపాటు స్వస్థత ప్రార్థన కూటముల్లో పాల్గొని, వైద్యం అందకపోవటం వల్ల మృతిచెందిన" బాలల వివరాలు సేకరించారు. ఆ సర్వే వివరాలను 1998లో ప్రకటించారు. దాని ప్రకారం 20 ఏళ్లల్లో 172 మంది బాలలు స్వస్థత ప్రార్థనలకారణంగా ప్రాణాలు కోల్పోయారట! 'ఇది కేవలం మాకు దొరికిన సమాచారం మాత్రమే. నిజంగా చెప్పాలంటే, ప్రతినెలా అమెరికాలో 1-5 మంది బాలలు తమ తల్లిదండ్రుల, బంధువుల మతమౌఢ్యం వల్ల ప్రాణాలు కోల్పోతున్నారు" అంటాడు డాక్టర్ సేత్ అస్సెర్. స్వస్థత ప్రార్థనలను అమెరికా రాష్ట్రాలన్నింటా నిషేధించే చట్టాలకోసం అక్కడి హేతువాద మానవవాదులే కాదు, 'ది వరల్డ్ యూనియన్ ఆఫ్ డెయిస్ట్' వంటి క్రైస్తవసంస్థలు సైతం ప్రభుత్వానికి విజ్ఞప్తులు పంపుతున్నాయి. అమెరికాలోని 50 రాష్ట్రాల్లో కేవలం 4 రాష్ట్రాలు (హోవాయి, మేరీలాండ్, మసాచుసెట్స్, సౌత్ డకోటా) మాత్రమే స్వస్థత ప్రార్థనలతో పిల్లలను చంపటాన్ని నేరంగా పరిగణిస్తున్నాయి.

తమ అనారోగ్యాన్ని పోగొట్టుకోవటానికి, ఈ ఆధునిక వైద్యశాస్త్రాన్ని కూడా కాదని, జనం ఎందుకు స్వస్థత కూటముల నాశ్రయిస్తున్నారు? అందుకు కారణాలివి-

1. **దైవంపట్ల, పవిత్రగ్రంథ ప్రవచనాల పట్ల ఏర్పడిన ప్రగాఢవిశ్వాసం.** ఆ ప్రవచనాలు వేల ఏళ్ల నాటివని, వైద్యం అందుబాటులో లేనికాలంలో, అహేతుక జ్ఞానంతో రాయబడినవని, ఆనాటి జీవితానికి, నేటి జీవితానికి ఎంతో మార్పువుందని, వాటిని అనుసరించటం చేటు అని జనం గుర్తించటం లేదు.

2. **ప్రార్థనలతో రోగాలను తగ్గిస్తామనేవారే, ఆస్పత్రులెందుకు కడుతున్నారో జనం గ్రహించటం లేదు.** దేశంలోని ప్రతి పెద్ద క్రైస్తవశాఖకు పెద్ద పెద్ద ఆసుపత్రులున్నాయి. అక్కడ ప్రతివ్యాధికీ ఆధునిక వైద్యం వుంటున్నది. దాంతోనే రోగాలు తగ్గుతున్నాయి. ప్రపంచ రోమన్ చర్చ్ అధిపతి పోప్ సైతం కాలువిరిగినా, కడుపులో పుండ్లు పుట్టినా ఆస్పత్రిలోనే వైద్యం చేయించుకున్నాడు.

ప్రార్థనలను కూడా వైద్యానికి జోడించినప్పటికీ, ప్రార్థన చేయని వారికి తగ్గినట్లే, చేసేవారికి తగ్గుతున్నాయి. ప్రార్థనవల్ల అదనపు ప్రయోజనం రోగికి ఏమీ వుండదని భక్తులు గ్రహించాలి కదా!

3. **ప్రార్థనల వల్ల కొందరికి రోగాల నుంచి, బాధలు, మనోవేదనలనుంచి విముక్తి లభించినదనటానికి రుజువులున్నాయని విశ్వాసులు అనుకోవటం.** నిజమే. అదంతా 'ప్లాసిబో' ప్రభావం వల్ల జరుగుతోంది. ప్రార్థించే వారిపట్ల వున్న నమ్మకం, దైవం తమకు తప్పక మేలు చేస్తుందన్న మనోధైర్యం, ప్రార్థించాను గనుక నాకేమీకాదు అనే భరోసా... ఇలాంటి వన్నీ 'ప్లాసిబో' కిందికి వస్తాయి. వీటివల్ల కొన్ని దీర్ఘవ్యాధులకు సైతం తాత్కాలిక ఉపశమనం ఉంటుంది. కానీ వ్యాధి ఏమాత్రం నయంకాదు. అదే స్వస్థత బోధకులను బ్రతికిస్తోంది. మరోవిషయం, మానసిక కలతలకు (సైకో సొమేటిక్) చెందిన వ్యాధులకు మందులతో పనిలేదు. 'దయ్యాలు పట్టటం', 'పూనకాలు, పిచ్చిగా వాగటం, స్తబ్దుగా వుండటం వంటి అనేక ప్రవర్తనలను 'ప్లాసిబో' బాగా కుదుర్చుతుంది. కనుక, ఇలాంటి వాటిని చూసి ప్రార్థనల వల్లనే రోగాలు తగ్గుతాయనుకోరాదు.

4. **వైద్యుని దగ్గరకు వెళ్ళలేని పేదరికమూ, భక్తుల్ని ప్రార్థనలవైపు మళ్లిస్తోంది.**

5. **చాలామంది విశ్వాసులు, తాము ఎంత భక్తి విశ్వాసాలతో వుంటే దేవుడంతగా తమను కరుణిస్తాడని, కనుక, దైవతృప్తికోసం జీవితాన్ని అంకితం చేయాలని భావిస్తారు.** దేవుడిచ్చిన జీవితాన్ని దేవునికే ఇచ్చివేయాలని, దైవసన్నిధికి చేరటమే అంతిమ లక్ష్యమని నిర్ణయించుకొంటారు. అది నెరవేరటానికి కూటములను సాధనాలుగా చేసుకుంటారు.

"మీకు ఎడ్రినలిన్ అనుభూతిలోకి తెస్తే, అదే మీ బాధను చంపుతుంది' అంటాడు డెరైన్ బ్రౌన్. ఆయన అమెరికా అంతటా కొన్నివేల స్వస్థత కూటముల్ని నడిపిన బోధకుడు. మన శరీరంలో ఎడ్రినలిన్' అనే హార్మోను ఉత్పత్తి అవుతుంటుంది. బోధకులు తమ ప్రసంగాలు, అరుపులు, కేకలు, దుఃఖాలు, కరుణాత్మక కథలు మొదలయిన వాటిద్వారా భక్తుల్లో భావోద్రేకాన్ని, ఆందోళనలను పెంచుతారు. దాంతో రక్తప్రసరణ, శ్వాసక్రియ, జీర్ణక్రియలు వేగవంతమవుతాయి. అవే బాధలను నివారిస్తాయి అని బ్రౌన్ ఉద్దేశం. ఈ క్రైస్తవబోధకుడు ఇటీవలే ఆ మతం నుంచి, స్వస్థతా వంచన నుంచి బయటపడి నాస్తికుడయ్యాడు. 'ప్రీమియర్ క్రిస్టియానిటీ మేగజైన్' అతనితో ముఖాముఖి (ఆగస్ట్ 2016) నిర్వహించినపుడు నిర్మొహమాటంగా స్వస్థత వంచన గురించి వెల్లడించాడు.

డెర్రెన్ బ్రౌన్ ఒక్కడే కాదు, అమెరికా అంతటా ఎందరో విశ్వాస ప్రచారకులు క్రైస్తవం నుంచి బయటపడుతున్నారు. యూరప్‌లో, ఆస్ట్రేలియాలో, పసిఫిక్ దేశాల్లో ఇలాంటి వారు నానాటికీ పెరుగుతున్నారు. తమ అనుభవాలను గ్రంథరూపంలో ప్రచురిస్తూ చేసిన తప్పులకు ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నారు.

ఏ మతమైనా ప్రార్థనలు లేకుండా లేదు. ప్రార్థనలతో రోగస్వస్థత చేకూరుతుందని ఏ మతము చెప్పినా తప్పే. అలా చెప్పే ప్రవచనాలు, ప్రవచనకారులూ విశ్వాసులకు ఎండమావులు. వాటి వెంటబడి వివేకాన్ని కోల్పోయి బతకటం, వాటికోసం ప్రాణాలను సైతం పణంగా పెట్టటం మూర్ఖత్వమని గ్రహించాలి.



# సూదంటురాళ్లతో పోతుందా రోగం?

కృష్ణమూర్తి చాలా కాలం నుంచి మోకాళ్లనొప్పులతో బాధపడుతున్నాడు. ఒకరోజు అతనింటికి, అతని స్నేహితుడు రంగరాజు వచ్చాడు. కుర్చీలోంచి లేచివెళ్ళి రంగరాజును ఆహ్వానించేందుకు చాలా ఇబ్బంది పడ్డాడు కృష్ణమూర్తి. రంగరాజుకు పరిస్థితి అర్థమయింది. "ఒరేయ్ మూర్తీ! నువ్వెన్ని వైద్యాలు చేయించినా, ఏఏ డాక్టర్లకు చూపించినా నీ మోకాళ్లనొప్పులు తగ్గవు. నా అనుభవంలో దీనికి ఒకటే వైద్యం- అయస్కాంత చికిత్స. ఈ చికిత్స జరిపే వైద్యుల దగ్గరకు ఒకరోజు వెళదాం, సరేనా?" అని స్నేహితుని ఒప్పించాడు రంగరాజు.

మణెమ్మకి కేన్సర్. ఆరునెలల నుంచి ఆస్పత్రుల చుట్టూ తిరుగుతూనే ఉంది. రేడియేషన్ చికిత్స కూడా జరిగింది. అయినా పూర్తిగా తగ్గుతుందని డాక్టర్లు హామీ యివ్వలేదు. ఒకరోజు, ఆమెను పరామర్శిద్దామని వచ్చాడు మేనమామ సంగీతరావు. "చూడమ్మాయ్! ఈ అల్లోపతి వైద్యం వల్ల నీరోగం తగ్గదు. మాయింటి ప్రక్కనే వుండే రాధమ్మకి నీలాగే గర్భాశయ కేన్సర్ వస్తే అయస్కాంతాలతో (సూదంటు రాళ్ళతో) వైద్యం చేయించింది. అంతే, కేన్సర్ మటుమాయమైంది. ఆమెనడిగి వివరాలు ఫోనులో చెపుతాను. నువ్వుకూడా ఆ పనిచెయ్." అంటూ ఉచితరాగం ఆలపించాడు సంగీతరావు.

రంగరాజు, సంగీతరావు లాంటి విద్యావంతులు అమాయకంగా ప్రచారం చేస్తున్న చిట్కా వైద్యాల్లో అయస్కాంత చికిత్స'కు ప్రాచుర్యంవుంది. ఏ రోగానికైనా సరే, అయస్కాంతాల నుపయోగించి చికిత్సచేస్తే, తిరిగి మళ్లీ ఆ రోగం తలెత్తదన్న ప్రచారాన్ని గట్టిగా చేస్తున్నారు.

ఒక ఫిజిక్స్ ప్రొఫెసర్ వున్నాడు. ఒకరోజు ఆయన ఒక సైన్సువాదుల మీటింగ్ కి వచ్చాడు. ఆ మీటింగ్‌లో ప్రత్యామ్నాయవైద్య విధానాల గురించి ఒక వైద్యుడు ప్రసంగిస్తుంటే, ఆ ప్రొఫెసర్ అడ్డుతగిలి 'రసభంగం' కావించాడు. మాగ్నెట్ తెరపీ (అయస్కాంత చికిత్స) సరైందికాదు, దానికి వైజ్ఞానిక నిరూపణ లేదని వైద్యుని అభిప్రాయం. అది ప్రొఫెసర్ కి అభ్యంతరకరంగా అనిపించింది. 'నేను భౌతిక శాస్త్ర నిష్ణాతుణ్ణి. అయస్కాంతశక్తి గురించి నాకు తెలుసు. నువ్వు బయాలజీ (జీవశాస్త్రం) చదివి, తర్వాత వైద్యవృత్తిలోకి వెళ్లావు. అయస్కాంత తరంగాల గురించి, మనిషిపై వాటి ప్రభావం గురించి నువ్వెక్కడ చదివావో చెప్పు." అంటూ చాలా ఆవేశాగ్రహాలతో మాట్లాడుతుంటే, ఆ సభలో వున్నవాళ్ళంతా ఆ ప్రొఫెసర్ వాగ్ధోరణికి విస్తుపోయి చూసారు. ప్రొఫెసర్ చెప్పింది నిజమే కావచ్చు', అనే అభిప్రాయం కొంతమందిలో పొడచూపటానికి ఆ ప్రొఫెసర్ వాదన పనిచేసింది.

'ఆరోగ్యమే మహాభాగ్యం'- అక్షరలక్షలు విలువగల సూక్తి. ఆరోగ్య రక్షణకోసం ఎన్ని లక్షల ఖర్చుకైనా జనం వెనకాడని రోజులివి. పొలాలు అమ్మి, నగలమ్మి, ఇళ్లమ్మి అయినా సరే, కార్పోరేట్ ఆస్పత్రులలో వైద్యానికి పరుగులిడుతున్న జనానికి, అయస్కాంతచికిత్సల వంటి వైద్య ప్రచారాలు 'కారుచీకట్లో కాంతిరేఖ" లవుతాయి. అడ్డదిడ్డంగా జనాన్ని దోచుకుతింటున్న ఖరీదైన కార్పొరేట్ వైద్యంకోరల్లో పడటానికి భయపడే వారు సైతం ఈ 'కాంతిరేఖ'లకు ఆకర్షితులవుతుంటారు.

సైన్స్ గురించి ప్రాథమికాంశాలు కూడా తెలియనివారు ఇప్పటికీ చాలామంది వున్నారు. నిరక్షరాస్యులనలా వుంచండి. విద్యావంతులు సైతం, సైన్సును మార్కులకోసం చదవటం, పోటీపరీక్షల్లో సీట్లసాధనాదృష్టితో చదవటం ఒక విధానం'గా సాగుతున్న సమాజంలో 'శాస్త్రీయపద్ధతి' (సైంటిఫిక్ మెథడ్)లో పరిశీలించే నైజం అలవడటం అసాధ్యమవుతోంది. ఆ కారణంగా నమ్మకాలకు సైన్సును జోడించి, 'అందమైన అబద్ధాల'ను అల్లితే, అవి తేలిగ్గా జనావళిని ఆకర్షించి మోసకారుల బుట్టలో పడటానికి" దోహదపడతాయి.

ఇప్పటికీ అయస్కాంత చికిత్సలను జనం నమ్ముతున్నారు. 20-30 ఏళ్లక్రితం అయస్కాంత వ్యాపారం తెలుగునేలపై జోరుగా సాగింది. చిన్నచిన్న అయస్కాంతాలను

అమర్చిన లాకెట్లు, చేతికి కట్టే వలయాలు, అయస్కాంత చెప్పులు, తలగడలు, పరుపులు, కుర్చీలు, మెత్తలు, అరికాళ్లతో వ్యాయామం చేసేపీటలు, బెల్టులు, మోకాళ్లకు కట్టే పట్టీలు, నుదుటికి కట్టే బాసికాలు... ఇలా ఎన్నో వస్తువులు బహిరంగ విపణిలో కోట్ల వ్యాపారాన్ని సాగించాయి. జపాన్, చైనా, తైవాన్ లాంటి విదేశీ తయారీలయిన అయస్కాంత పరుపులు రూ. 10,000/- నుంచి రూ. 25,000/- వరకు ధరలతో విపరీతంగా అమ్ముడయ్యాయి. అదే సమయంలో అయస్కాంత చికిత్స'ను తెలిపే సాహిత్యం అచ్చయి, బాగా అమ్ముడయింది. పాఠకాకర్షణ కోసం తెలుగునాట దినపత్రికలతో సహా, 'మీడియా అంతటా అయస్కాంతాల మహత్తు' గురించి ప్రచారం సాగింది. జనంలో వ్యాపిస్తున్న ఈ క్రేజ్‌ని సొమ్ము చేసుకోవటానికి ఏ చదువూ వైద్య డిగ్రీ లేని 'అయస్కాంత వైద్యులు' అవతరించి జనాన్ని సులువుగా తమవైపుకి 'లాక్కున్నారు'. రోగగ్రస్తమైన శరీరాంగాల పైన, వివిధ సైజుల్లోని అయస్కాంత గడ్డలను 15-20 నిమిషాలు ఉంచటం వల్ల రక్త ప్రసరణ, కణజాలంలో ఏర్పడ్డ అవరోధాలు, చెడుపదార్థాలు తొలగి ఆ రోగం మాయమవుతుందని ఆ 'వైద్యులు' చెప్పేవారు. ఏ మందులూ ఇవ్వకపోతే జనం తమచికిత్సను విశ్వసించరని అయస్కాంత నీటి సీసాలను, నూనెలను అమ్మేవారు. అంటే నీళ్లల్లో అయస్కాంతాలను కొన్ని గంటలపాటు నిల్వవుంచటం వల్ల, ఆ నీటిలో వుండే ఆక్సిజన్, హైడ్రోజన్ల 'అయాన్లు' (అతిసూక్ష్మ అణువులు) విద్యుదయస్కాంత తరంగాలతో వేడెక్కుతాయని, ఆ నీటిని ఔషధంగా మార్చి రోగాలను తగ్గిస్తాయని నమ్మబలికేవారు. ఇదే 'నూనెలకు' కూడా అన్వయించి ఔషధంగా అమ్మేవారు.




శరీరంలో ఎక్కడ ఏ నొప్పులు వచ్చినా అక్కడ అయస్కాంతాల నుంచటం ఈ చికిత్సలో సాధారణం. వ్యాధి దీర్ఘకాలికమైనదైనా, తీవ్రమైనదైనా, శరీరంలోని ఆయాభాగాలపైన చిన్నచిన్న అయస్కాంతాలనుంచి, ప్లాస్టర్లతో వాటిని కప్పి రోజుల తరబడీ వుంచటం జరుగుతుంది. అజీర్ణం, మలబద్ధకం, ఆకలి మందగించటం, కడుపులో మంట, కడుపులో పుండ్లు, పేగులవాపు మొదలయిన వ్యాధులకు, జీర్ణమండలంలో అయస్కాంతాలను వుంచటం కుదరదు గనుక, అయస్కాంత నీటిని

తాగమంటారు. అపెండిసైటిస్ వచ్చినా అదే చికిత్స. పచ్చ కామెర్లు వంటి కాలేయ వ్యాధులకు, కంఠనొప్పి వంటి శ్వాసకోశ వ్యాధులకు ఆ నీటి చికిత్సే. మూలశంక (పైల్స్), పురీషనాళ పగుళ్లవంటి మలద్వార వ్యాధులకైతే చిన్న అయస్కాంతాలను మలద్వారం దగ్గరవుంచి ప్లాస్టర్ అంటిస్తారు. అయస్కాంతాలతో చేసిన కుర్చీల మెత్తల పై కూర్చుండ బెడతారు. ఉబ్బసం, న్యుమోనియా వంటి ఊపిరితిత్తుల వ్యాధులకు, అయస్కాంత నీటిని తాగించి, నూనెలను రొమ్ములపై పూసి, చికిత్స చేస్తారు. బి.పి. రక్త సంబంధ వ్యాధులన్నిటికీ తమ చికిత్సకు మించింది లేదని ఆ చికిత్సకులు గొప్పగా చెప్తారు. మూర్ఛ, పోలియో, పక్షవాతం, పంచేంద్రియాలకు వచ్చే సమస్త వ్యాధులు, మూత్రపిండాల్లో ఏర్పడే రాళ్లు, స్త్రీల ఋతుసంబంధవ్యాధులు, నపుంసకత్వం, వంధ్యత్వం, బట్టతల, మతిమరుపు, .... ఇలా ఒకటేమిటి ప్రతిచిన్న, పెద్ద అనారోగ్యాలన్నింటికీ ఒకటే మంత్రం 'అయస్కాంత చికిత్స'. అంతేకాదు, తమవైద్య విధానంలో, అవసరమైనపుడు, ఆక్యుపంక్చర్ చికిత్సలో చెప్పబడే ఆ 'పాయింట్లు" పరిజ్ఞానాన్ని కూడా వినియోగించుకుని, ఆ పాయింట్ల దగ్గర సూదంటురాళ్ళు (అయస్కాంతాలను) ఉంచుతారు. వీటన్నింటికన్నా మరో జోక్ కూడా వుంది. 'అయస్కాంత వినియోగంతో ముసలితనం దరిచేరకుండా చేస్తారట!'

## వైద్యంలోకి సూదంటురాళ్లు ఎలా వచ్చాయి?

అయస్కాంతాల గురించి మనిషికి ఎప్పుడు తెలిసిందో తెలియదు. అధర్వవేదంలో 'సికతాశ్మన్' (ఇసుకరాయి) గురించి, వుందని, అదే 'అయస్కాంతరాయి' అని కొందరన్నారు. అయస్-అంటే ఇనుము. కాంత అంటే ఆకర్షించేది. ఇనుమును ఆకర్షించే 'అయస్కాంతం' గురించి ఒక ఇతిహాసాన్ని చెపుతారు. ఎప్పుడో సుమారు 2500 సంవత్సరాల క్రితం ఒక గొర్రెల కాపరి చేతిలోని ఒక ఇనుప ఊచ ఒకరాయికి అతుక్కుపోయి, ఎంత గుంజినా రావటం కష్టమైందని, ఆ గొర్రెల కాపరి పేరు మాగ్నటిస్ కనుక ఆ రాయిని 'మాగ్నెట్" అన్నారని ఒక కథనం. మ్యాగ్నేసియా అనేచోట ఇనుప గనులున్నాయని, వాటిలో కొన్ని ఆకర్షణగుణాల గల ముక్కలు దొరికాయని, ఆ ప్రదేశం కారణంగా 'మాగ్నెట్' పేరు వచ్చిందని మరోకథనం. ఈజిప్టు రాజు టోలెమీ కుమార్తె క్లియోప్రాతా తన అందాన్ని కాపాడుకోవటానికి, ఒక అయస్కాంత బిళ్లగల పట్టీని నుదుట ధరించేదని అంటారు. పూర్వం దొంగలు అయస్కాంతాలను తమతో తీసుకెళ్లి, వాటిని దొంగతనాలలో వాడేవారట!

వైజ్ఞానికరంగంలో అయస్కాంతాల చరిత్ర క్రీ.పూ. 6వ శతాబ్ది నుంచీ వుంది. అయితే క్రీ.శ. 15వ శతాబ్దం తర్వాత, విద్యుత్ గురించి ఆలోచనలు మొదలయ్యాక, విద్యుత్ కీ అయస్కాంతత్వమే కారణమన్నది రుజువయ్యాక, దానికి ప్రాధాన్యత పెరిగింది, భూమికీ అయస్కాంతగుణం వుందని, దాని ఆకర్షణశక్తికి అదే కారణమని, జడ, చేతన పదార్థాలన్నింటి పై ఎంతోకొంత అయస్కాంత ప్రభావముంటోందని తెలిసాక, జీవులపై అయస్కాంత ప్రభావాన్ని అధ్యయనం చేసే జీవఅయస్కాంతశాస్త్రం (బయోమేగ్నటిక్స్) ముందుకొచ్చింది. దాన్ని ఆధారంగా చేసుకొని, అనేక ఊహలతో, కల్పనలతో ఒక వైద్యవిధానాన్ని రూపొందించిన వారిలో ముందుగా చెప్పదగినవాడు ఫ్రాంజ్ అంటోన్ మెస్మర్. వృత్తిరీత్యా ఈయన వైద్యుడే. పారా సెల్సస్ అనే వ్యక్తి అయస్కాంతాలతో రోగాలను తగ్గించవచ్చున్నాడని, విని, మొదటిసారిగా 1774లో ఒక మహిళ మీద దాన్ని ప్రయోగించాడు. ఆమెకు ఆ వైద్యం సంతృప్తి కల్గించింది. ఆ తర్వాత వియన్నా దేశపు మహారాణి పెంపుడు కూతురు దృష్టిలోపానికి అయస్కాంత చికిత్స చేసి మెప్పుపొందాడు. అయితే, వియన్నా విశ్వవిద్యాలయ పరిశోధక కమిటీ కేసును పరిశీలించి, ఆ బాలిక దృష్టిలోపం అలాగేవుందని, తనకు మెరుగైనట్లు బాలికకు అన్పించేలా మెస్మర్ తన సూచనలను యిచ్చాడని తేలింది. అప్పటి నుంచే అలాంటి చర్యలను 'మెస్మరిజం' అనటం మొదలయింది.

దాంతో మెస్మర్ ఆ దేశాన్ని విడిచి, ఆ తర్వాత బవారియా, అక్కడి నుంచి పారిస్ వెళ్లాడు. ఎక్కడికి వెళ్లినా, అయస్కాంత చికిత్సతో ఆయనకు "వికర్షణ'లే మిగిలాయి. ఫ్రెంచి అకాడమీ ఆఫ్ సైన్సెస్ వారు కూడా అతని మేగ్నటిజం' మీద పరిశోధనలు జరిపి, అది మోసపూరితచర్యగా, ఊహాజనిత వైద్యంగా ప్రకటించారు. పారిస్ నుంచి దూరమై 1815లో, తన 81 ఏళ్ల వయసులో మెస్మర్ అతి దీనావస్థలో మృతిచెందాడు. మెస్మర్ చేసిన చిట్కాపనులు కొందరిని ఆకర్షించాయి. వారిద్వారా అదొక వైద్యవిధానంగా ప్రాచుర్యం పొందింది.

### చికిత్సకులు ఎలా సమర్థిస్తుంటారు?

అయస్కాంత శక్తిపట్ల బలమైన అవగాహన గలవారు, భౌతికశాస్త్ర పరిజ్ఞానం గలవారు అతీతశక్తుల ఉనికిపట్ల నమ్మకం గలవారైతే, ఈచికిత్సా విధానాన్ని సమర్థిస్తారు. వారి భౌతిక శాస్త్ర సూత్రాలను గుడ్డిగా జీవక్రియల్లోనూ అనుసంధానిం చటమే కారణం. అలాగే, అయస్కాంత వైద్యులదీ అదేదారి. వారేమంటారంటే...

1. జగత్తులో ప్రతి పరమాణువులోనూ ఎలక్ట్రాన్లువుంటాయి. వాటిద్వారా విద్యుదయస్కాంతత్వం అణువులకేర్పడుతుంది. ఇది జీవకణాలకూ వర్తిస్తుంది. ప్రాణం ఒక విద్యుదయస్కాంత అద్భుతం..

2. జీవుల శరీరంలో రక్తం ఉంది. అందులో ఎర్రరక్తకణాల్లో 'హిమోగ్లోబిన్' వుంది. 'హిమో' అంటే ఇనుము. దాని వల్లనే రక్తానికి ఎర్రరంగు వస్తుంది. ఆ ఇనుమును అయస్కాంతాలు ఆకర్షిస్తాయి. అప్పుడు వెచ్చబడిన రక్తంలో అయాన్ల సంఖ్య పెరిగి అవయవాల అనారోగ్యాన్ని తొలగిస్తుంది.

## సైన్సు ఏమంటోంది?

ఈ రెండు మౌలిక కారణాలను ఆధునిక విజ్ఞానం, అయస్కాంతచికిత్సపై జరిగిన పరిశోధనలు తిరస్కరిస్తున్నాయి. వాటి ప్రకారం–

1. పరమాణువుల్లో ఏర్పడే ఎలక్ట్రాన్ల విద్యుత్ తత్వానికి, జీవకణాల్లోని న్యూక్లియస్‌లకి సంబంధం లేదు. జడపదార్థాల భౌతిక సూత్రాలను పూర్తిగా జైవిక ప్రక్రియలకు అనుసంధానించటం సరికాదు.

2. జీవుల రక్తంలో ఇనుము' ఉండే మాట నిజమే. అయితే అది ఇనుపలోహ లక్షణాలు కల్గివుండదు. హిమోగ్లోబిన్ మాలిక్యూల్స్ లో రసాయనస్థితి, లోహంగావున్న ఇనుము లక్షణాలు గల్గి (ఫెర్రో మాగ్నటిక్) వుండదు. అంటే ఆ ఇనుమును అయస్కాంతం ప్రభావితం చేయలేదు. కనుక రక్తం వెచ్చబడటం, అయాన్ల సంఖ్య పెరగటం, రోగాన్ని తగ్గించటం అనేవి నిజంకావు.

పై వాటిని నిరూపించటానికి విదేశాల్లో కొన్ని ప్రయోగాలు జరిగాయి. అమెరికన్ పిడియాట్రిక్ మెడికల్ అసోసియేషన్ వారు 1997లో మడమ నొప్పులకు అయస్కాంత చికిత్స వల్ల కలిగే ప్రయోజనాలపై పరిశోధన చేస్తారు. అది మడమ నొప్పిని ఏ మాత్రం తగ్గించలేక పోయిందని వెల్లడించారు. కాళ్లకి ధరించే బూట్లలో ఉండే అయస్కాంతాల శక్తి మడమను చొచ్చుకొనిపోగల స్థాయిలో వుండదన్నారు.

బ్యాటరీ అనే శాస్త్రవేత్త badscience.com లో ఈ చికిత్స గురించి చెపుతూ **'రక్తం అయస్కాంతాలకు ఆకర్షితం కాదు. దీన్ని మీరూ పరిశోధించవచ్చు. మీ రక్తపు బొట్టులను ఒక చిన్నమూతలోకి చిందించండి. దానిపైన అయస్కాంతం వుంచండి. మీ రక్తంలో ఏ కదలికా వుండదు. అలాగే, మీ చర్మంపై మాగ్నెట్ వుంచండి. మీ చర్మం ఎర్రగా మారకపోవటాన్ని మీరే గుర్తిస్తారు.'** అంటాడు.

ఇటీవల రోగనిర్ధారణ పరీక్షలకు యం.ఆర్.ఐ. స్కాన్ తరచూ వాడుతున్నారు. MRI యంత్రంలో చాలా శక్తివంతమైన అయస్కాంతాలను వినియోగిస్తారు. దాన్ని గుర్తుచేస్తూ బ్యాటరీ "నిజంగా మీ రక్తంలోని ఇనుమును MRIలోని అయస్కాంతం ఆకర్షించగల్గేదైతే మీరు గాల్లోకి లేచిపోతారు." అంటాడు. అంతేకాదు, "పెద్ద పెద్ద అయస్కాంత క్రేన్లు కార్లను ట్రక్కులను పైకి లేపుతుంటాయి. ఆ క్రేన్ల కింద మీరు నిలబడండి. మిమ్మల్ని అంత బలమైన అయస్కాంతాలు కూడా ఏమీ చేయలేవు. మీ తలలోని రక్తం ఆకర్షితమై, పుర్రె పగలటం లాంటివి జరగవు' అంటాడు.

అంతదాకా ఎందుకు? రక్తహీనతకు మనం ఐరన్ టాబ్లెట్లు వాడతాం. వాటిలో ఇనుము" వుంటుంది. అయస్కాంతం వాటిని ఆకర్షించగలదేమో చూడండి. గోంగూర, బచ్చలికూర వంటి ఆకుకూరల్లో ఐరన్' ఎక్కువ అంటారు. వాటినీ అయస్కాంతాలు ఆకర్షించవు. కారణం, వాటిలోవుండే ఇనుముకి 'ఫెర్రో మాగ్నటిక్' స్వభావం లేకపోవటమే. రక్తానికి ఆ స్వభావమే వుండివుంటే, అయస్కాంతాలు మన శరీరాన్ని తాకగానే, రక్తంలోని ఎర్రరక్త కణాలన్నీ మిగిలిన కణాలతో వేర్సై, జీవం మనుగడకే ప్రమాదం సంభవిస్తుంది.

బ్రిటన్‌లో టిమ్ హార్లో నాయకత్వాన ఏర్పడిన ఐదుగురు వైద్యనిపుణుల బృందం 2004 డిసెంబర్‌లో నియంత్రిత పద్ధతిలో ఒక పరిశోధన చేసింది. 45-80 సం॥ల మధ్య వయసున్న 194 మంది ఆస్టియో ఆర్థరైటిస్ (తుంటి, మోకాళ్ల నొప్పులు) వున్న రోగుల్ని తీసుకొని మూడు విభాగాలు చేసింది. కొందరికి శక్తివంతమైన అయస్కాంతత్వంగల పట్టీలను, కొందరికి బలహీన అయస్కాంతత్వం గల వాటిని మూడో వర్గానికి అయస్కాంతాలు లేని పట్టీలను అమర్చి 12 వారాలు పరీక్షించింది. అయస్కాంత పట్టీలు గలవారిలో నొప్పి చాలా స్వల్పంగా తగ్గినట్లు గమనించింది. అందుకు ప్లాసిబో ప్రభావం కారణం కావచ్చునన్నారు.

2009లో ఇలాంటిదే మరోపరిశోధనను డాక్టర్ రిచ్మండ్, నాయకత్వంలో వైద్యులబృందం చేపట్టింది. ఆస్టియో ఆర్థరైటిస్ గల 45మంది రోగులకు 16 వారాలపాటు, నాలుగు అయస్కాంతాల వంతున శరీరాంగాలకు వుంచి వాటి ప్రభావాన్ని పరిశీలించారు. నొప్పిని, గాఢతను అవయవాల పనితీరుపై అయస్కాంతాలు ఏమాత్రం ప్రభావం చూపలేకపోయాయని నిరూపించారు. అయితే 'ప్లాసిబో' ప్రభావం మాత్రం రోగులపై ఉండవచ్చు నన్నారు. **'ప్లాసిబో' అనేది, ఏ ప్రభావమూ లేని ఔషధాలను వినియోగించటం ద్వారా, లేదా వస్తువులను ఉపయోగించటం ద్వారా రోగులలో కల్పించే సంతృప్తికారణంగా, ఆరోగ్యంలో వెల్లడయ్యే మార్పు.**

ఇంకా ఇలాంటి పరిశోధనలు చాలా జరిగాయి. అయినా ఎక్కడా అయస్కాంత చికిత్సను సమర్థించే సాక్ష్యాలు దొరకలేదు. అయినా, ప్రపంచమంతటా ఏడాదికి బిలియన్ (100కోట్ల) డాలర్ల వ్యాపారం ఈ చికిత్సకు వినియోగించే వివిధ వస్తువుల అమ్మకాల వల్ల జరుగుతోందని 1999లో Weintraub అనే సంస్థ అంచనావేసింది.

## మరి మనదేశంలో...?

ఈ ఘరానా వ్యాపార దోపిడీలో మనదేశమూ వుంది. ఈ బూటకపు చికిత్సల్లాంటివి చాలావున్నాయి. అప్పటికే వాటికి సంబంధించిన ఒక కేసును విచారించిన ఢిల్లీ హైకోర్టు 18-11-1998లో తీర్పునిస్తూ ప్రత్యామ్నాయ వైద్యవిధానాలను' నియంత్రించే చట్టాన్ని కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు తక్షణమే చేసి, గుర్తింపులేని వైద్యవిధానాల పట్ల ప్రజలు అప్రమత్తంగా వుండే ప్రచారం చేయాలని ఆదేశించింది. దాన్ని అనుసరిస్తూ కేంద్రప్రభుత్వం, ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రీసెర్చ్ (I.C.M.R.) సంస్థకు డైరక్టర్ జనరల్ గావున్న డాక్టర్ యన్. కె.గంగూలీ నాయకత్వాన 15మంది వైద్యాధికారులతో ఒక నిపుణుల కమిటీని ఏర్పర్చి ప్రత్యామ్నాయ వైద్యంపై సూచనలు కోరింది. ఆ కమిటీ చేసిన సూచనల ప్రకారం, ఇప్పటికే గుర్తింపు పొందిన అల్లోపతి, నేచురోపతి, ఆయుర్వేద, యునాని, హెమియోపతి, సిద్ధ యోగాలు తప్ప మిగిలినవన్నీ గుర్తింపులేనివైద్యాలే. పై ఏడింటికి మాత్రమే ప్రభుత్వ గుర్తింప ువుంది. ఆ వైద్యాలను నిబంధనల ప్రకారం అభ్యసించి, పట్టాలు పొందినవారు మాత్రమే 'డాక్టర్" అనే బిరుదును తమపేర్లకు వాడుకోవాలి. అయస్కాంతచికిత్స, ఆక్యుపంక్చర్, రేకి, మూత్రవైద్యం, సంగీతవైద్యం మొదలయిన 12 విధానాలు దేశ, విదేశాల్లో వ్యాప్తిలో వున్నప్పటికీ వాటికి గుర్తింపులేదని ఆ కమిటీ తెలియజేసింది. కమిటీ సూచనలను ఆమోదిస్తూ, భారత ప్రభుత్వం ఒక సర్క్యులర్‌ను (No. R.14015/25/96-U&H(R) (Pt): 25-11-2003) రాష్ట్రాలకు జారీచేసింది.




ఆ ఉత్తర్వులకు అప్పటి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఎటువంటి ప్రచారమూ యివ్వలేదు గనుక, ప్రజాసంఘాలు ఆ పనికి పూనుకున్నాయి. 2006 ఏప్రిల్ 28న అప్పటి రాష్ట్ర ఆరోగ్యమంత్రి కె.రోశయ్య గారిని కలిసి ఒక విజ్ఞాపన అందించాయి.

డాక్టర్ ఎన్. ఇన్నయ్య నేతృత్వంలో బి.సాంబశివరావు (మానవ వికాసవేదిక), టి.వి.రావు (జనవిజ్ఞానవేదిక), ఇసనాక మురళీధర్‌లు ఆరోగ్యమంత్రిని కలిసి 'అయస్కాంత చికి చిట్కా చికిత్సల వల్ల జరుగుతున్న మోసాల్ని, దోపిడీని వివరించి, వాటిపట్ల ప్రజలు అప్రమత్తంగా వుండేవిధంగా ప్రభుత్వం ప్రచారం చేపట్టాలని కోరటం జరిగింది. ఆ విషయాన్ని అన్ని జిల్లాల వైద్యాధికారులకు పంపి, తగుచర్య తీసుకుంటానని మంత్రి హామీ యిచ్చారు.

సమాజాన్ని ఆధునికతవైపుకు నడిపించటంలో సైన్సు కున్న పాత్ర సాటిలేనిది. దాని సామాన్య ప్రజల చెంతకు చేర్చాలి. ప్రభుత్వ బాధ్యతల్లో అదీ ఒకటి. ప్రజాసంక్షేమ కార్యాల్లో దానికీ స్థానముంది. అలా జరగటం లేదు గనుక, జనం పాతనమ్మకాలను పట్టి వేలాడుతున్నారు. తమ అనారోగ్యానికి ఇంకా చిట్కా వైద్యాలనే ఆశ్రయిస్తున్నారు. ప్రజలు అందుకోనంత ఎత్తులో ఖరీదైన కార్పొరేట్ వైద్యం వుండటం, అందుబాటులో వుండాల్సిన ప్రభుత్వవైద్యం, వైద్యులు సేవాదృక్పథాన్ని కోల్పోయి, ధనార్జనే ఏకైక లక్ష్యంగా వ్యాపార దృష్టితో వ్యవహరిస్తూ వుండటం, ఈ పరిస్థితుల్ని ఏ ప్రభుత్వాలూ సరిచేయలేని దుస్థితి... ఇవన్నీ కలిసి సూదంటురాళ్ల వైద్యాలకు ప్రాచుర్యం తెస్తున్నాయి. ప్రజల ఆరోగ్య, జీవితాలకు ముప్పుగా పరిణమిస్తున్నాయి. దాహం తీర్చుకోవటానికి ఎండమావుల వెంట పరుగెత్తినట్లు, ప్రాణాన్ని నిలబెట్టుకోవటానికి చిట్కా వైద్యాలను జనం ఆశ్రయిస్తున్నారు. ఈ వాస్తవాన్ని గుర్తించి, ప్రభుత్వంపై వత్తిడి పెరిగి, శాస్త్రీయవైద్యం అందరికీ ఉచితంగా అందే రోజులు వస్తే ఈ చిట్కావైద్యాలకు కాలం చెల్లుతుంది.



# లంఖణం పరమౌషధమేనా?




**పదమూడేళ్ల** బాలిక ఆరాధన. 8వతరగతి చదువుతోంది. సికిందరాబాద్ లో, ఆమె తల్లిదండ్రులు నగల వర్తకం చేస్తుంటారు. జైనమత ఆచారాలను చిత్తశుద్ధిగా పాటిస్తుంటారు. ఉపవాసం ఆత్మను పరిశుద్ధ పరస్తుందని, దైవసాన్నిధ్యానికి మార్గాన్ని సుగమం చేస్తుందని జైనమతావలంబకుల ప్రగాఢవిశ్వాసం. అందులో ఆబాల వృద్ధులూ ఆ ఆచారం పట్ల మక్కువ చూపుతారు. ఆరాధన తల్లిదండ్రులూ అలాగే చేస్తారు.

2015 సంవత్సరంలో ఆమెను 34 రోజులపాటు ఉపవాస దీక్ష చేయించారు. 2016లో దానికి రెట్టింపు చేసి, 68 రోజులపాటు చేయించారు. అన్ని రోజుల్లో, ఆరాధన గోరువెచ్చని నీళ్లు తప్ప దేనినీ ఆహారంగా తీసుకోలేదు. దాంతో,ఆమె బక్కచిక్కి బలహీనమవుతుంటే, ఆమె "దీక్షకు జేజేలు పలికారే గానీ, ఆమె ఆరోగ్యక్షీణతను ఆ మతస్థులెవరూ పరిగణించలేదు. 68వ రోజున "జైన్ భవన్'కు తీసుకెళ్లి, ఒక రథంలో ఆమెను వూరేగించి "బాలతపస్వి" అంటూ నినదిస్తూ కొనియాడారంతా. మర్నాడే ఆమె స్పృహకోల్పోగా, కిమ్స్ ఆస్పత్రికి తీసుకెళ్తే, అప్పటికే మరణించిందన్న విషయాన్ని వైద్యులు ధ్రువీకరించారు. 2016, అక్టోబర్ 3న ఆరాధన, మతాచారానికి బలయిపోతే, ఆమెను త్యాగమూర్తిగా, పవిత్రురాలిగా కీర్తిస్తూ, ఘనంగా తీసుకెళ్లి ఖననం చేసారు. ఎంత దారుణం? మనమేకాలంలో వున్నాం? వేల ఏళ్లనాటి మతనిబంధనల పాటింపు పేరుతో బాలబాలికల లేత జీవితాలను బలితీసుకోవటం కాదా ఇది? బాలల జీవన

హక్కులకు విఘాతం కాదా? ఇలాంటివి రాజ్యాంగ వ్యతిరేకం కాదా? మత స్వేచ్ఛ అంటే మనుషుల్ని మతాచారాల పేర బలిచేయటం కాదుగదా!" సరిగ్గా ఇలాంటి ఆలోచనతోనే, హైదరాబాద్‌లోని బాలల హక్కుల సంఘం నాయకులు పోలీసుకేసు పెడితే, జైనమతానుయాయులంతా ఒక్కటై తల్లిదండ్రుల పక్షాన నిలిచి, అడ్డుకున్నారు.

ఈ నేపథ్యంలో చాలామందిలో అనేక సందేహాలు తలెత్తుతున్నాయి. ఉపవాసం వల్ల ప్రయోజనమేమిటి? మతాలకీ ఉపవాసాలకీ వున్న సంబంధమేమిటి? అవెందుకు, ఎప్పట్నించి వున్నాయి? ఉపవాసం నిజంగా దేవుని దయకు పాత్రమవుతుందా? ఈ విషయంలో వైద్యం, విజ్ఞానం ఏమంటున్నాయి?

'ఉపవాసం' అనే పదానికి "సమీపంలో వుండటం' అనే అర్థంవుంది. దేనికి సమీపంలో? అంటే, 'దేవునికి' అని చెప్తారు హైందవులు. దీనికే లంఖణం, పస్తు అనే పదాలు కూడా వాడుకలో వున్నాయి. అయితే, లంఖణం అనేది ఆరోగ్య సంబంధితమైనది కాగా, 'పస్తు' అనేది తిండి దొరకని పేదరికాన్ని తెలిపేది. ఉపవాసం మాత్రం ఒక ఆధ్యాత్మిక ఆచారం.

దైవప్రీతికోసం ఆహారాన్ని మానుకొని, ఆధ్యాత్మిక దృష్టితో భక్తితో రోజుల్ని గడపటం అనేది చాలా ప్రాచీనకాలం నుంచి, ప్రపంచవ్యాప్తంగా వున్నట్లు కన్పిస్తుంది. ఈనాడు వునికిలో వున్న ప్రముఖ మతాల పుట్టుకకు పూర్వమే ఇదొక ఆచారంగా వుండి, తర్వాత ఆయా మతాలకు అనుగుణంగా అది మారినట్లు తెలుస్తుంది. అతి ప్రాచీనమైనదిగా చెప్పబడే వైదికమతంలో దీని ఛాయలు కన్పించవు. చాలా అంశాల మాదిరే, ఉపవాసాన్ని దాని ప్రయోజనాలను బౌద్ధం నుంచే హిందూమతం గ్రహించి వుంటుందనే దానికి ఆధారాలు వున్నాయి. బుద్ధుడు తన శిష్యగణానికి, ఒంటిపూట భిక్షా స్వీకరణను నియమంగా పెట్టాడు. రాత్రివేళ ఏ భిక్షువూ ఆహారం తీసుకోరాదన్నాడు. ఈ నియమంలో ఏ ఆధ్యాత్మికతనూ జోడించలేదు. శరారాన్ని ఆరోగ్యంగా, నియమబద్ధంగా వుంచుకోవటానికే అలా చేసాడు. భిక్షువులు బౌద్ధ ఉద్యమకార్యకర్తలు. ప్రజలకు ప్రతిరోజూ చేరువగా వుంటూ బౌద్ధదమ్మ విశిష్టతను ప్రచారం చేయటం వారి ముఖ్యకర్తవ్యం. అలాంటి వారు రోజూ ఉత్సాహంగా, రోగరహితమైన మనస్సుతో, ఉద్వేగాల అదుపులో వుండాలంటే అవసరమైనంత ఆహారాన్నే వారు తీసుకోవాలి. దానివల్ల వారి శ్రమకు తగిన బలం, బతకటానికి కావలసిన పుష్టి లభిస్తేచాలు. బౌద్ధం దృష్టిలో ఈ 'ఉపవాస ప్రక్రియకు అర్థం 'ఆరోగ్యానికి దగ్గరగా వుండటం.

ఈ ప్రక్రియలో వున్న సుగుణాన్ని హైందవ ధర్మస్మృతికర్తలు, సూత్రకారులూ ఆధ్యాత్మికతకు ముడిపెట్టారు. ఉపవాసంవల్ల పాపాలు నశిస్తాయని, దైవకృపకు పాత్రులవుతారని, ఉత్తమలోకాలు ప్రాప్తిస్తాయని కూడా చెప్పారు. పురాణాల్లో ఎన్నోకథలు కల్పించి, వాటిని దృష్టాంతాలుగా చూపించారు. ఏఏ రోజుల్లో ఉపవాసము ఉండాలో, ఏ రీతిలో వుండాలో, ఏం తినవచ్చో, ఏం తినరాదో వివరించారు.

"శివరాత్రి మాహాత్మ్యం' శ్రీనాథమహాకవి రాసినకావ్యం. అందులో సుమారుడనే పాత్ర వుంది. అతడు చేయని అకృత్యాలు, నేరాలు లేవు. అంత దుర్మార్గుడు కూడా శివరాత్రి రోజు తిండి దొరక్క 'పస్తు' వుండి మరణిస్తే కైలాసం లభిస్తుంది. అతని దుర్మార్గ మంతా ఉపవాసం (పస్తు)తో మాఫీ అయి పోయిందన్న మాట! ఉపవాసదీక్షలో వుండి శరీరాన్ని కృశింపచేసి చనిపోతే, అలాంటి వారిని దైవస్వరూపులుగా భావించవచ్చని చెప్పే కథలూ వున్నాయి.




మహాభారతంలోని అనుశాసనికపర్వంలో ఒకచోట, ధర్మరాజు భీష్ముని ఇలా అడుగుతాడు– "అన్ని తపస్సులో ఘనమైనదేది?" అని, నిరాహారంగా వుండే ఉపవాసదీక్షకు మించిన తపస్సు లేదంటాడు భీష్ముడు. ఇందుకు నిదర్శనంగా బ్రహ్మదేవునికీ, భగీరథునికీ మధ్య జరిగిన సంభాషణను కూడా గుర్తుచేస్తాడు. ఉపవాసానికెంత మహత్తువుందో మొదట ఇంద్రునికితప్ప ఎవరికీ తెలిసిందికాదట, ఆ రహస్యాన్ని ఇంద్రుని నుండి సంగ్రహించి లోకానికి వెల్లడించినవాడు ఉశానసుడు. 'నా వుద్దేశంలో ఉపవాసానికి మించిన తపస్సులేదు' అని చెప్పిన భగీరథుడు, దాని ద్వారానే బ్రహ్మలోకాన్ని పొందాడని భీష్ముడు ధర్మరాజుకి బోధించి, "అందరికీ తెలియని ఈ మహాశక్తివంత మైన ఉపవాస దీక్షను పాటించ'మంటాడు. అంతేకాదు ద్వాదశినాడు ఉపవాసముంటే మరీమంచిది" అంటాడు.

హైందవమతంలో రోజుల తరబడి నిరాహారంగా వుండే కఠోర ఉపవాసదీక్షలు ఎక్కువ లేవు. వారానికి ఒకరోజో, రెండురోజులో, ఒక్కపూటో, రెండు పూటలో నిరాహారంగా వుండటం కన్పిస్తుంది. అందుకే, ఉపవాసాన్ని "ఒక్కపొద్దు, ఒక్కపూట'

అని పిలవటం కూడా తెలుగు ప్రాంతాల్లో వుంది. బ్రాహ్మణ, క్షత్రియులయితే వారంలో వరసగా మూడురాత్రులు, వైశ్యశూద్రులయితే ఒక్కరాత్రి ఉపవాసులయితే చాలని, శుక్ల పక్షంలో పంచమ, షష్ఠిదినాల్లో ఉపోసితులయితే సంతాన సాఫల్యత, ధనవృద్ధి జరుగుతాయని భీష్ముడు అంటాడు. కృష్ణపక్షంలో అయితే అష్టమి, చతుర్దశి నాటి ఉపవాసాలు, అన్ని దుఃఖాల నుంచి విముక్తి చేస్తాయంటాడు.

అయితే, వివిధ మతాచార్యులు ప్రతిపాదించిన, ప్రబోధించిన ఆచారాలను బట్టి ఉపవాసదినాలలో చాలా మార్పులు కాలానుగతంగా వచ్చాయి. చాతుర్మాస్య ఉపవాసాలకు శైవ, వైష్ణవ మత శాఖలు ప్రాధాన్యతనిచ్చాయి. ఆషాఢమాసపు 11రోజు (శుద్ధ ఏకాదశి) నుండి కార్తీకమాసపు ఏకాదశి వరకు విష్ణువు, లక్ష్మీదేవితో కలసి పాలసంద్రాన శేషతల్పంపై శయనిస్తాడట. ఆ నాలుగు మాసాలు భక్తులు చాతుర్మాస్యవ్రతం పాటిస్తూ ఏకాదశి ఉపవాసాలు చేస్తే శుభమని చెప్పుకొచ్చారు. కార్తీకమాసం వచ్చిందంటే మహిళా భక్తులు సోమవార ఉపవాసాలుంటారు. శ్రావణ మాసంలో శుక్రవారాలుంటారు. అంతేకాదు, ఒక్కోరోజునా ఒక్కోదేవుడికి కేటాయించి మరీ ఉపవాసాలుంటున్నారు. సోమవారం శివుడు, మంగళ- హనుమంతుడు, బుధ- గణేశుడు, గురు-దత్తాత్రేయుడు, శుక్ర-సంతోషిమాత, శనివారం-శనైశ్చరుడు. పాలు/ పళ్ళు/ తేనీరు/ తేలికైనా ఆహారం తీసుకుంటూ కొందరు, నిరాహారంగా కొందరు వుంటారు. మొత్తానికి, ఉపవాసం అనేది భక్తిలో ఒకభాగంగా, నేటికీ హిందువుల్లో ఎక్కువగానే వుంది.

భారతీయ క్రైస్తవుల్లో ఇపుడు అంత ఎక్కువగా లేదుగానీ, మొత్తంమీద, గతంలో అనేక క్రైస్తవశాఖల్లో ఉపవాసం ఒక ఆచారంగానే వుంది. పలుశాఖలు పలువిధాలుగా దానిని పాటించాయి. రోమన్ కేథలిక్కులు చర్చి ఆదేశానుసారం సంవత్సరంలో చాలారోజులు ఉపవాసాలుండేవారు. దానివల్ల ఆర్థికంగా, ఆరోగ్యపరంగా వస్తున్న ఇబ్బందుల్ని గుర్తించి 1956లో పోపు కొన్ని నియమాల్ని సడలించాడు. 1966లో పోప్ జాన్‌పాల్ మరో అడుగు ముందుకేసి స్థానిక పరిస్థితులను బట్టి, స్వచ్ఛందంగానే ఉపవాసాలు చేయవచ్చునన్నాడు. ఆంగ్లికన్ చర్చ్ నియమాల ప్రకారం-ఈస్టర్ పండుగకు ముందు, 40 రోజులపాటు ఉపవాస దీక్షలు చేయాలి. అలాగే సంవత్సరమంతా, నాలుగు రుతువుల్లోనూ బుధ, శుక్ర, శనివారాల్లో వుండాలి. అలాగే, క్రిస్మస్ రోజు తప్ప, సంవత్సరంలోని అన్ని శుక్రవారాల్లోనూ ఉపవాసముండాలి. ఈస్టర్న్ ఆర్థోడాక్ చర్చి (ఇ.ఓ.సి.) లాంటి సనాతన చర్చిల్లో ఉపవాసాలెక్కువ. ఈస్టర్

కి ముందు 60 రోజులు, క్రిస్మస్ కి ముందు 40 రోజులు, అపోస్తలులైన సెయింట్ పాల్, మాథ్యూల జ్ఞాపకార్థం నవంబర్ 1 నుండి జూన్ 29 వరకు వుండే రోజులు, ఆగస్ట్ 1 నుండి 14 వరకు మేరీ జ్ఞాపకార్థం, భక్తుల ఉపవాసాలుంటాయి. కొందరు పూర్తిగా తిండిమానేస్తే మరికొందరు కొన్ని పదార్థాలనే భుజిస్తారు, మాంసాహారంలాంటి వాటిని దూరంగా వుంచుతారు. మెథడిస్టు చర్చ్, ఓరియంటల్ ఆర్తోడాక్స్ చర్చి, చర్చ్ ఆఫ్ ఈస్ట్ లాంటి శాఖలు కూడా ఉపవాస నియమాలు పెట్టుకున్నాయి, లూథరన్ చర్చిలాంటివి మాత్రం ఇందుకుభిన్నం. ఉపవాసాన్ని ఆధ్యాత్మిక కోణం నుంచి కాక, శారీరక, ఆరోగ్యకోణం నుంచి చూసి, వ్యక్తిగత ఇష్టానికి వదిలేసాయి.

ఇస్లాంలో కూడా ఉపవాసం ఒక ముఖ్యదైవకార్యమే. రంజాన్ నెలలో పగలంతా ఉపవాసముండటం అనేది ఇస్లాం మౌలిక పంచనియమాల్లో ఒకటి. ఆ నెలంతా వారు పగలు దేన్నీ తినరు, తాగరు. కొందరు నిష్టాపరులు ఉమ్మినికూడా మింగరు. అలా చేయటం వల్ల దైవస్పృహ పెరుగుతుందని వారి విశ్వాసం.

ముస్లిం మతశాఖగా ఎంచే బహాయీమతంలో కూడా మార్చి 2 నుండి 20 వరకు 19 రోజులపాటు పగలంతా ఉపవాసముండే ఆచారముంది. 15-70 సంవత్సరాల మధ్య వయసున్న వారు తప్పక దీన్ని పాటించాలి. కాలానుక్రమంలో ఇందులో కొన్ని మినహాయింపులు చోటు చేసుకున్నాయి.

జైనుల్లోనే ఉపవాస నియమాలు ఎక్కువ. 24 గంటల ఉపవాసం, 8 రోజుల ఉపవాసం(అఠాయీ), 10రోజులు (ధశలక్షణ్), నెలరోజులుంటే (మాసక్షమణ).... ఇలా వుంటాయి. కోర్కెలను, భోగలాలసతను, భౌతికవాంఛలను తగ్గించు కోవటం ఉపవాసలక్ష్యం. రోజుల తరబడి ఉపవాసాలతో వుండి, క్షీణించి, కృశించి స్వచ్ఛందంగా మరణించటం జైనుల్లో వుంది. దీన్ని వీరు సంథారా' అంటారు. దీన్ని 'ఆత్మహత్య' అంటే వారు ఒప్పుకోరు. కానీ, 2015లో రాజస్థాన్ లో ఒక మహిళ ఆ దీక్షలో వుండి మరణించటం, దానిపై హక్కుల సంఘాలు సుప్రీంకోర్టునాశ్రయించి, ఆ మతాచారాన్ని నిలిపివేయవలసిందిగా కోరటం తెల్సిందే.

యూదుల్లోనూ, చైనాలోని తావోమతంలోనూ కూడా ఉపవాసాలు వేర్వేరు రీతుల్లో వున్నాయి. యోగవిద్యలోనూ ఉపవాసం ఒక ఆధ్యాత్మిక నియమం.

ఇలా ఇంకా ఎన్నెనా ఉదహరిస్తూ పోవచ్చు. వీటన్నింటిలో వుండే సాధారణ లక్షణం దైవాన్ని ప్రసన్నం చేయటం. ఉపవాసదినాల్లో మనసును దైవంపై ఉంచి,

కీర్తనలతో, భావనలతో, ప్రార్థనలతో, ఇష్టకామ్యసిద్ధికి ప్రయత్నించటం. శరీరశోషణం ద్వారా భౌతికవాంఛలకు దూరమైతే, కర్మవిముక్తి జరుగుతుందని, మోక్షం ప్రాప్తిస్తుందని నమ్మటం. ఇలాంటి ఎండమావుల వెంటబడి ఎందరో తమజీవితాలను ప్రాణాలను అమాయకంగా బలిపెట్టుకున్నారు. అభౌతికమైన దైవం, మోక్షం, పరలోకం మొదలయిన వాటికోసం తపించి, గతించారు.

అయితే, నిరాహారంగా ఉపవసించటంలో ఏ ప్రయోజనమూ లేదా? ఉంది. ఆరోగ్యరీత్యా అది మంచిదే. అయితే దానికి ఒక పద్ధతి, ప్రక్రియ వంటివి ఉన్నాయి. బుద్ధుని తర్వాతే, భారతదేశంలో ఉపవాసం వైద్యంలోకి ప్రవేశించి "లంఖణం పరమౌషధం" అన్న ప్రసిద్ధి సాధించింది. ప్రాచీన వైద్యులయిన జీవకుడు, సుశ్రుతుడు, చరకుడు, లాంటివారు లంఖణాన్ని వైద్యంలో ఒక రోగ నిదాన మార్గం అన్నారు. 'ఉపవాసానికి ఉన్న అర్థాన్ని సైతం నాటి స్మృతులు కొన్ని మార్చివేసాయి.

**"వ్యావృత్తిశ్చైవ దోషేభ్యః యస్తువాగుణైస్సహ**
**ఉపవాసం తమాహుస్తు నశరీరస్య శోషణం" (వ్యాఘ్రస్మృతి)**

దోషాలకు, దుర్గుణాలకు దూరంగావుంటూ సుగుణాలకు దగ్గరవటమే ఉపవాసం తప్ప శరీరాన్ని శుష్కింప చేసుకోవటం కాదు అంది వ్యాఘ్రస్మృతి..

**"భిక్షోపవాస నియమార్కమరీచి దాహైః**
**దేహోపశోషణవిధిః కుధియాం క్వచైష?"**

"ఆహారాన్ని తిరస్కరించి, ఎండలోమాడటం, శరీరాన్ని శుష్కింప చేసుకోవటం బుద్ధితక్కువవారి పని" అంటోంది ప్రబోధ చంద్రోదయం.

ఇలా క్రమక్రమంగా, ఆధ్యాత్మికతకు దూరంగా జరుగుతూ, లంఖణం, ఒక విశిష్టతను సాధించుకొని, ఆధునిక శాస్త్రీయవైద్యం సైతం మెచ్చుకునే స్థితికి వచ్చింది.

16వ శతాబ్ది కాలపు కవిగా చెప్పబడే ప్రజాకవి వేమన ఇలా అన్నాడు

"కూడబెట్టకున్న కుక్షిలో జఠరాగ్ని
భక్షణంబు చేయు కుక్షిమలము
కూడువిడిచి మలము కుడుచురా ఉపవాసి
విశ్వదాభిరామ వినురవేమ"

ఒకవ్యక్తి ఉపవాసంతో ఆహారం తీసుకోవటం మానివేస్తే ఏం జరుగుతుందో తన అభిప్రాయంగా చెప్పాడాయన. దాదాపు దీన్నే వైద్యశాస్త్రం కూడా ధృవీకరిస్తోంది.

## సైన్సు ఏమంటోంది?

ఉపవాసమున్న వారిలో జీవక్రియ, జీర్ణక్రియలు ఎలావుంటాయోనన్నదానిపై 19, 20 శతాబ్దాలలో ప్రయోగాలు జరిగాయి. 1922లో ఇన్సులిన్' గురించి తెలిసింది. అంతకు ముందు వరకు, మధుమేహానికి లంఖణమే పరమౌషధమని వైద్యులు సూచించేవారు. 1960 వరకు ఊబకాయానికీ లంఖణమే మందు. అది సరికాదని, ఆ తర్వాత తెలిసింది.

మనం రోజువారీగా తీసుకునే ఆహారంలో పిండిపదార్థం, మాంసకృత్తులు, కొవ్వులు ముఖ్యంగా వుంటాయి. చక్కెర, తేనె, దుంపలు, రొట్టె, అన్నం మొదలగు వాటిలో పిండిపదార్థాలు ఎక్కువ వుంటే, మాంసం, చేపలు, గుడ్లు మొదలగు వాటిలో మాంసకృత్తులు, నూనె, నెయ్యి, వెన్న మొదలగు కొవ్వులు ఎక్కువగా వుంటాయి. కేకులు, బిస్కెట్లు, వేపిన ఆహారాల్లో పిండి పదార్థాలు, కొవ్వులు అధికం. తిన్నతిండి కడుపులోకి వెళ్ళగానే, పిండిపదార్థం గ్లూకోజ్‌గా, మాంసకృత్తులు ఎమినో యాసిడ్స్‌గా, కొవ్వులు ఫ్యాటీయాసిడ్స్‌గా మారతాయి. గ్లూకోజ్‌లు, ఫ్యాటీ యాసిడ్స్‌లను శరీరం 'శక్తి'గా వినియోగించుకొంటుంది. ఎమినోయాసిడ్స్‌ను కణజాల నిర్మాణానికి, దెబ్బతిన్న వాటిని తిరిగి నిర్మించుకోవటానికి వాడుకుంటుంది. ఇలా ఖర్చుకాగా, మిగిలిన అదనపుశక్తి, భవిష్యత్ అవసరానికి శరీరంలోనే కొవ్వుగా నిల్వచేయబడుతుంది.

మనం ఆహారం తీసుకోగానే, రక్తంలో వుండే గ్లూకోజ్ స్థాయిలు పెరుగుతాయి. దాంతో ఇన్సులిన్' అనే హార్మోన్ విడుదలవుతుంది. అది గ్లూకోజ్‌ను మన కండరాలకు, పనిచేసే అవయవభాగాలకు చేరవేస్తుంది. అక్కడ గ్లూకోజ్ శక్తిగా వినియోగపడుతుంది. అవసరానికి మించివుంటే, గ్లూకోజ్ కండరాల్లోను, కాలేయంలోనూ నిల్వవుండిపోతుంది. దాన్నే గ్లైకోజెన్ అంటాం. కండరాలు, కాలేయంలో కూడా అది పట్టక ఎక్కువైతే, కొవ్వుగా మారి శరీరాన్ని అడ్డంగా పెంచుతుంది. ఇక ఎమినో యాసిడ్స్ అనేవి పెద్దవాళ్లకి చాలా తక్కువ కావాలి. వాటిని ఎక్కువ తీసుకుంటే, శరీరం భవిష్యత్ వినియోగానికి వాటిని ఉంచుకోలేదు. కనుక అధికంగా వున్న వాటిని కాలేయం గ్లూకోజ్‌గా మార్చివేస్తుంది. ఫ్యాటీ యాసిడ్స్ 'శక్తితయారీ'కి పెద్దగా ఉపయోగపడవు. పిండిపదార్థం చాలనపుడే వాటి అవసరం వుంటుంది. కనుక, మనం వాటిని ఎక్కువ తీసుకుంటే కొవ్వుగా వుండి భారాన్ని పెంచుతాయి.

## ఆహారాన్ని తీసుకోవటం ఆపివేసినపుడు ఏం జరుగుతుంది?

మొదటగా జరిగేది-ఇన్సులిన్ హార్మోన్ స్థాయులు పడిపోతాయి. అంటే పేంక్రియాస్ నుండి ఇన్స్యులిన్ విడుదల తగ్గుతుంది. కణజాల నిర్మాణాన్ని పెంచుతూ, కేన్సర్ కి దారితీసే హార్మోనులు కూడా తక్కువగా విడుదలవుతాయి. శరీరం నిల్వవున్న కొవ్వును శక్తిగా తీసుకోవటం మొదలవుతుంది. ఫలితంగా, మన మెదడులోని కణజాలానికి అవసరమైన పదార్థాల వృద్ధి జరుగుతుంది, నాడీవ్యవస్థ పనితీరు మెరుగుపడుతుంది.

ఇన్సులిన్ ఉత్పత్తి ఎంత ఎక్కువ పెరిగితే, శరీరానికి వ్యాధులు అంత ఎక్కువగా దాపురిస్తాయి. ఊబకాయం, మధుమేహం, గుండెజబ్బులు, గుండెపోటు, రక్తపోటు, మూత్రపిండాల వ్యాధులు, గర్భనాళవ్యాధులు, అల్జీమర్స్ లాంటివి దానివల్ల వచ్చేవే. కనుక, లంఖణం, వ్యాయామం- ఈ రెండే ఇన్సులిన్ అధికోత్పత్తిని అడ్డుకోగలవని వైద్యశాస్త్రం చెపుతోంది.

అయితే, ఉపవసించడం మంచిదే కదా! అనే అభిప్రాయానికి వెంటనే వచ్చేయవద్దు. దాని పైనా చాలా పరిశోధనలు జరిగాయి, జరుగుతున్నాయి. డాక్టర్ కిష్టావర్ది, హాల్ బర్గ్, డాక్టర్ మైఖేల్ హార్వే లాంటి వైద్యులు రకరకాలుగా దీనిపై పరిశోధనలు చేసి కొన్ని ముఖ్య విషయాలు తెలిపారు.

1. నిరాహారంగా రోజుల తరబడి వుండటం క్షేమం కాదు. దానివల్ల శరీరంలో హార్మోనుల సమతుల్యత దెబ్బతిని, మృత్యువు చేరువవుతుంది.
2. రోజుమార్చి రోజు, లేదా, వారంలో ఐదురోజులు తిని, రెండు రోజులు మానివేయటం వల్ల శరీరానికి నష్టం తక్కువ.
3. ఆహారం తీసుకోవటానికి 8-12 గంటల వ్యవధి వుంటే మంచిది. మితాహారం అయితే ఆ వ్యవధి తగ్గినా మంచిదే.
4. రోజుకు ఒక్కసారే సుష్టుగా భోజనం చేయటం, మిగతా సమయంలో నీరు తప్ప ఏ ఆహారమూ తీసుకోకపోవటం వల్ల జీర్ణక్రియకు మేలు జరుగుతుంది.
5. ఉపవాస సమయంలో కేలరీలు పెంచే ఏ ఆహారాన్ని తీసుకోవటం తగదు.

ఆధునిక ఉపవాసాలకి ఆరోగ్య పరిరక్షణే లక్ష్యంగా ఉండాలి తప్ప, ఆధ్యాత్మికం కాకూడదు. అలా లేనపుడు, ఏది ఎంత తినాలి, ఎపుడు తినాలి అన్న స్పృహ తగ్గిపోతుంది. ఉపవాసం పేరుతో, అన్నం మాత్రమే మాని, ఇతర ఆహారాలను

తీసుకోవటం, లేదా ఎప్పుడు ఉపవాసం ముగుస్తుందా అని ఎదురు చూసి, అధికంగా తీసుకోవటం ఆరోగ్యాన్ని నిలపవు. **"ఉపోషితస్య వ్యాఘ్రస్యపారణం పశుమారణం"** (ఉపవాసమున్న పులి పశుహననం అధికం చేస్తుంది) అన్నట్లుగా జరగకూడదు.

గాంధీజీ ఉపవాసాన్ని రాజకీయాల్లోకి తెచ్చారు. 'నిరాహారదీక్ష'గా మార్చారు. ప్రస్తుతం స్వప్రయోజనసాధనకోసం ఆ దీక్ష చేపట్టిన వారివల్ల ఒక్కోసారి అది అపహాస్యం పాలవుతుండటం చూస్తున్నాం. దాన్ని నిరవధికంగా చేసి ప్రాణాలు కోల్పోయిన స్వాతంత్ర్య సమరయోధుడు జతిన్ దాస్, బ్రిటీష్ యం.పి. బాబీ శాండ్స్ లాంటి వారున్నారు. ఇలాంటి నిరాహారదీక్ష ఇపుడు శాంతియుత లక్ష్యసాధనామార్గమయింది. ఆధ్యాత్మికతకు దూరమయింది. కాలమింతగా మారిపోతున్నా, ఇంకా పాతకాలపు మతసూత్రాలను నమ్ముతూ ఆధ్యాత్మిక లక్ష్యసిద్ధికోసం, శరీరం ఓపలేని ఉపవాసాలకు పూనుకొని, ప్రాణాలర్పించటం ఏమాత్రం వివేకం కాదు.



## బహుముఖాలుగా విస్తరిస్తున్న

# రుద్రాక్ష వంచన



ఒక కవి గారికి సన్మానం జరుగుతోంది. హైదరాబాద్, నాంపల్లిలో వున్న తెలుగు విశ్వవిద్యాలయం సభావేదిక. ఆ కవిగారితో వున్న పరిచయం వల్ల, ఆహ్వానిస్తే నేనూ వెళ్ళాను. సాయంత్రం 6 గంటలయినా, ఇంకా జనం పోగవలేదు. ఆవరణలో కూర్చున్న నా దగ్గరకు ఒకాయన నన్నే చూస్తూ వచ్చాడు. 'ఎవరై వుంటారా' అనుకుంటూ నేనూ ఆయన్నే చూస్తున్నాను.

'బాగున్నావా?' అన్నాడు. గుర్తుకు రాలేదు. 'మీరూ...' గుర్తుకు తెచ్చుకునేందుకు ప్రయత్నిస్తున్న నా అవస్థని గమనించినట్టున్నాడు. 'నేనయ్యా! కృష్ణమూర్తిని, 25ఏళ్ళు వెనక్కి వెళ్ళి చూడు. నర్సరావుపేటలో లెక్చరర్ని' అన్నాడు.

'ఓహోహో! మీరా? ఎంత మారిపోయారు. అని చేతులు కలిపాను. ముఖం నుంచి మెడవైపుకు దిగిన నా దృష్టికి 'రుద్రాక్షమాలలు' స్పష్టంగా కనిపించాయి. అతని నుదురుపై వున్న తెల్లని సన్నని అడ్డబొట్టు, దానిపైన చిన్న ఎర్రటి గుండ్రటి బొట్టు కూడా చూసాక మరింత ఆశ్చర్యానికి లోనయ్యాను.

'ఏమిటి వేషం?' అన్నాను. నా వుద్దేశం గ్రహించాడు.

'ఏముంది! కాలం తెచ్చిన మార్పు' అన్నాడు నవ్వుతూ.

మరింత ఆశ్చర్యం బాధ కలిగాయి ఆ మాటలకు. 'విప్లవ కమ్యూనిస్టుగా వున్న నీలో ఇంత మార్పా!' అన్నాను.



'అప్పటికది సరి అనిపించింది. ఇప్పుడిది మంచిదనిపిస్తోంది అంతే!' అన్నాడు నా పక్కన కూర్చుంటూ.

ఆశ్చర్యంలో నిండా మునిగివున్న నన్ను చూస్తూ 'నువ్వేం మారలేదు' అన్నాడు.

ఆ తర్వాత ఆయన గురించి నేనడిగిన వాటికి వివరంగా చెప్పాడు కృష్ణమూర్తి.

నాకు తెలిసిన కృష్ణమూర్తి భౌతికవాది. ఒకవైపు కాలేజీలో లెక్చరర్‌గా ఉద్యోగం చేస్తూ విప్లవోద్యమానికి రచయితగా, వక్తగా తన వంతు కృషి చేస్తుండేవాడు. 1985 తర్వాత మతోద్యమాలకు మద్ధతుదారుడై, 1995 తర్వాత భక్తితత్వం వైపు దృష్టి సారించాడట. 2000సం॥లో వ్యాపారాన్ని సైడ్ బిజినెస్‌గా చేసుకుని 'రుద్రాక్షలు' అమ్ముతున్నాడట.

'నువ్వేమిటి, రుద్రాక్షలు అమ్మడమేమిటి?' అన్న నాకు, ఒక అరగంట పాటు రుద్రాక్షలపై లెక్చరిచ్చాడు. అది విన్నాక 'పెక్కు భంగులు వివేక భ్రష్ట సంపాతముల్' అన్న భర్తృహరి మాట నిజమేననిపించింది. వివేచన కోల్పోయినవారి పతనం ఎక్కడితో అగుతుందో చెప్పలేము.

కృష్ణమూర్తి ఒక్కడే కాదు అతీంద్రియ శక్తుల పట్ల ఆకర్షితులై అలౌకిక అనుభవాల కోసం ఆరాటపడే ఎందరో తమ యింగిత జ్ఞానాన్ని విడిచి ఎంతకెంతకు దిగజారుతున్నారో, 'ప్రాచీనత మోజుతో కుహనా విజ్ఞాన ప్రచారాలకులోనై కనీస ఇంగిత జ్ఞానాన్ని కూడా మౌఢ్యానికి ఎలా బలిచేస్తున్నారో చూస్తుంటే చాలా బాధేస్తుంది.

భక్తి తలకెక్కిన తర్వాతే కృష్ణమూర్తి మెడకు రుద్రాక్షలు తగులుకున్నాయి. వాటి గురించి వాళ్లూ, వీళ్లూ చెప్పిన మహత్తులు విన్నాకనే, తానూ వాటిని జనానికి అందించాలని అలాచేస్తే తన స్వార్థం, 'పరమార్థం' నెరవేరతాయని వ్యాపారంలోకి దిగాడు. ఆయన చెప్పిన వివరాలను బట్టి యిప్పుడు అధిక లాభాలు తెచ్చిపెట్టే భక్తి వ్యాపారాల్లో రుద్రాక్షల అమ్మకమే చాలా బాగుందట! ఆ వివరాలను పరిశీలిస్తే నిజమేననిపించింది.

ఒక్క హైదరాబాదులోనే కాదు, రాష్ట్రంలోని ప్రతి పట్టణంలోనూ, జిల్లా కేంద్రాల్లోను ఇప్పుడు రుద్రాక్ష అమ్మకాలు మహాజోరుగా సాగుతున్నాయి. రుద్రాక్ష ఎగ్జిబిషన్‌లు పెట్టి మాలలతో పాటు, వాటి గురించి రాసిన పుస్తకాలను కూడా అమ్ముతూవుంటే, జనం వెర్రిగా కొంటూనే వున్నారు. రుద్రాక్షల గురించి జరిగే ప్రచారానికి తమ బుద్ధిని తాకట్టు పెడుతూనేవున్నారు.

రుద్రాక్షలనెందుకు ధరించాలి? అని వాటిని ధరించేవారినే అడిగి చూడండి. 1. కీడు తొలగటానికి 2. ఆరోగ్యానికి 3. అందానికి- అనే కారణాలు చెపుతాడు. రుద్రాక్షలు ధరిస్తే అందమేమి వస్తుందని ఆ అంశాన్ని విడిచిపెట్టినా, మొదటి రెండూ మాత్రం వాస్తవమని, తమ అనుభవం ప్రకారం చెప్తున్నామని తాము విన్నవీ, తోచినవీ కథలుగా చెబుతారు.

## పేరులోనే తకరారు

రుద్రాక్షలు కీడు తొలగించి శుభం చేకూర్చుతాయన్న విషయం వాటి పేరులోనే వుందట. 'రుద్ర + అక్ష' రుద్రాక్ష కదా! రుద్రుడు అంటే శివుడు, శుభాలు కలిగించే వాడు. 'అక్ష' అంటే కన్ను. శివుని శుభదృష్టి తమపై ప్రసరించితే కీడు తొలగదా! లయకారుడైన శివుని శుభవీక్షణం శరీరానికి అంటి వుంటే, ఏ దుష్టశక్తులూ దగ్గరకి రావు, భూతప్రేత పిశాచ పీడలూ ఏమీ చేయలేవు. అందుకే రుద్రాక్షలు ధరించాలంటారు. "పేరులో తప్ప, నిజానికి శివుని కన్నుకీ, రుద్రాక్ష కాయలకీ సంబంధమేమిటి?" అని ప్రశ్నించామనుకోండి, వెంటనే పురాణ కథల్లోకి లాక్కెళతారు.

మహాశివుడు హిమాలయాల్లో కొన్ని సంవత్సరాల పాటు తపస్సు చేస్తూ వున్నాడట. ఆ సమయంలో త్రిపురాసురుడనే రాక్షసుడు దేవతలను పీడిస్తూ వుంటే, వారు అన్ని కథల్లోలాగే, బ్రహ్మావిష్ణువుల దగ్గరకెళతారు. వారూ తమ అసమర్థతను వెల్లడించి, శివుని ఆశ్రయిస్తే, శివుడు అఘోరాస్త్రాన్ని కల్పించి అసురునిపై విడుస్తాడట! అయితే, తపోముద్ర నుంచి పూర్తి తెలివిలోకి రాకుండానే, అరమోడ్పు కళ్ళతో శివుడు అఘోరాస్త్రాన్ని ప్రయోగించినపుడు ఆ వేడికి కళ్ళలో నీళ్ళూరి, కన్నీళ్ళుగా మారి భూమిపైకి వెళ్ళి జారిపడ్డాయట. అలా పడిన రుద్రుని నాలుగైదు కన్నీటి చుక్కలే రుద్రాక్షలయ్యాయట! రుద్ అనే సంస్కృత ధాతువుకు దుఃఖమనే అర్థముందని, దుఃఖం వల్ల వచ్చేది కన్నీరు కనుక, రుద్రాక్షలంటే కన్నీటి చుక్కలని కూడా అన్వయింపచూస్తారు భక్తులు. కానీ, 'రుద్రాక్ష' పదానికి రుద్రుని కన్నీటికి అర్థం అసలు కుదరదు. ఎలా కుదురుతుందో ఏ పండితుడయినా వివరిస్తే బాగుండును. 'అక్ష' అంటే కన్ను కాదు.

అక్షి అంటే కన్ను. శివుని కన్ను అనే అర్థం రావాలంటే 'రుద్రాక్షి' అని వుండాలి. రుద్రాక్షకు 'శివుని కన్ను' అనే అర్థం బలవంతంగా లాగినా, 'కన్నీరు' అనే అర్థం ఎలా వస్తుంది? 'నీరు' అని అర్థం ఇచ్చే పదం 'రుద్రాక్ష'లో ఎక్కడుంది?

ఇలా గట్టిగా అడిగితే, 'ఫలానా పురాణాల్లో అలా వుంది' అంటారు. ఎక్కడ ఏ పురాణంలో వెదికినా ఆ అర్థం కనపడదు. రుద్రాక్ష పుట్టుకథల్ని, వాటి మహత్తుల్ని వర్ణించి, భక్తుల్ని బెదిరించో, బుజ్జగించో ఆకట్టుకున్న కథనాలు కొన్ని హైందవ గ్రంథాల్లో వున్నాయి.

1. పద్మపురాణం (57వ అధ్యాయం)
2. మంత్ర మహార్ణవం (158 –174 మధ్య వున్న శ్లోకాలు)
3. రుద్రాక్ష జాబాల ఉపనిషత్తు (1వ అధ్యాయం)
4. శివపురాణం (విద్యేశ్వర సంహిత – 25వ అధ్యాయం)
5. దేవీ భాగవతం, 11వ స్కందం (అధ్యాయం : 3–7)

ఇవి గాక, లింగ, బ్రహ్మ వైవర్త పురాణాల్లో, కొన్ని ఆయుర్వేద గ్రంథాల్లో రుద్రాక్ష మహత్తుల గురించి వుంది. ఇలాంటి కల్పనా చతురతకు మన పురాణ కవులు, పండితులు పెట్టింది పేరు.

రుద్రాక్షలు గుండ్రంగా వుండే కాయలు. వాటికి అంత ప్రాధాన్యత ఎందుకు వచ్చింది? వాటిపై గాథలు, కథలు రావడానికి, ఏ పరిస్థితులు దోహదపడి వుంటాయి? అనే ప్రశ్నలు రావడం సహజం. ఈ విషయాల గురించి తెలుసుకుందాం.

## వృక్షశాస్త్రం ప్రకారం.....

భూమ్మీద వుండే జీవకోటిలో వృక్షసంపద ఎక్కువ. వృక్షశాస్త్రవేత్తలు అన్వేషించి, దాదాపు 90% వృక్షాల జాతుల్ని కనుగొని, శాస్త్రీయ నామాల్ని పెట్టి, ఆ చెట్ల గురించి సమాచారాన్ని కూడా రాసి పెట్టారు. అందులో భాగంగా 'రుద్రాక్ష చెట్ల' గురించి చెప్పారు.

'రుద్రాక్ష' అనేది ఒక కాయ. వాటిని కాచే చెట్టు 'ఇలియో కార్పసే' అనే వృక్ష కుటుంబానికి చెందిన 'గానిట్రస్' జాతిది. అంటే, ఆ జాతిని 'ఇలియో కార్పసే గానిట్రస్' అంటారన్నమాట. ఇలియో కార్పసే వృక్ష జాతి కుటుంబంలో 300 రకాలున్నాయి. మనదేశంలో 19 రకాల పెరుగుతున్నాయి. 'ఇలియో' అంటే తైలం అని అర్థం. ఈ

జాతి కాయల నుంచి తైలం ఉత్పత్తి కావడం వల్ల ఆ పేరు వచ్చి వుండవచ్చు. ఇది తూర్పు ఆసియా దేశాల్లో, భారతదేశంలోను పెరుగుతాయి. ముఖ్యంగా, హిమాలయ పర్వత పాద ప్రాంతాల్లో, గంగా మైదాన ప్రాంతంలో ఈ చెట్లు కనిపిస్తాయి. నేపాల్, ఇండోనేషియా, జావా, న్యూగినియా, ఆస్ట్రేలియా, హవాయీ దేశాల్లో విరివిగా ఈ చెట్లు కనిపిస్తాయి. 70% మిగతా దేశాల్లో వున్నాయి.

రుద్రాక్ష చెట్లు 60-120 అడుగుల ఎత్తు వరకు పెరుగుతాయి. అన్ని కాలాల్లోనూ ఆకుపచ్చగా కనిపిస్తాయి. ఆ చెట్టు కాండం 4 అడుగుల వ్యాసంతో వుండి, బలంగా వుంటుంది. విత్తనం నాటిన నాలుగైదు ఏళ్ళలో కాపుకు వస్తాయి. కాపుకు వచ్చేనాటికి వేళ్ళన్నీ బలంగా నేలలోకి చొచ్చుకుపోవడమే కాక, నేలపైన మెలితిరిగి వుండి, 'ఇది ఎంత పురాతన వృక్షమో' అనే భ్రమను కలిగిస్తాయి. చెట్లపై బెరడు తెల్లగా వుంటుంది. కలప కూడా మృదువుగా వుంటుంది. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో ఈ చెట్ల కలపను, విమానాల తయారీలో ప్రొపెల్లర్స్ (గాలిపంకాలు)గా వాడారు. ఈ చెట్టు అందమంతా వాటి కాయల్లోనే వుంది.

రుద్రాక్ష కాయలు నీలిరంగులో వుంటాయి. అందుకే విదేశాల్లో వీటిని 'బ్లూబెర్రీస్' అంటారు. అవి పండుతున్న క్రమంలో వాటి రంగు మారుతూ వస్తుంది. అవి ఎండిపోయాక, ముదురు గోధుమ, ఎరుపు, నలుపు లేదా ఈ రంగుల మిశ్రమంగా కనిపిస్తాయి. వాటినే మనం రుద్రాక్షలంటున్నాం.



కాయలు ఎండేటపుడు, వాటి స్వభావం వల్ల, 'ముఖాలు' ఏర్పడతాయి. ఊరపచ్చడికి వాడే ఉసిరికాయలు మనందరికీ తెలుసు. అవి పచ్చగా వున్నప్పుడు గుండ్రంగా వుండి, వాటిపై నిలువుగా చారలు కనిపిస్తాయి. వాటిని ఊరబెట్టి పచ్చడిగా మార్చినపుడు చారల మధ్యభాగం ఒక్కో ముక్కగా విడిపోతాయి. ఇదంతా ఉసిరికి సహజంగా వచ్చిన లక్షణం. అలాగే, రుద్రాక్ష కాయలు, పండేటప్పుడు వుండే చారలు, అవి ఎండాక, కుంచించుకుపోయి, సన్నని దారులు గల చాలులుగా మారతాయి. ఒక చాలుకి, మరో చాలుకి మధ్య వున్న భాగం 'రుద్రాక్ష ముఖం' అవుతుంది. ఒక రుద్రాక్షకు ఎన్ని ముఖాలు ఏర్పడతాయనేది, అది పెరిగిన ప్రాంతపు వనరులు, వాతావరణం బట్టి వుంటుంది. ఒకప్పుడు 1 నుండి 5 ముఖాల కాయలే జనానికి తెలుసు. తర్వాత 14 ముఖాల వరకు తెలిసాయి. ఇప్పుడు 1-21 ముఖాల కాయలు కూడా వున్నాయి. ఏ కాలానికి ఎన్ని ముఖాలున్న కాయల గురించి తెలిస్తే అన్ని ముఖాల గురించే కవులు పుస్తకాల్లో రాసారు. మనదేశంలో ప్రస్తుతం అరుణాచల్ ప్రదేశ్, బీహార్, మధ్యప్రదేశ్, కొంకణ్ ప్రాంతాల్లో రుద్రాక్ష చెట్లున్నాయి. వాటి కాయలను, గింజలను పరిశీలిస్తే తేడాలు గమనించవచ్చు. ఎండిన కాయల ముఖాలన్నీ పలుముడతలతో వుంటాయి. అలా ముడతలు పడే గుణం మరికొన్ని ఇతర కాయల్లో మనకు కనిపిస్తుంది.

## రుద్రాక్షలకెందుకు ప్రాధాన్యం వచ్చింది?

రుద్రాక్షల గురించి కొన్ని వేల సంవత్సరాల క్రితమే భారతీయులకు తెలుసు. ఎండిన రుద్రాక్ష కాయలను దంచి, ఆ చూర్ణాన్ని ప్రాచీన ఆయుర్వేద వైద్యులు మందుగా వాడారు. వాత, పిత్త, శ్లేష్మ రోగాలకు అది దివ్యౌషధమని చెప్పిన వారున్నారు. అయితే, అది మందుగా కాక, జపమాలలకే ఎక్కువగా ఉపయోగపడుతూ వచ్చింది. ఆధ్యాత్మిక సాధనాల కోసం, అడవుల్లో ఏకాంత ధ్యానాలు, తపస్సులు చేసే మునులు, యోగులు జపమాలలను వినియోగించడం మూడు వేల ఏళ్ళ క్రితం నుంచి వుంది. ఒక మంత్రాన్నో, దేవుని నామాన్నో మనసులో స్మరిస్తూ, ఎన్నిసార్లు స్మరించారో లెక్కించుకోవడానికి జపమాలలు అవసరమయ్యాయి. జపం అంటే పదే పదే స్మరించుకోవడం అని అర్థం. మంత్రాన్ని, దైవనామాన్ని ఎన్ని ఎక్కువ సార్లు జపిస్తే అంత ఎక్కువ పుణ్యం, శక్తి వస్తాయని పూర్వరుషుల నమ్మకం. అలా చేసే జపానికి తగ్గట్టుగా మాలలో రుద్రాక్షల్ని వుంచేవారు. కనీసం 18 అయితే, గరిష్టం 108 వుంటాయి. కొన్ని మాలల్లో 27, 36, 54, 72, 90 కూడా వుంటుంటాయి. ప్రాచీన

ఋషులు చెట్టు బెరడు నుంచి తీసిన సన్నని దారాన్నో, నూలు దారాలనో పేని జపమాల తయారీకి దారంగా వాడేవారు. ఎండు రుద్రాక్ష కాయ మధ్యభాగం లోపల ఆ చివర నుంచి, ఈ చివరికి రంధ్రంగా వుంటుంది గనుక, దారాన్ని దూర్చడం సులువు. (రుద్రాక్ష పిందెలు ఏర్పడేటప్పుడు ఒక సన్నని ఈనె కాయ మధ్యలో నుంచి బయటకు వస్తుంది. కాయ పండి, ఎండాక, ఆ ఈనె ఎండి రాలిపోతుంది. ఎండిన రుద్రాక్షల్లోనుంచి ఈనెను తీసి వాడతారు. అలా మధ్య రంధ్రం కమలాపండ్లలో వలె సహజంగా ఏర్పడుతుందన్నమాట) ఒక కాయలోకి దారం దూర్చాక, కాయ జారిపోకుండా దారాన్ని ముడివేసేవారు. కాయ రంధ్రపు పరిధి కంటే ముడి పెద్దదిగా వుండాలి. మాలలో ఎన్ని రుద్రాక్షలుంచుకోవాలో తెలుసు కనుక, వాటిని 3 లేక 4 భాగాలుగా వుంచేవారు. ఉదాహరణకి ఒక జపమాలలో 27 రుద్రాక్షలు వున్నాయనుకోండి. ఆ మాల తయారుచేసేటపుడు 8 చిన్న రుద్రాక్షల తర్వాత ఒక పెద్ద రుద్రాక్ష కాయను వుంచుతారు. అంటే 3 పెద్ద రుద్రాక్షలు ఆ మాలలో వుంటాయన్నమాట. ఒక వ్యక్తి జపంలో కూర్చున్నపుడు తన కుడిచేతితో జపమాల వుంచి, ఎడమచేతి వేళ్ళపై లెక్కలు వేస్తుంటారు. జపించేటప్పుడు పెద్ద రుద్రాక్ష చేతికి తగలగానే, ఎడమచేతి వేళ్ళ కణుపులపై, ఎడమచేతి బొటనవేలు జరుగుతుందన్నమాట. దాన్ని బట్టి మంత్రాన్ని ఎన్నిసార్లు జపించారో తెలుస్తుంది. ఎంతకాలం జపిస్తే తమ జపం పూర్తవుతుందో కూడా జపించే వారికి గ్రహింపు వుంటుంది. ఇంతటి సౌకర్యాన్ని కల్పిస్తున్నాయి కనుక, అవి జపమాలగా మారాయి. వాటి ముడతలు కూడా మాలను జరపడానికి వేళ్ళకి సౌకర్యంగా వుంటాయి. గనుక, మరే కాయకు లేని ప్రాధాన్యత కూడా రుద్రాక్షలకు వచ్చింది.

ఒక్క జపమాలగానే కాక, కాలక్రమంలో శరీరంపై ధరించడానికి కూడా వీలుగా రుద్రాక్షలు పనికివచ్చాయి. అవి చేతి మణికట్టు, భుజం, మెడ, జుట్టుముడి, చెవి, పొట్ట, మొదలైన అవయవాల వద్ద ఆభరణాలుగా, చివరికి యజ్ఞోపవీతంగా కూడా మారాయి. వాటి వినియోగం పెరుగుతూ వస్తున్న కొద్దీ, వాటి మహత్తులూ, పవిత్రతలను వర్ణించే కథలు, పురాణాలు కూడా పెరుగుతూ వచ్చాయి. రుద్రాక్షలు మహిమాన్వితాలయ్యాయి. అవి ధరించిన వారు 'పవిత్రులు, పుణ్యాత్ములు మహాశక్తిమంతులు' అనే భావనను ఆస్తికులు అమాయక పామర జనంలో కల్గించగలిగారు. అలాంటి వారిని చూడగానే, భయభక్తులతో నమస్కరించాలన్న బానిస బుద్ధిని పెంచారు.

క్రమంగా శివభక్తులు అతిపవిత్ర చిహ్నాలుగా ఎంచే విభూతి, త్రిశూలాల సరసన రుద్రాక్షలు కూడా చేరాయి. దైవారాధన మొత్తం శైవ, వైష్ణవాలుగా విడిపోయిన కాలంలో, రుద్రాక్షలు శైవానికి పరిమితం కాగా, వైష్ణవానికి తులసి మొక్క దిక్కయింది.

రుద్రాక్షల మహత్తును కీర్తించడం రుద్రారాధన పెంపుకు అవసరమయింది. రుద్రాక్షధారి శివునితో సమానం అన్న శ్లోకాలు పుట్టాయి. "రుద్రాక్ష ధారణాత్ రుద్రోభవత్యేవ న సంశయః" (శివపురాణం). రుద్రాక్ష ధారణ వల్లనే శివుడు కూడా రుద్రుడయ్యాడని శివపురాణ కవి బరితెగించి రాయగలిగాడు. క్రీ.పూ. కాలంలో 5 ముఖాలున్న రుద్రాక్షలు విరివిగా లభించేవి. వాటిని శివునికి కలిపారు. ప్రతి రుద్రాక్షకు పవిత్రతను, విశిష్టతను ఆపాదించారు. ఉదాహరణకి –

1. ఏక ముఖ రుద్రాక్ష : ఇది శివుని ప్రతిరూపం. దీన్ని ధరిస్తే వ్యక్తి వికాసం, జ్ఞానవృద్ధి, సంపద లభిస్తాయి.
2. ద్విముఖి : అర్ధనారీశ్వర ప్రతిరూపం. దీన్ని ధరిస్తే చెడు కోర్కెలు నశించి, ఏకాగ్రత, మనశ్శాంతి పెరుగుతాయి.
3. త్రిముఖి : ఇది సరస్వతి స్వరూపం. మృత్యుభయం రానివ్వదు. విద్యార్థులకుపయోగం. సర్వరోగ రక్షణ.

...... ఇలా 21 ముఖాలున్న రుద్రాక్షల వరకు, ప్రతి దానికి ఏవో దేవతల స్వరూపాలంటూ పేర్లు పెట్టి, వాటి వల్ల ఏవేవో ప్రయోజనాలంటూ జనాన్ని మభ్యపెట్టి, వంచించడం రుద్రాక్ష ప్రచారంలో ఒక ప్రధానాంశం. వాటికి లోబడి, ఎవరైనా రుద్రాక్షలు కొని ధరించాలని చూస్తే, మళ్ళీ అక్కడా కొన్ని పితలాటకాలు. ధరించబోయే ముందు, ఆ రుద్రాక్షలకు పూజలు, వ్రతాలు చేయాలి. మంత్రాలు వల్లించాలి. ఇందులో మళ్ళీ జ్యోతిష్యం కూడా దూరుతుంది. ఏ గ్రహబలం కలవారికి, ఏ రుద్రాక్షలు పనిచేస్తాయో చెప్పే జాబితా తయారైంది.

| వ.నెం. | రుద్రాక్ష పేరు | గ్రహాధిపతి | ఆరోగ్య ప్రయోజనం |
|---|---|---|---|
| 1. | ఏకముఖి | సూర్యుడు | బి.పి., గుండెజబ్బులు తగ్గుతాయి. |
| 2. | ద్విముఖి | చంద్రుడు | చిత్త, ఏకాగ్రత, మానసిక శాంతి, కుండలనీ జాగృతి |
| 3. | త్రిముఖి | శుక్రుడు | విద్యాలాభం, ఆత్మన్యూనత, కంటిరోగాలు మాయం |

| | | | |
|---|---|---|---|
| 4. | చతుర్ముఖి | బుధుడు | వశీకరణ, గొంతులో తియ్యదనం, తేజస్సు గల కళ్ళు, జ్ఞానవిద్య |
| 5. | పంచముఖి | గురుడు | విషజంతు భయమణుగుట, పంచేంద్రియాల అదుపు, అకాల మరణం రాదు |
| 6. | షణ్ముఖి | అంగారకుడు | మంచి వక్తలవుతారు, స్త్రీల రోగాలు మాయం, హిస్టీరియా, మూర్ఛ తగ్గుతాయి. |
| 7. | సప్తముఖి | శని | ..... |
| 8. | అష్టముఖి | రాహువు | పక్షవాతం నివారణ, విద్యలో రాణింపు, శివుడు స్వయంగా కైలాసానికి తీసుకెళతాడు |
| 9. | నవముఖి | కేతువు | గుండెజబ్బులు రావు |
| 10. | దశముఖి | (లేదు) | భూతప్రేత పిశాచ బాధలు రావు, వాస్తుదోషాలు రావు, కోర్టుల్లో విజయం |
| 11. | ఏకాదశముఖి | లేదు | సంతానప్రాప్తి, స్త్రీలకు సిరిసంపదలు |
| 12. | ద్వాదశముఖి | లేదు | ఆరోగ్యాభివృద్ధి, పచ్చకామెర్లు తగ్గుతాయి. దొంగల, అగ్నిభయం వుండదు, దరిద్రం రాదు |
| 13. | త్రయోదశముఖి | శుక్రుడు | ఇంద్రియ భోగాలు, సంతానప్రాప్తి, విలాస జీవితం |
| 14. | చతుర్దశముఖి | శివుని నేత్రం | సర్వాభివృద్ధి, నాడీమండల వ్యాధుల నివారణ, రక్తపోటు అదుపు |

. వాటిని ధరించే ముందు, రుద్రాక్షలను వాస్తుప్రకారం ఏ మూలన వుంచి పూజించాలో కూడా చెప్పారు. ఇంటి వాస్తు దోషాల నివారణకు ఎలాంటి రుద్రాక్షలు వాడాలో కూడ ఇప్పుడు టివిల్లో ప్రచారం చేస్తున్నారు. ఇవన్నీ ఎవరు చెబుతారు? 'రుద్రాక్ష పురోహితులు'. జనంలోని అజ్ఞానం వారికి గొప్ప నిధి. ఎన్ని అబద్ధాలు చెప్పినా, ఎంత వంచనకు పాల్పడినా జనం వాస్తవాల్ని గ్రహించకుండా, తమ వ్యాపారం నష్టపోకుండా వుండడానికి ఆ 'నిధి' వారికి పెన్నిధిగా మారింది.

## వంచనా వ్యాపారం

రుద్రాక్ష వ్యాపారంలో చాలా మోసాలున్నాయి. ఏ కాయలైనా వాటి జీవకణాల్లో వుండే 'జీన్స్' ఏర్పాటు వల్ల కవలలుగా మారడం మనకు తెలుసు. అలా ఏర్పడిన కవల రుద్రాక్షలను 'గౌరీశంకరు'లంటారు. మూడు కాయలు అతికి వుంటే త్రిమూర్తులంటారు. వాటిని ధరిస్తే క్రమంగా రెట్టింపు, మూడు రెట్ల ఫలితాలుంటాయని చెప్పి అధిక ధరలకు అమ్ముతూ, రెట్టింపు లాభాలు గడిస్తారు. ఏకముఖి రుద్రాక్షలు చాలా అరుదుగా దొరుకుతాయి, ఖరీదెక్కువ అని చెప్తారు. నిజానికి, ఒక చెట్టుకు మూడు 'ఏకముఖి'లు కాస్తాయని, వాటిలో ఒకటి స్వర్గానికి, మరొకటి పాతాళానికి పోతాయని, మూడోది మాత్రమే చెట్టున వుండి, ఎవరో పుణ్యాత్ములకు చేరుతుందని నమ్మింపచూస్తారు. నేపాల్‌లోని పశుపతినాథ దేవాలయంలో రెండే రెండు 'ఏకముఖి'లు వున్నాయని, ఉత్సవాల్లో ఒకదానిని ప్రదర్శించి, రెండోదాన్ని దాచివుంచుతారని చెప్పి, దాని మహత్తును కీర్తిస్తారు. దాంతో ధనికులైన భక్తులు తమకు అలాంటిది కావాలంటూ వేలాది రూపాయిలు వెదజల్లుతారు. రుద్రాక్ష వ్యాపారంలో ఇలాంటి దగాలు ఎన్నో ఎన్నెన్నో...........

శివుడు భూతనాధుడట! పంచభూతాలకు ఆధిపతి కావడం వల్ల 'పంచముఖి' రుద్రాక్షలు ధరిస్తే ఆ పంచభూతాల వల్ల కలిగే ఉపద్రవాలు దరికిరావని చెబుతారు. దయ్యాలు, ప్రేతాత్మలు దూరంగా వుంటాయట. చదువులో బాగా రాణించాలన్నా, ఎంసెట్ ర్యాంకు రావాలన్నా, క్రీడల్లో పతకాలు గెలవాలన్నా, పెళ్లి కుదరాలన్నా, పిచ్చి పోవాలన్నా, విరోధులు నశించాలన్నా, కోర్టు కేసులు గెలవాలన్నా, పిల్లలు పుట్టాలన్నా, పుట్టిన పిల్లలు బతకాలన్నా, మగపిల్లలు మాత్రమే పుట్టాలన్నా, ధనం, ధాన్యంలాంటి అష్టలక్ష్ములు ఇంట తాండవించాలన్నా, మంచి భర్త / భార్య దొరకాలన్నా... ఇలా ఒకటేమిటి, మీ సమస్య ఏదైనా సరే అందుకు పరిష్కారం కేవలం ఒక్క ఎండు రుద్రాక్ష కాయలో మాత్రమే వుందట! సమస్యలన్నింటికీ రుద్రాక్షే పరిష్కారం! ఇదెంతటి తప్పుడు ప్రచారమో మీకర్థం కావడం లేదా?

## ఆరోగ్యానికీ అదే రక్ష!

ఇప్పటి వరకు కీడు తొలగించి, శుభాన్ని కలిగించేందుకు 'రుద్రాక్షలే ఏకైక రక్ష' అనే ప్రచారం ఎలా సాగుతుందో చూసాం. ఇక రెండో రకమైన ప్రచారం – 'రుద్రాక్షలు ధరిస్తే అన్ని రోగాలు నశించి ఆరోగ్యం చేకూరుతుంది' అనేది.

పూర్వం మునులు రుద్రాక్షలు ధరించడం వల్ల సంపూర్ణ ఆరోగ్యవంతులై ఎక్కువ కాలం బ్రతికేవారని, వాటితో జపం చేయడం వల్లనే మునుల మాటలకు దివ్యశక్తి లభించి, వారి మాటలే మంత్రాలుగా, వారి కోపాలే శాపాలుగా అయ్యేవని కూడా చెబుతుంటారు.

ఎన్ని ముఖాల రుద్రాక్షలు వాడితే ఏ రోగం తగ్గుతుందో చెప్పడానికి పెద్ద జాబితానే ప్రకటించారు కొత్తగా వచ్చే హెచ్.ఐ.వి లాంటి వాటినీ అందులో ఎప్పటికప్పుడు ఇరికిస్తుంటారు. 'సర్వరోగ నివారిణి'గా రుద్రాక్షను నిలపడమే వారి ధ్యేయం.

"సరే, అవన్నీ కాదు. ఇప్పుడు రుద్రాక్షలు ధరిస్తే, అవి మా ఆరోగ్యాన్ని ఎలా కాపాడుతాయి? అంత శక్తి వాటికి ఎక్కణ్నించి వస్తుంది?" అని ఎవరైనా ప్రశ్నిస్తే ఎలా? సామాన్యంగా ఇలాంటి హేతువాద ప్రశ్నలు చదువరుల నుంచే వస్తాయి గనుక, వారికి జవాబివ్వడానికి సైన్సు పరిభాషను ఆశ్రయిస్తారు రుద్రాక్ష 'ప్రచారకులు'. ఆధునిక విజ్ఞానానికి తమ పైత్యాన్ని జోడించి, కల్పనా చాతుర్యంతో వంచనకు ఒడిగడతారు. ముందుగా వారేం చెబుతారో చూద్దాం –

## అందమైన అబద్ధాలు

**1. రుద్రాక్షలకు విద్యుదావేశ తత్వం వుంది. దానితోనే అవి శారీరక, మానసిక రోగాలను అద్భుతంగా తగ్గించి వేస్తాయి.**

ప్రతి మనిషిలో నాడీ వ్యవస్థ వుంది. దానివల్ల జీవవిద్యుత్ పుడుతుంది. గుండె చలనం, కండరాల కదలిక మొదలయిన శారీరక ప్రక్రియల కారణంగా జీవవిద్యుత్ పుట్టి శరీర ధారణకు తోడ్పడుతుంది. జీవ విద్యుత్ ఉత్పత్తి పెరిగినపుడు లేదా తరిగినపుడు శరీరం రోగగ్రస్తమవుతుంది. ఈ పరిస్థితిని రుద్రాక్షలు సరిచేస్తాయి. ప్రతీ రుద్రాక్ష ఒక విద్యుత్ 'కెపాసిటర్' లాంటిది. అది విద్యుత్‌ను కొంతమేరకు నిల్వ చేయగలదు. అవసరమైనపుడు విడుదల చేయగలదు.

ఆధునిక జీవితం మనిషిని ఒత్తిడికి లోనుచేస్తున్నది. దాంతో నిద్రలేమి, మద్యప్రీతి, మాంద్యం, చిరాకు, గుండెపోట్లు, చర్మవ్యాధులు, మూర్ఛలు, వంధ్యత్వం, నపుంసకత్వం మొదలైన రోగాలు పెరుగుతున్నాయి. ఇలాంటి అనారోగ్యాలను రుద్రాక్షలు సరిచేస్తాయి.

వేరు వేరు సంఖ్యల్లో వుండే రుద్రాక్ష ముఖాలు వేరు వేరు జబ్బులకు పనిచేస్తాయి. నాడీమండలంలో న్యూరాన్‌ల ప్రవాహాన్ని సరిచేస్తూ, మెదడులోని ఆలోచనా తరంగాల్ని

నియంత్రిస్తూ, మనస్సుకీ, శరీరానికి మధ్య సమతుల్యస్థితిని ఏర్పర్చుతాయి. ఆ విధంగా నరాలతో సంబంధం వున్న, మానసిక వ్యాధులన్నీ తక్కువ కాలంలోనే మటుమాయ మవుతాయి.

**2. రుద్రాక్షలకు అయస్కాంతతత్వం వుంది. కనుక, రక్తప్రసరణ లోపాలను సరిచేసి ఆరోగ్యాన్ని చక్కగా వుంచుతాయి.**

రుద్రాక్షలో ప్రతి ముఖానికి అయస్కాంత లక్షణం వుంది. అయస్కాంతానికి ఉత్తర, దక్షిణ ధృవాలుండి సానుకూల (పాజిటివ్ +) అననుకూల (నెగెటివ్ –) శక్తుల కేంద్రాలయినట్లే, రుద్రాక్షలోని ముఖాలు పనిచేస్తాయి. ముఖంపై చివరి నుంచి సానుకూల శక్తి, క్రింద చివరి నుంచి అననుకూల శక్తి విడుదలవుతుంది. ఈ రెండు శక్తులు రక్త ప్రసార వ్యవస్థను నియంత్రిస్తాయి. మన శరీరంలోని రక్తంలో 'ఇనుము' వుంటుందని అందరికీ తెలిసిందే. ధమనుల ద్వారా శుభ్రపడిన రక్తం, సిరల ద్వారా మలిన రక్తం శరీరమంతటా పారుతూ వుంటుంది. ఏ రోగం వచ్చినా, రక్తానికి సంబంధం లేకుండా వుండదు. అందుకే 'అయస్కాంత వైద్యులు' వివిధ అయస్కాంతాల నుపయోగించి, వాటిని శరీరంలో రోగమున్నచోట తిప్పుతూ రోగాన్ని సరిచేయగల్గుతారు. రుద్రాక్షలు బహుళ అయస్కాంతాలు. 'పంచముఖి' రుద్రాక్ష అయిదు అయస్కాంతాలకు సమానం. వాటి నుండి విడుదలయ్యే అయస్కాంత శక్తి వర్తులాకారంలో తరంగాలుగా విస్తరిస్తూ శరీరమంతటా పాకుతుంది. రుద్రాక్షలు ఎప్పుడూ ధరించబడే వుంటాయి కనుక, ఆ తరంగాలు నిరంతరాయంగా విస్తరిస్తూ వుండి రోగనివారణ, చాలా వేగంగా, సజావుగా జరుగుతుంది. పక్షవాతం, జీర్ణకోశవ్యాధులు, రక్తపోటు, శ్వాసకోశవ్యాధులు, జ్ఞానేంద్రియాలకు కలిగే వ్యాధులు, రక్తంలో గడ్డలు, స్త్రీల గర్భకోశవ్యాధులు మొదలైనవన్నీ తగ్గిపోతాయి.

**3. రుద్రాక్షలు ముదిమి లక్షణాలను నిరోధిస్తాయి. అదనపు జీవితాన్ని, మేధస్సును కల్గిస్తాయి.**

### తెలివైన మోసం అంటే ఇదే!

రుద్రాక్షల మహత్తును ప్రచారం చేసేవారు ఇటీవల విస్తృతంగా చేస్తున్న వాదనలివే. 'ఆరోగ్యం' మనిషి జీవితంలో అతి విలువైనది. అందుకే రుద్రాక్షలను దాంతో ముడిపెట్టి తమ దగాకోరు వ్యాపారాన్ని ఇబ్బడిముబ్బడిగా చేసుకోగల్గుతున్నారు. అవెలా తప్పుడు వాదాలో ఇప్పుడే చూద్దాం.

**1. రుద్రాక్షలకు విద్యుదయస్కాంత శక్తి వుందనడం నిజం కాదు. ఏ ప్రయోగాలూ ఆ అంశాన్ని రుజువు చేయలేదు.**

జీవులన్నింటిలోనూ జీవ విద్యుత్తు (బయో ఎలక్ట్రిసిటి) వున్న మాట నిజం. ఆ విషయాన్ని సైన్సు ఎప్పుడో నిరూపించింది. జీవ రసాయనాల శక్తే విద్యుత్‌గా మారుతుంది. జీవులు సాగించే జీవన ప్రకియల వల్ల విద్యుత్తు కణాలు పుట్టి, జీర్ణక్రియ, నాడీ స్పందన, కండర చలన నియంత్రణలకు వినియోగపడుతుంటాయి. ఆ విద్యుత్తు 1 నుండి కొన్ని వందల మిల్లీ ఓల్టుల తేడాతో ఆయా జీవుల్లో వుంటుంది. అయితే మామూలుగా మన ఇళ్ళల్లో వాడే విద్యుత్తు, జీవ విద్యుత్తు ఒకటి కావు. మామూలు విద్యుత్తు ఎలక్ట్రానుల ప్రవాహం. జీవ విద్యుత్తు అయానుల ప్రవాహం. అయానులు విద్యుత్తుతో నిండివున్న అతి సూక్ష్మ కణాలు.

18వ శతాబ్దం దాకా ఈ జీవ విద్యుత్తు గురించి సైన్సుకు తెలియదు. మెదడులోని నాడీస్పందనలన్నీ ఒక రకమైన 'జైవిక ద్రవం' (బయో ఫ్లూయిడ్) ద్వారా జరుగుతుంటాయని శాస్త్రవేత్తలనుకునేవారు. మొదటగా, లూయిగీ గాల్వనీ, అలెస్సాండ్రో వోల్టా అనే ఇద్దరు ఇటలీ భౌతిక శాస్త్రవేత్తలు, నరాల స్పందనలకు జీవ విద్యుత్తే కారణమని కనుగొన్నారు. 19వ శతాబ్ధిలో బోయిస్, రేమండ్ అనే మరో ఇద్దరు శాస్త్రవేత్తలు ఆ విద్యుత్తును కొలిచే సాధనాలను కూడా తయారు చేసారు. ఆ ఇద్దరి శిష్యుడైన జూలియస్ బెర్న్‌స్టీన్ (జర్మనీ), కండరాల్లో వుండే నాడీకణాల్లో బయటవైపు సానుకూల అయానులు (+), లోపల అననుకూల అయానులు (–) వుంటాయని ప్రతిపాదించాడు. 20 శతాబ్ధి తొలిభాగంలో బ్రిటీష్ శాస్త్రవేత్తలు నరాలకు, కండరాలకు మధ్య జరిగే సమాచార బదిలీకి తోడ్పడే రసాయనాల గుట్టు బైటకి లాగారు. అవి సోడియం, పోటాసియం, కాల్షియం క్లోరైడ్ రసాయనాలు. అయానులు కణచర్మంలో వుండే సూక్ష్మరంధ్రాల (Porus) గుండా అటూ ఇటూ ప్రయాణిస్తుంటాయని, సోడియం అయాన్‌లు కణచర్మం బయటనే వుండిపోగా, పోటాషియం అయాన్‌లు కణచర్మానికి బయట తక్కువగా, లోపల ఎక్కువగా ఉంటాయని, క్లోరైడ్ అయాన్‌లు చర్మం బయట ఎక్కువగా లోపల తక్కువగా వుండిపోతాయని వారు కనుగొన్నారు. ఇలా అయాన్‌ల నిల్వలో వుండే తేడాల వల్లనే కణచర్మం లోపల జీవ విద్యుత్తు తక్కువై బయట ఎక్కువగా వుంటుందని వారన్నారు. సోడియం, పోటాసియం, కాల్షియంలు సానుకూల (+) విద్యుత్ బలం. క్లోరైడ్ ఒక్కటే అననుకూల విద్యుత్‌బలం. ఇలా అయానుల విద్యుత్‌తో నిండి కణంలో నిరంతర చలనంలో వుండడం వల్ల జీవ విద్యుత్తు ఏర్పడుతున్నది. ఇలాంటి జీవవిద్యుత్తును నాడీ స్పందనలను రుద్రాక్షలు నియంత్రిస్తాయనటం అసత్యం.

ఎందుకంటే రుద్రాక్షలు కేవలం ఎండిన కాయలు మాత్రమే. అవి 'కెపాసిటర్' లేదా 'స్టెబిలైజర్'లా విద్యుత్తును నియంత్రిస్తాయనో, నిల్వ చేస్తాయనో వాతావరణంలో విద్యుత్తును ఆకర్షించి శరీరానికి అందిస్తాయనో చెప్పేందుకు ఎటువంటి రుజువులూ లేవు.

రుద్రాక్షలు ఔషధంగా పనికోస్తాయా అనే అంశంపై కొంతమంది ఆయుర్వేద నిపుణులు పరిశోధనలు జరిపారు. కోల్‌కతాలో జరిపిన పరిశోధనల్లో రుద్రాక్ష చూర్ణంలో కొన్ని ఔషధ గుణాలు మాత్రం వున్నాయన్నారు. అలాగే కేరళలోని 'ఆయుర్వేద కేంద్రీయ పరిశోధనా సంస్థ' వారు రుద్రాక్షలు పచ్చిగా వున్నపుడు వుండే 'బ్లూబెర్రీస్'లో కొన్ని ఆమ్లాలున్నాయని, అవి, తలలోని రోగాలకు, మూర్ఛలకు ఔషధంగా పనికొస్తాయని అన్నారు. ముంబై, బెనారస్ విశ్వవిద్యాలయాల్లో జరిగిన పరిశోధనలు కూడా ఇలాంటి ఫలితాల్నే ప్రకటించాయి. ఏ ఒక్కరూ రుద్రాక్షల్లో విద్యుత్ శక్తి వుందని చెప్పలేదు. వాటిని ధరిస్తే రోగాలు పోతాయని కూడా చెప్పలేదు. పైన చెప్పిన పరిశోధనలేవి శాస్త్రీయ పరిశోధనా సంస్థల ధృవీకరణ పొందలేదు. పోతే, వారు చెప్పిన ఔషధ గుణాల వంటివి ప్రతీ కాయలోనూ, మొక్కలోనూ, చెట్టులోనూ ఏవో కొన్ని తప్పక వుంటాయి. ఉసిరి, కుంకుడు కాయలలోనూ ఆమ్లాలు, ఔషధ గుణాలు ఉన్నాయి. వాటిని మాలలుగా కట్టుకుని తిరగరేం?

ఆధునిక శాస్త్ర పరిభాషను అన్వయించి రుద్రాక్షలకు లేని ఔషధ శక్తిని ఆపాదించాలనుకునేవారు ముందుకు వచ్చి, వాటిలో విద్యుత్ ఎలా వుందో నిరూపించితే బాగుంటుంది కదా! జీవము లేని ఆ ఎండుకాయలకు జీవ విద్యుత్‌కు సంబంధమేమిటో వారు చెప్పాలి.

**2. రుద్రాక్షలకు అయస్కాంత గుణం వుందనడం రుజువు కాలేదు.**

అది రక్తప్రసరణ వ్యవస్థను నియంత్రణలో వుంచలేదు. అయస్కాంతానికి వుండే సానుకూల (+), అననుకూల(-) శక్తులు రుద్రాక్షలో వుండే ముఖాలకు వుంటాయని చెప్పడం జనాన్ని తెలివిగా మోసగించాలనుకోవడమే. వారి వాదానికి ఏ రుజువూ, ఆధారమూ లేవు. అందుకే వారు అయస్కాంత వైద్యం (మేగ్నటిక్ థెరపీ)ని ఆసరాగా తెచ్చుకున్నారు. అదెంత మోసమో, ఇదీ అంతే మోసం.

మన శరీరంలోని రక్తంలో 'ఇనుము' పరిమాణం చాలా చాలా తక్కువ, ఒక కణం రక్తంలో వుండే ఇతర పదార్థాలు 95% వుంటే ఇనుము 5% వుంటుంది. పైగా అయస్కాంతానికి ఆకర్షితమయ్యే గుణం దీనికి లేదు.

రక్తంలోని ఇనుమును అయస్కాంతం ఆకర్షించగలిగినట్లయితే, ఆకుకూరల్లోని ఇనుమును ఐరన్ టాబ్లెట్లలోని ఇనుమును కూడా అది ఆకర్షించగల్గాలి. అలా జరుగుతుందా?

కనుక అయస్కాంతాలు చేతిలో పట్టుకొని శరీరం మీద తిప్పుతూ, రోగాలు తగ్గిస్తామని చెప్పేది బూటకపు వైద్యం. అయస్కాంత చెప్పులు, అయస్కాంత పరుపులు, అయస్కాంత లాకెట్లు... ఇంకా అనేకరకాల వస్తు సముదాయాన్ని తయారు చేసి అమ్ముకోవడమే ఆ ప్రచారంలోని పరమార్థం. అదే వైద్యాన్ని రుద్రాక్షలకు ఆపాదించడం ద్వారా ఈ రుద్రాక్ష వైద్యులు కూడా అదే మోసానికి పాల్పడిన వారవుతున్నారు. అవి నిరంతరం విద్యుదయస్కాంత తరంగాలను విడుదల చేస్తుంటాయని చెప్తున్నారు. కదా! భౌతిక శాస్త్ర పరిశోధనా సంస్థల్లో అలాంటి తరంగాలను కొలిచే సాధనాలు ఇప్పటికే వున్నాయి. ఈ రుద్రాక్ష వైద్య వంచకులు వెళ్లి ఒకసారి పరీక్షింపచేసి, ఫలితాలను వెల్లడించమని అడగండి. వారి బండారం బయటపడుతుంది.

**3. రుద్రాక్షలు ముసలితనాన్ని తొందరగా రాకుండా నిరోధించి అదనపు జీవిత కాలాన్ని అందిస్తాయనడం, మేథోశక్తిని పెంచుతాయనడం వంచనా వ్యాపార ప్రచారమే.**

వయసు మీద పడుతుంటే, శరీరంలో పెనుమార్పులు వస్తూ వుంటే, రోగాలు ముసురుతాయని, చావుకు దగ్గరవుతామని భయపడేవారు ఎక్కువమందే వుంటారు. అలాంటి వార్ని ఈ 'జరాదుఃఖం' నుంచి ఊరడించడానికి పలు సౌందర్య చిహ్నాలు, లేపనాలు, ఔషధాలు పుట్టుకొస్తున్నాయి. 'మేమేం తక్కువ' అంటూ రుద్రాక్ష వైద్యులు అదే పల్లవి అందుకున్నారు. జీవకణాల్లో విచ్ఛిన్నత ఎక్కువవుతున్న కారణంగా దాపురించే ముడతల చర్మాన్ని, దృష్టిహీనత, దంతక్షయత, నరాల బలహీనత మొదలైన వాటిని రుద్రాక్ష ధారణ అరికడుతుందని, పైగా అపుడు దాపురించే మతిమరుపును లేకుండా చేసి జ్ఞాపకశక్తిని పెంచుతుందని వారు నమ్మబలుకుతున్నారు. కానీ ఇవేవీ నిజం కావు.

రుద్రాక్షలు ధరించిన వారెవరికి ముసలితనం, మతిమరుపు రాలేదో వారు చూపగలరా? ఆయువు పెరుగుదలను ఏ ఆధారాలతో రుజువు చేయగలరు? అవయవాల శిధిలతను ఆపగలశక్తి రుద్రాక్షల్లో వుందని ఏ ప్రయోగాలు నిరూపించాయి?

'జరాభయం'తో సతమతమయ్యే అమాయక ప్రజల్ని నిర్దయగా దోచుకోవడానికే ఈ ప్రచారం తప్ప వేరు కాదు.

## వంచనను గుర్తించండి!

రుద్రాక్షల పేర జరిగే దోపిడీ ఆర్థిక, మానసిక పరమైనదే కాదు, నైతికతకు సంబంధించింది కూడా. 0.25 సెం.మీ నుండి 2 సెం.మీ వరకు వ్యాసం కలిగి, వృత్తాకృతి గల రుద్రాక్షలతో ఇపుడు దేశమంతటా జరుగుతున్న వ్యాపారంలో, వంచనే ప్రధానంగా చోటు చేసుకుంది. ఒక రేగిగింజ పరిమాణంలో వుండే రుద్రాక్ష ధర కనీసం 2 రూపాయిల నుండి మొదలవుతుంది. ఉసిరికాయంత రుద్రాక్షలు 50 రూపాయిల నుండి రూ. 40,000 వరకు ధర వుంటాయి. చెక్కముక్కలతో తయారైన నకిలీ రుద్రాక్షలు కూడా 'సందట్లో సడేమియా'గా అమ్ముడవుతుంటాయి. ఒక్క ఇండోనేషియాలోనే సంవత్సరానికి 300 కోట్ల రూపాయిలు, నేపాల్లో రూ.200 కోట్ల రూపాయిల వ్యాపారం జరుగుతున్నట్లు టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రిక వెల్లడించింది. రుద్రాక్ష పొడితో తయారయ్యే కాప్సూల్స్, ఆయిల్ పాకెట్లు కూడా మార్కెట్లోకి పంపడానికి మందుల కంపెనీలు పోటీ పడుతున్నాయట. 'రుద్రాక్ష' అనే పేరు చాలు మా వ్యాపారానికి అంటున్నాయి ఆ కంపెనీలు. ప్రతి రోజూ 2000 డాలర్ల ఆన్‌లైన్ వ్యాపారం ఇండియాలోనే సాగుతోందట. ఏకముఖి నుండి 21 ముఖాల రుద్రాక్షలు గల 'ఇంద్రమాల' పేరుతో వుండే ఒక రుద్రాక్షమాల ఖరీదు ప్రస్తుతం 5 లక్షల రూపాయిలట!

హైదరాబాద్‌లో వుండే రుద్రాక్ష వ్యాపార 'స్పెషలిస్టు' ఒకరు ఏఏ ధరలకు రుద్రాక్షలను అమ్ముతున్నాడో చూడండి.

| | |
|---|---|
| 1 ముఖం గల రుద్రాక్ష – రూ. 2800 | 9 ముఖాలు గల రుద్రాక్ష –రూ. 4200 |
| 2 ముఖాలు గల రుద్రాక్ష – రూ. 1200 | 10 ముఖాలు గల రుద్రాక్ష – రూ. 3800 |
| 3 ముఖాలు గల రుద్రాక్ష – రూ. 850 | 11 ముఖాలు గల రుద్రాక్ష – రూ. 4500 |
| 4 ముఖాలు గల రుద్రాక్ష – రూ. 300 | 12 ముఖాలు గల రుద్రాక్ష – రూ. 7250 |
| 5 ముఖాలు గల రుద్రాక్ష – రూ. 50 | 13 ముఖాలు గల రుద్రాక్ష – రూ. 12000 |
| 6 ముఖాలు గల రుద్రాక్ష – రూ. 250 | 14 ముఖాలు గల రుద్రాక్ష – రూ. 38000 |
| 7 ముఖాలు గల రుద్రాక్ష – రూ. 750 | గౌరీశంకర్ – రూ. 6500 |
| 8 ముఖాలు గల రుద్రాక్ష – రూ. 2700 | గణేశ్ – రూ. 1200 |

పై రుద్రాక్షలను బంగారు, వెండి, రాగి ఆభరణాల్లో పొదిగినపుడు వాటి ధరలకు రుద్రాక్ష ధరలను కలిపి అమ్ముతారు. ఆ రకంగా తమ వంచనా వ్యాపారాన్ని

బంగారుమయం చేసుకుంటున్నారు. చెట్టు నుండి ఎండి రాలిపడిన రుద్రాక్షలను అతి తక్కువ ధరకే సేకరించి, ఏటేటా రుద్రాక్ష ఎగ్జిబిషన్‌లు పెట్టి ఉచిత కానుకలను జోడించి జనాన్ని ప్రలోభపెట్టడం వంచనా శిల్పం కాదా?

రుద్రాక్ష వ్యాపారంలో 'తలపండిన మేధావులు' బహుముఖాలుగా తమ వంచనను విస్తరింపచేసారు. 54 రుద్రాక్షలుంటే దానిని 'కంఠమాల' అన్నారు. 36 వుంటే 'కార్తికేయ మాల' అన్నారు. 27ని 'నక్షత్రమాల' అన్నారు. 9ని నవగ్రహమాల అన్నారు. ఇవిగాక శిలమాల (3 రుద్రాక్షలు), నారాయణ మాల (5) ధార్మికమాల, అర్చనామాల, లక్ష్మీ, గణేశ, సరస్వతీ, గౌరీ మాలలు కూడా ఏర్పర్చి, వాటిని ధరిస్తే ఆయాదేవతల అనుగ్రహం లభిస్తుందని నమ్మిస్తున్నారు. ఉదాహరణ సరస్వతి మాల ధరిస్తే 'పరీక్షల్లో గెలుపు' తథ్యమట! 'లక్ష్మీ' మాలతో దరిద్రం తీరుతుందట! 'గౌరీ' మాలతో యువతులకు వంచి మగడు లభిస్తాడట! ఎంతటి నయవంచనో మీరే ఆలోచించండి. ఇవన్నీ రుజువుకు నిలుస్తాయా? ఎవరైనా నిరూపించగలరా?

## కులాల్ని బట్టి కూడా.....

కులం ప్రవేశించని అంశమేదీ అసలు ఇండియాలో వుండదు కదా! రుద్రాక్షల్లోనూ అది ప్రవేశించింది. బ్రాహ్మణులకు తెల్లనివి, క్షత్రియులకు ఎర్రనివీ, వైశ్యులకు ఆకుపచ్చనివీ, శూద్రులకు నలుపువీ అయిన రుద్రాక్షలు మంచివని **రుద్రాక్షజాబాలోపనిషత్తు** చెబుతోంది. ఇలాంటి తప్పుడు రాతల్ని, పుస్తకాల్లో అచ్చువేస్తూ, వర్ణధర్మాల్ని ప్రచారం చెయ్యడం వంచనలో భాగం కాదా? రుద్రాక్షల్ని ధరించనివాడు **'అంటరానివాడని'** చెప్పి అలాంటి వారిని తాకరాదన్న ('తం త్యజేత్ అంత్యజం యథా' -రుద్రాక్ష జాబాలోపనిషత్ 1-15, 16) దుర్మార్గపు కూతల్ని వల్లించడం నేరం కాదా?

'కంఠంలో 32, తలపై 40, చెవులకు ఆరారు, చేతులకు పన్నెండు వంతున, భుజాలకు 16 వంతున, సిగలో 1, రొమ్ముపై 108 రుద్రాక్షలు ధరించేవాడు సాక్షాత్తు శివుడే' అని చెప్పిన ఆ ఉపనిషత్తు వాక్యాలకు మండిపడుతూ **ఆర్యసమాజ వ్యవస్థాపకులు దయానంద సరస్వతి** ఏమంటున్నాడో చూడండి -

"కొండొక వృక్ష ఫలబీజములయిన రుద్రాక్షలు, భస్మము ధరించిన మోక్షము లభించినెడల, బూడిదలో పొరలు గాడిద మున్నగు జంతువులు, గురుగింజలను, పూసలను ధరించు భిల్లులు, పిచ్చుగుంటల వాళ్లు ముక్తినేల పొందరు? బూడిదలో పొర్లాడు కుక్కలు, పందులు, గాడిదలు ముక్తిని పొందవనుటలో ఉచితమేమి?" (సత్యార్థ ప్రకాశం (తెలుగు), పేజీ - 262)

## రుద్రాక్షలు ధరిస్తే మనిషి జంతువుకావడమేనట!

రుద్రాక్ష వంచకుల ప్రచారాలను విన్న తర్వాత కడుపుమండిన ఆయన ఏమన్నాడో చూడండి, రుద్రాక్షలు 'శివుని కన్నీటి బిందువుల నుంచి పుట్టిన చెట్ల ఫలాల'న్న విషయాన్ని ఖండిస్తూ –

"ఆహా! ఇది ఎంతటి మూర్ఖత అనవలయును. లోకమున ఎక్కడైనా కన్నీటిబొట్టు వృక్షమగునా?..... పరమేశ్వరుడే వృక్ష బీజమును నిర్మించెనో, దాని నుండియే ఆ వృక్షముద్భవించును. మరియొక విధమున గలగదు. కావున రుద్రాక్షలు, భస్మము, కమలాక్షలు, గడ్డి, గాదము మున్నగునవి కంఠమును ధరించుట **'మనుష్యుడు అడవి జంతువుగా వర్తించుటయగును'** (పై గ్రంథమే, పేజీ : 262, 263)

రుద్రాక్ష మహత్తును వర్ణించేవారు రుద్రాక్షధారణ ముక్తికి మార్గమంటారు. శివపురాణంలో సుభీషణుడనే బ్రాహ్మణుని కథను ఉదహరిస్తారు. బ్రాహ్మణ్యాన్ని విడిచి, ధూర్తుడై, గురుపత్నిని భోగించి, వెలివేతకు గురై, అడవికి చేరి, మద్యపానలోలుడై, దొంగగా బాటసారులను దోచుకుంటూ బతికిన ఆ బ్రాహ్మణుడు, చనిపోతే యమదూతలు వచ్చారట తీసుకుపోవడానికి అదే సమయంలో శివదూతలు వచ్చి, వారిని అడ్డుకుని, సుభీషణుడు మరణించిన చోట నేలను తవ్వించారట. పదిబారల లోతున ఒక రుద్రాక్ష వుందట. కనుక అతడు యమలోకానికి కాక, శివలోకానికి అర్హుడని వాదించి తీసుకెళ్ళారట. ఎవరెన్ని తప్పులు చేసినా, రుద్రాక్ష ధరిస్తే అవన్నీ తప్పులు కాకుండా పోయి, వారు మంచి అవుతారన్నమాట! ఇందుకోసం రుద్రాక్షలు ధరించాలా? ధరించేవారు ఆ ఉద్దేశంతోనే ధరిస్తున్నారనుకోవాలా?

ఇలాంటి చెడునీతిని బోధించే కథల్ని రాతల్ని ఎద్దేవా చేస్తూ దయానంద సరస్వతి ఏమంటున్నాడో చూడండి –

"....... రుద్రాక్షలు, భస్మము ధరించువారిని జూచి, యముడునతని దూతలు భయపడిన ఇటు లోకమున పోలీసులు కూడా వారిని చూసి భయపడుచుండవచ్చు. ఈ భస్మధారులను చూచి కుక్క, పిల్లి, సింహము, తేలు, ఈగ, దోమ, పాము మున్నగు క్షుద్రదేవతలే భయపడనప్పుడు న్యాయాధీశుని సేవక గణమేల భయపడును?" (పేజీ : 262, 263)

రుద్రాక్ష ప్రచార వంచకులారా, వింటున్నారా! ఆధ్యాత్మిక వేత్త, వేద వేదాంత పారంగతునిగా పేరుపొందిన దయానంద సరస్వతి మీ వాదనకు ఎలాంటి వాతలు పెడుతున్నాడో గమనించారా! ఆయనొక్కడే కాదు, వివేకమున్న ప్రతి ఒక్కరూ మీ వంచనను ఇలాగే ఈసడిస్తారు.

ఇవాళ మనరాష్ట్రంలోనే రుద్రాక్ష వ్యాపారంతో ప్రతి ఏటా కోట్లాది రూపాయల వ్యాపారం జరుగుతోంది. దేశమంతటా చూస్తే అది వందల కోట్లల్లో వుండవచ్చు. ఇదంతా ఎవరినుద్ధరించడానికి? ప్రజలకు, సమాజానికి ఒక్కమేలైనా రుద్రాక్షల వల్ల కలుగుతుందా?

ప్రపంచ బ్యాంకు అంచనా ప్రకారం భారతదేశంలో 45-60 కోట్ల మంది పేదలున్నారు. వారంతా చదువులేక, తిండిలేక, అనారోగ్యంతో కునారిల్లుతున్నారు. రుద్రాక్షలు తమ మహాశక్తితో ఏ ఒక్కరి ఆకలినైనా, అనారోగ్యాన్నైనా తీర్చగలవా? రుద్రాక్ష పేర ఏర్పడిన భ్రమలతో, తప్పుడు నమ్మకాలతో వాస్తవాలను విస్తరిస్తున్న అభాగ్యుల, అమాయకుల కళ్ళు తెరిపించడానికి మార్గం లేదా? జరిగే వంచనను తెలియచేసి, దానిని నిర్మూలించడం అవసరం కాదా?

మన సమాజంలో వెర్రి వేయి విధాలుగా విస్తరించి వుంది. దాన్ని ఎదుర్కోవడానికి శాస్త్రీయస్పృహ గల లక్షలాది ప్రచార సైనికులు కావాలి. మనమూ ఆ సైనికుల్లో వున్నామా? ఎవరికి వారు వివేకంతో జవాబు చెప్పుకోవాలి. అలాంటి వివేకం మనలో తగ్గిపోతే, ఈ వ్యాసం మొదట్లో చెప్పుకున్న కృష్ణమూర్తిలా మారిపోతాం. వంచనా వ్యాపారంలో చిక్కి అనైతికతకు బాధ్యులమవుతాం. మనం లెక్చరరా, ప్రొఫెసరా, డాక్టరా, యాక్టరా, ఇంజనీరా, శాస్త్రవేత్తా అన్నది మన వృత్తిపరమైన స్థాయిని తెలియచేసేది కావచ్చు. కానీ, అంతకంటే ఉన్నతమైనది – 'ఇంగితం'. దాన్ని కోల్పోతే మనిషితనాన్ని చాలావరకు కోల్పోయినట్లే.

'ఇంగితజ్ఞానం' తగ్గిపోతుండడం ప్రస్తుత సమాజంలో కన్పించే అన్ని అవలక్షణాలకు కారణం. సహజంగా ఏర్పడే హేతుత్వ ధోరణిని మూఢత్వానికి బలిపెడుతూ, తన కష్టాలకు, సుఖాలకు, రోగాలకు, భోగాలకు, విషాదాలకు, ఆనందాలకు కారణాలను జ్యోతిష్యంలోనో, వాస్తులోనో, రుద్రాక్షల్లోనో, రంగురాళ్ళలోనో, మంత్రాల్లోనో, తాయెత్తుల్లోనో వెతుక్కునే అతి నీచ ఆలోచనా రీతిని ఆశ్రయించి వున్నంతకాలం జనం దోపిడీకి గురవుతూనే వుంటారు. ఏది సరైనదో, ఏది సరికాదో తెలిపే 'ఇంగితం' పెరగనంత కాలం భంగపడుతూనే వుంటారు. ఒక వంచన నుంచి మరో వంచనకు బలి అవుతూనే వుంటారు. కనుక ఇపుడు కావల్సింది, జనంలో ఇంగిత జ్ఞానాన్ని పెంచడం. ఆ జ్ఞానం వున్నవారు, లేనివారికి దానిని అందించడం ఒక బాధ్యతాయుత కర్తవ్యం. మీరు అలాంటి కర్తవ్యతాపరాయణులయితే 'రుద్రాక్ష వంచన' గురించి వెంటనే పదిమందికీ చెప్పడం మొదలుపెట్టండి.